Marler, F. L.
అజ్ఞాతదేశసంచారి / by F.L. Marler.- 1st ed.- Madras: Christian Literature Society for India, 1926.
viii, 205 p. : ports. ;18 cm.
Record no. 734

Marler, F. L.
Ajñātadēśasañcāri / by F.L. Marler.- 1st ed.- Madras: Christian Literature Society for India, 1926.
viii, 205 p. : ports. ;18 cm.
Record no. 734

# David Livingstone

## అజ్ఞాతదేశ సంచారి



MARLER







CHRISTIAN LITERATURE SOCIETY FOR INDIA
MADRAS ALLAHABAD RANGOON COLOMBO
1926
[1 E. 2 M.



మకలోలో వీరుడు తన పూర్వీకుల పరాక్రమమునుగురించి చెప్పుకొనుట

# DAVID LIVINGSTONE

అజ్ఞాత దేశ సంచారి

Angatadesa. Sansari

Rev. F. L. MARLER




FIRST EDITION



CHRISTIAN LITERATURE SOCIETY FOR INDIA

MADRAS ALLAHABAD RANGOON COLOMBO

1926




# పీఠిక

తూర్పుదేశ భాషలలోకెల్ల శ్రావ్యమైనదనదగు ఆంధ్రభాషయందు గ్రంథములు బహు అరుదు. అందు క్రైస్తవుల కుపయుక్తములగు గ్రంథము లతి స్వల్పము. ఇందుకు కారణము లనేకములు. ఆంధ్ర క్రైస్తవులలో కవులు పదివేలమంది కొక్కరైనను లేకుండుట; ఉన్నవారైనను పుస్తక రచనకు పూనుకొనకుండుట; పూనుకొన్నను క్రైస్తవులు వారి పుస్తకముల యెడల ననాదరణ జూపుట. ఇత్యాది కారణములచే ఆంధ్ర క్రైస్తవ పుస్తక భాండాగారము అభివృద్ధి నొందజాలకున్నది.

ఇట్టి సందర్భమున మద్రాస్ క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీవారు ఈ కొదువను దీర్చుటకు పూనుకొనుట ప్రశంసనీయము. రెవ. ఎఫ్. ఎల్. మార్లర్ గారిందువిషయమై జేయుచున్న పరిశ్రమ శ్లాఘనీయము; వీరెట్టి పుస్తకమునైనను సావధానముగ సాధింప జూచుట గొప్ప సాహసము; సువార్త ప్రచారిక వీరుడగు డేవిడ్ లివింగ్‌స్టన్ యొక్క జీవ చరిత్రను వీరిప్పుడు వ్రాసి ముగించుట యొక ఉపకారము.

డేవిడ్ లివింగ్‌స్టన్ మృతినొందియు బ్రతికియున్నవాడే. ఆంగ్లము నందతని నామమున కర్థము జెప్పిన నది సార్థక నామమగును. అతడాఫ్రికా ఖండమునం దడుగుబెట్టి క్రీస్తు రాజ్యాభివృద్ధికొరకు జేసిన సేవ ప్రసిద్ధమైనది. అత్యుష్ణ ప్రదేశములందు, అప్పటి కాలమం దతిభయంకరులుగ గన్పట్టుచుండిన ఆఫ్రికనులమధ్య డేవిడ్ లివింగ్‌స్టన్ జూపిన స్వార్థత్యాగము నిజముగా నమూల్యమైనది. సువార్త సేవయం దప్పుడప్పుడు నిరుత్సాహమును నిశ్చింతయు గనబరుచు సేవకులయెదుట నీ సద్భక్తుని జీవచరిత్ర యొక సజీవ స్తంభమువలె నిలువబడి వారి సమస్త నిశ్చింత నిరుత్సాహములనుబట్టి వారిని మందలించి, ఈ మహోన్నత సేవయందు వారికి నూతన ఆసక్తిని పుట్టించును.

ఈ వీరుని చరిత్ర మిదివరకే ఆంగ్లమునుండి ఆంధ్రమునకు తర్జుమా చేయబడియున్నదిగాని మార్గ్లర్ గారు విశేష పరిశ్రమచేసి ఆది ప్రతులనుండి సంగతులను సంగ్రహించి వాటి నిప్పుడొక నూతన పొత్తముగా గూర్చి ఆంధ్ర క్రైస్తవ లోకమున కందించుచున్నాడు. దీనియందలి శైలి సులభ మైనదిగను శ్రావ్యమైనదిగ నున్నది. ఈ పుస్తకములో కుప్పతెప్పలుగా గనబడు సామితెలు సాదృశ్యములు పాఠకుల నాకర్షించకమానవు.

కావున నిట్టి సత్కార్యమును సాధించిన మార్గ్లర్ గారికి మా అభి వందనములు. ఈ చిన్న పుస్తకము ఆంధ్ర క్రైస్తవులకు అత్యంత ప్రయోజనకరముగ నుండునని పూర్ణముగ నమ్ముచున్నాడను.

డోర్నకల్ ⎫ వే. సా. అజర్యా
అక్టో 18-వ. తేది 1926 సం॥ ⎭ డోర్నకల్ బిషప్

# విషయ సూచిక

# పటముల జాబితా

# పటముల జాబితా





లివింగ్‌స్టన్ బాల్యమందు పనిచేసిన ప్రత్తిశాల శిథిలములు

# 1 టి. అధ్యాయము

## డేవిడ్ లివింగ్‌స్టన్‌గారి బాల్య చరిత్ర

మన కథానాయకుని పేరు డేవిడ్ లివింగ్‌స్టన్. ఈ పేరు ఇంగ్లీషు విధముగా వ్రాసినందున మీరొకవేళ చదివినతోడనే గుర్తెరుగలేరేమో. అయినను ఈ పేరుగల యౌవనుని చరిత్రను మీరు పలుమారు బైబిలులో చదివి మహారాజైన దావీదు తన బాల్యకాలమందు చేసిన పరాక్రమ కార్యములను తెలిసికొని ఆనందించియున్నారుగదా. ఆ మహారాజునకును మన కథానాయకునికిని ఒకటే పేరుండుటమాత్రముకాక ఆ దావీదువలెనే ఈ డేవిడ్‌కూడ లోకప్రసిద్ధిగాంచి, మహా పరాక్రమముగల కార్యములనుచేసి జనకోటి సన్నుతికి యోగ్యుడాయెను. ప్రపంచ చరిత్రలో మహారాజైన దావీదు కీర్తి నిలుచునంతవరకు ఈ డేవిడ్ కీర్తియు నిలిచి యుండును. ఈ సుప్రసిద్ధుడు ఆన 1813 వ. సం॥ మార్చినెల

19 వ. తేదీన స్కాట్లాండు దేశములోని గ్లాస్‌గో అను జన బాహుళ్యమగు పట్టణమునకు సమీపముననున్న బ్లాంటైర్ అను పల్లెయందు జన్మించెను.

అతని జననీజనకులు ఎన్నికలేని బీదలైయుండినను దైవ భక్తిగలవారు గనుక బాల్యమునుండియు తమ బిడ్డలను దైవ భక్తియందు పెంచి వారు సన్మార్గముగాను మర్యాదగాను జీవించునట్లు వారికి నేర్పుచు వచ్చిరి. తల్లి చాలు పిల్లకు తప్పదు గనుక మన డేవిడ్ తన చిన్న ప్రాయమందు నేర్చుకొన్న నీతిని మనస్సున దాచుకొని వయస్సుకు వచ్చిన తరువాత ఆపతి మొక్కులు సంపతి కుంట్లన్నట్టు జీవించుకొనక తన తల్లి మార్గము ననుసరించి తన సమస్త కార్యములయందు దేవుని ఘనపరచ ప్రయాసపడినవాడాయెను. అతడు మట్టుమర్యాద నెరుగని కిరాతులమధ్య సంచరించుచుండినను వారాయన సద్గుణ లక్షణములకు మెచ్చుకొని ఆయన ఒక దివ్య దైవ జనుడని మిగుల సన్మానించిరి. డేవిడ్ తన తల్లి సద్బోధను అష్టైశ్వర్యమునకు సమానముగా నెంచి ఆమె హితోపదేశ ప్రభావమువలన ఆమెకు వ్యసనమును దేవుని కవమానమును కలుగకుండ జీవించి, బాలుడైన యేసువలె దేవుని దయయందును మనుష్యుల దయయందును వర్ధిల్లుచుండెను. పావన యౌవనము పూజనీయమైన వృద్ధాప్యమునకు మూలము.

డేవిడ్ తల్లిదండ్రులకు ముగ్గురు కుమారులును ఇద్దరు కుమార్తెలును కలిగిరి. వారిలో పెద్దవాడు మన డేవిడే గనుక బీదవారైన అతని తల్లిదండ్రులు కుటుంబపోషణకు కష్టపడు



చుండగా అతడు తన తమ్ముళ్లను చెల్లెండ్రను చూచుకొనుచు, వారిని వేళకు సరిగా బడికి తీసికొనిపోయి బడి విడచినతోడనే వారు చెడ్డపిల్లల జతలోచేరి తుంటరిచేష్టలు నేర్చుకొనకుండ వారిని చక్కగా ఇంటికి తీసికొనిరావలసియుండెను. బడి విడిచినతోడనే డేవిడ్ తన తమ్ముళ్లను వెంటబెట్టుకొని జేబులో కొన్ని తిండి బండములు వేసికొని పూలు జమచేయుటకై చాల దూరముననుండిన కొండ గుట్టలకు పోయి ఆ బయలు ప్రదేశములలో తిరుగుటకద్దు. నాటకము చూచువారికి ఏలాగు ప్రొద్దుతెలియకుండపోవునో ఆలాగే అడవిలోని వినోదములను చూచుచుండిన ఈ కుర్రవాండ్లకు కూడ ప్రొద్దుతెలియకుండపోయెడిది. ఒకనాడు డేవిడ్ ఏదో ఒక అడవి పుష్పమును తేవలెనని బహుగా కోరెనుగాని ఎక్కడను అది కనబడనందున దాని నేలాగైనను తెచ్చే తీరవలెనని అతడు శపథముచేసికొని దానిని వెదకుచు కొండలలో చాలా దూరమువరకు పోయెను. కడకు అతడు వెదకుచుండిన పుష్పము దొరికెనుగాని అంతలో ప్రొద్దు చాలా వ్రాలియుండెను గనుక అతడు కుందేలి వేగిరముతో వరుగెత్తివచ్చినను ప్రొద్దుగుంకులోపల ఇల్లుచేరలేకపోయెను. ఇతని తండ్రి తన పిల్లల క్షేమార్థమై కొన్ని యేర్పాట్లుచేసి వాటి విషయములో మిగుల ఖండితముగా నడుచుకొనుచుండెను. చీకటి పడిన తరువాత యౌవనులక్కడక్కడ తిరుగుట క్షేమకరము కాదని యెంచి ప్రొద్దుగ్రుంకకమునుపే బిడ్డలందరు ఇల్లు చేరియుండవలసినదని ఏర్పాటుచేసి ప్రొద్దుగ్రుంకినతోడనే ఇంటి తలుపు మూసి గడియ వేయుచుండెను. మన డేవిడ్

ఆ పుస్తకముకొరకు వెళ్లియుండిననాడు సకాలములో ఇల్లుచేరలేకపోయెను గనుక అతడు వచ్చుసరికి అతని తండ్రి తలుపు మూసి గడియవేసియుండెను. ఇట్లుండగా తలుపు తట్టుటవల్ల ప్రయోజనమేమియులేదని యెరిగి అతడు బయటనే రాత్రి గడపవలెనని నిశ్చయించి, పొరుగింటివారిదగ్గరకు వెళ్లి ఒక రొట్టెముక్క ఇప్పించుకొని కడపమానిమీద కూర్చుండి తిని అట్లే నిద్రించెను. డేవిడ్‌కు అతని యింటిలో భోజనము దొరకదని అతని పొరుగింటివారెరిగి ఆకలిగొనియుండిన ఆ పిల్లవాని విషయము మిగుల సంకటపడి వానికి కావలసిన రొట్టెముక్కను ఊరకయే అతని కియ్యగోరిరిగాని ఎవరియొద్దను ఏదియు ఉచితార్థముగా పుచ్చుకొనక డబ్బిచ్చి కొనవలెనని డేవిడ్ తండ్రి బహు ఖండితముగా చెప్పియుండినందున అతడు తన చిత్తిలో నుండిన డబ్బులలో ఒక అణా యెత్తి రొట్టెముక్కకుగాను వారికిచ్చెను. మనవల్లనే కాగలిగిన కార్యమును ఇతరులవల్ల చేయించుట మనకు ధర్మము కాదనియు తిరిపమెత్తుకొని జీవించుట నీచాది నీచమనియు డేవిడ్ యొక్క పెద్దలతనికి నేర్పియుండిరి గనుక అతడు తన యవసరమునకు కావలసిన రొట్టెముక్కను సహితము ఊరకయే తీసికొనడు. మామూలు భోజనమునకు ప్రతిగా మన డేవిడ్ ఆనాడు నాస్త తిని కడపమానిమీద కూర్చుండి నిద్రపోయెను. నిద్రలో నతడు తాను యాకోబువలె ఒక భయంకరమైన యడవిలో పండుకొనియుండినట్టును, ప్రకాశమానమైన దేవదూతవచ్చి తన్నాదరించి నవరత్న ఖచితమైన రథమున కూర్చుండబెట్టికొని బహు దివ్యమైన సుఖక్షేత్రము



నకు తీసికొనిపోయి మల్లెల పాన్పుమీద శయనింపజేసినట్టును, కలగనెను. ఉదయమున ఆ బాలుడు మేలుకొనగా తాను కన్న కల నిజమైనట్టు తెలిసికొనెను. ఎట్లనిన, డేవిడ్ నిద్రపోయిన తర్వాత అతని తల్లి తన కొడుకు బయట పండుకొనియుండుటను చూచి వ్యసనపడి, అర్ధరాత్రివేళ లేచివచ్చి ఆ పిల్లవాని నెత్తుకొనిపోయి పడకమీద పరుండబెట్టెను.

మన డేవిడ్ యొక్క బాల్యకాల సంతోషము త్వరలోనే ముగిసిపోయెను. అతని తలిదండ్రులు కడు బీదలైనందున అయిదుగురు బిడ్డలను పోషించుటకు కావలసిన ధనము సంపాదించలేక బహు కష్టపడుచుండిరి గనుక చిన్నవాడైన డేవిడ్ ఏదో ఒక కష్టముచేసి డబ్బు సంపాదింపవలసి వచ్చెను. కాబట్టి అతడు పదేండ్ల ప్రాయముగలవాడై యుండగానే అతని తండ్రి ఆ యూరిలోని దూది యంత్రశాలలో అతనికి పని యేర్పాటుచేసెను. ఆ కార్ఖానాలో నూలు వడికెడి యంత్రము లనేకములుండును. ఒక్కొక్క యంత్రమున కనేక ఏకులనెక్కించి నూలు వడికెదరు. ఒక్కొక్క సమయమున పోగు తెగుటకద్దు గనుక ఆ సంగతి కనిపెట్టుటకు ఒక్కొక్క యంత్రమునకు ఒక పిల్లవాని నియమింతురు. వేగిరముగా తిరుగుచుండు ఆ పోగులను కనిపెట్టి అవి తెగినతోడనే అతుకువేయుట ఆ పిల్లవాని పని. మన డేవిడ్ ఈ విధముగా పనిచేయుచు కొంత డబ్బు సంపాదించి తలిదండ్రులకు సహాయము చేయుచుండెను. ఈ పదేండ్ల ప్రాయముగల పిల్లవాని బ్రతుకు బహు కష్టతరమైనది. తెగిపోయిన పోగులను అతికించుట భారమైన పని కానప్పటి

కని వాడు ఉదయము అయిదుగంటలకు లేచి ఫలహారము తిని ఆరుగంటలకు కార్ఖానా చేరి పని చేయవలసియుండెను. ఆ మీదట మధ్యాహ్నము భోజనమున కొక గంటసేపు మాత్రము విరామము కలుగును. పిమ్మట సాయంకాలము ఎనిమిదిగంటలవరకును ఆ చట్టముదగ్గరనే నిలుచుండి సారి సారికి తెగుచుండిన దారమును అతికించవలసియుండెను. చిన్నప్రాయమందు డేవిడ్ చేసిన పని అతడు పెద్దవాడైన తర్వాత చేయబోవు పనికి సూచనగా నుండెను. ఎట్లనిన, అతడేలాగు ఆ యంత్రశాలలో తెగిపోయిన దారముల నతికించెనో ఆలాగే ఆఫ్రికా ఖండమునకు వెళ్లి పాపమువలన చెడిపోయిన అనేకుల బ్రతుకులను చక్కపెట్టుచు వచ్చెను.

డేవిడ్ చేయుచుండిన పనికి ఎక్కువ సామర్థ్యము అగత్యములేదు గనుక అతని జీతము స్వల్పమే. అయినను తాను కష్టపడి సంపాదించిన ఆ మొత్తము చేతికి వచ్చినప్పుడు అతడు బహుగా ఉప్పొంగినవాడాయెను. పదియేండ్లప్పుడే పనిచేసి జీవనోపాధి సంపాదించవలసిన కుర్రవానికిక విద్య నేర్చుకొనుట కేమి యవకాశముండును? అయినను తేనె రుచి యెరిగినవాడు కడుపునిండ త్రాగ నాశపడునట్లు కొంచెముగా చదువు నేర్చుకొన్న మన డేవిడ్ కొండంత యాశపెట్టుకొని, ఎటులైనను పట్టపరీక్ష నిచ్చి బి. యే. ఎం. యే. బిరుదాంకమును పొందవలెనను వ్యామోహమును తన మనస్సున పెంచెను. అయినను మంత్రాలకు మామిడి కాయలు రాలవని యెరిగి తన కోరికను ఈడేర్చుటకు తానే ప్రయాసపడుచువచ్చెను. మన దేశములో నెందరో పడుచు



వారు డేవిడ్‌వలెనే విద్యావిత్తమున కాశపడి, ఒక మిషను వారైనను ధర్మకర్తలైనను తమ కేదో ఒక ఏర్పాటుచేసి విద్యను ప్రాప్తింపజేయవలెనని గొంతెమ్మ కోరికలు పెట్టుకొని తాము ఊరకయే కాలయాపనము చేయుదురు. శిఖరము చేరగోరువారు కొండ నెక్కవలెనన్నట్లు మనము పెట్టుకొను అభిలాష మన స్వయత్నమువల్లనే నెరవేరవలెనను డేవిడ్ బాల్యప్రాయమున నేర్చుకొన్న నీతి మనకును అవసరమే. మొదటి వారమున తాను సంపాదించిన డబ్బుతోనే డేవిడ్ తన యభిలాషను నెరవేర్చ మొదలుపెట్టెను. ఆ యూరిలో పాతపుస్తకముల నమ్మెడి యంగడి ఒకటి యుండెను. అక్కడ పుస్తకములు చౌకగా దొరుకునని మన డేవిడ్ ఎరిగి తనకు కావలసిన పుస్తకమును కొనబోయెను. అది ఒక వినోదార్థ కథల పుస్తకమైనను, ఒక నాటక పుస్తకమైనను, ఒక పద్యకావ్యమైనను, యౌవనులు ముచ్చటగా చదువుకొను పుస్తకమైనను కాదుగాని ఒక లాటిన్ భాష వ్యాకరణమే. పదియేండ్ల పసిబాలుడైన మన డేవిడ్ ఆ యంగడికి పోయి పుస్తకము నడిగినప్పుడు ఆ పుస్తకశాల యజమానుడు ఆ బీద పిల్లవాడా పుస్తకము నడుగుటను చూచి బహుగా ఆశ్చర్యపడెను. ఆయన లాటిన్ వ్యాకరణ పుస్తకమునెత్తి డేవిడ్ చేతికియ్యగా అతడు దాని వెలయిచ్చి పట్టరాని సంతోషముతో ఇంటికి తీసికొని వెళ్లి, తన తల్లికి చూపి, మిగతపైకము నామెచేతికిచ్చెను. నాడు డేవిడ్ రెండణాలిచ్చి కొన్న ఆ పుస్తకమే అతని విద్యకు అస్తిభారము.

అతడేలాగు విద్యాభ్యాసమునకు వీలుకలుగజేసికొనె

నని అడుగుదురా? చెప్పెదను వినుడి. డేవిడ్ చేయుచుండిన పనిలో ఒకడు ఒళ్లంతా కన్నులుపెట్టుకొని ఉండవలసివచ్చినను ఒక్కొక్క సమయమున కొన్ని నిమిషములవర కెక్కడను పోగు తెగకుండును గనుక డేవిడ్ దూరమునుండి కనబడునట్లు తన పుస్తకమును ఆ చట్టముపైన పెట్టుకొని గోరంత విరామము కలిగినప్పుడెల్లను దానిలో నాలుగు మాటలు నేర్చుకొని కంఠపాఠము చేయుచుండెను. ఈలాగు డేవిడ్ ఒక ప్రక్క ఉదరపోషణకు కష్టము చేయుచుండగానే మరియొకప్రక్క జ్ఞానాభివృద్ధినొందుచువచ్చెను. దినమునకు పదునాలుగు గంటలసేపు కష్టముచేసిన బాలుడు అది తీరినప్పుడు తన చెలికాండ్లతో కలిసి ఆటలాడుకొనుట సహజమేగదా. అయినను డేవిడ్ ఆలాగుచేయక పని ముగిసిన వెంటనే ఒక బడికిపోయి రాత్రి ఎనిమిది గంటలనుండి పది గంటలవరకు పాఠములు చదువుకొనుచుండెను. సాధారణముగా పదియేండ్లబాలుడు రాత్రి పది గంటలకు అలసిసొలసి నిద్రమత్తుడైయుండునుగదా. అయితే డేవిడ్ అప్పటికికూడ పండుకొనక తిరిగి పుస్తకములు తీసికొని అర్ధరాత్రివరకును చదువుచుండువాడు. ఒక్కొక్క సమయమున అతని తల్లివచ్చి అతని చేతిలోని పుస్తకములు పెరుక్కొని దీపము నార్పి అతనిని పడకదగ్గరకు త్రోసికొనిపోయెడిది. భల్లూకపు పట్టుదలతో ఇన్ని పుస్తకములు చదివిన డేవిడ్‌కు అన్నిటికంటె శ్రేష్ఠమైన ఒక గ్రంథరాజముమీద మిగుల ప్రీతి కలిగెను. ఆ గ్రంథమేదనగా, దైవ చిత్తమును తెలిపెడి సత్యవేదమే. దేవునియందలి భయము జ్ఞానమునకు మూలమను నీతిని



Page 8

లివింగ్‌స్టన్ లాటిన్ వ్యాకరణము కొనుట

డేవిడ్ పసిప్రాయముననే నేర్చుకొని, దైవజ్ఞాన నిధియగు సత్యవేదమును సన్మానించుచు, దాని విధులప్రకారము నడుచుకొనుటమాత్రముకాక దానివలన కలుగు భాగ్యమును ఇతరులకు ఎరిగించుచుండెను. పిమ్మట డేవిడ్ గాఢాంధ మండలమను పేరుచెందిన ఆఫ్రికా దేశమునకు పోయి, తెల్లవారెన్నడును చూడని అనాగరికుల మధ్యసంచరించుచు నీతిసూర్యుడగు యేసునుగురించి మిగుల ఆవేశముతో తెలియజేయుచువచ్చెను. "మీరు లోకమునకు వెలుగువంటివారై యుండవలెనని" యేసు ప్రభువు తన శిష్యులతో చెప్పిన మాటలు మనస్సున నుంచుకొని డేవిడ్ తానెక్కడ వెళ్లినను సువార్తయను దివిటీ పట్టుకొని ఇతరులకు వెలుగు చూపించెను. చదువరీ! నీ చుట్టుపట్లనుండు అంధకారము తొలగిపోవునట్లు నీవలన వెలుగు కలుగుచున్నదా?

మన డేవిడ్ ఆ యంత్రశాలలో ఒకటి రెండు సంవత్సరములు పనిచేసిన తరువాత పైయధికారులతని పనికి మెచ్చుకొని అతడింకను లేతవాడైయుండినను అతనిని నేతపనికెక్కించి, ఎక్కువ జీతమిచ్చిరి. అయినను జీతమెక్కువైనందుచేత ఈ దేశపు బాలురవలె పక్కాకు, బీడీలు, నస్యము, చిరుదిండ్లు మొదలగు వ్యర్థమైనవాటికి డబ్బు ఖర్చుపెట్టక, తాను మొదటినుండి మనస్సున పెంచుకొన్న యోచనను సఫలపరచుటకుగాను డబ్బు కూడబెట్టుచుండెను. అతడు విద్యమీదనే తన గురియంతయు నిలిపినట్లు మనము చూచితిమిగదా. ఆ కారణముచేత అతడు బహు మితముగా బ్రతుకుచు తన విద్యకు కావలసిన డబ్బు సేకరించుచువచ్చెను.

స్కాట్లాండ్ దేశపు విద్యార్థులనేకులు ఒక్కప్రొద్దులు చేసి సరస్వతీ దేవుని పూజించుట వాడుక గనుక డేవిడ్ కూడ ఆ పద్ధతి ననుసరించి ఇతరభోగములను విసర్జించి ఈ భాగ్యమును సంపాదింప నిశ్చయించుకొనెను. దూర దేశములకు పోయి అన్యజనులమధ్య సంచారముచేసినవారి ప్రయాణముల వింతలనుగూర్చి వినుట డేవిడ్‌కు అతిప్రీతికరము గనుక, అతడా వింతలను విశేషముగా తెలిసికొనినందున ఆ దేశములను జనులను కన్నులార చూడగోరెను. అయినను వేడుకబుద్ధిని తృప్తిపరచుటకై కాదుగాని అన్యదేశస్థుల యజ్ఞానమును, వారి దుస్థితిని, అనాగరికమును తెలిసికొని వారి క్షేమముకోరి తనకు సాధ్యమైన సహాయము చేయువలెనను అభిలాషగలిగి పోగోరెను.

అతడు నేతగాడై ఎక్కువ జీతము సంపాదించుటవలన అధిక విద్యాభ్యాసమునకు తగిన యేర్పాటు చేయగలిగియుండెనుగాని అది కష్టసాధ్యమైన యేర్పాటే. అతడు తనకు వచ్చేజీతమును విద్యకు కట్టవలసిన జీతమును గమనించుకొని సంవత్సరములోని మొదటి ఆరునెలలు కష్టముచేసి మితముగా జీవించినయెడల మిగత ఆరునెలలు కళాశాలలో చదువవచ్చునని నిశ్చయించుకొనెను. ఈ కార్యమును కొనసాగించుటయందు డేవిడ్ ఎవరి సహాయమునైనను కోరక తన స్వకష్ట ఫలితమే చాలునని తీర్మానించుకొనెను. స్వాతంత్ర్యము స్వర్గలోకము, పరతంత్రము ప్రాణ సంకటమన్నట్లు మన లివింగ్‌స్టన్ ఒక మిషన్‌సభవారిని ఆశ్రయించుటవల్లనైనను ఒక సాహుకారియొద్ద ద్రవ్యము ఇప్పించు



కొనుటవల్లనైనను ఉన్నతపదవి స్వీకరింప యత్నించక దేవుని మీద భారమువేసి తాను పడవలసిన పాట్లన్ని పడి, స్వయత్నమువల్లనే తన కార్యమును నెరవేర్చెను. చదువరీ! ‘నేను దిక్కుమాలిన పక్షిని’ యనుకొనక దృఢచిత్తునికి అసాధ్యమైన కార్య మొకటియు లేదని యెరిగి లివింగ్‌స్టన్‌వలె నీవును నీ స్వంత క్షేమాభివృద్ధికొరకు పాటుపడుము.

డేవిడ్ ఇతర దేశములనుగురించి చదువుచు అక్కడి వ్యాధిగ్రస్తులు వైద్యసహాయము దొరకక అనుభవించు కష్టప్రయాసములు తెలిసికొని, మిగుల విచారపడి ఆ విషయమందు వారికి సహాయముచేయునట్లు వైద్యము నేర్చుకొనవలెనని తీర్మానించుకొనెను. బీదవారికి సామాన్యవిద్య లభించుటయే దుస్సాధ్యమైయుండగా ఈ గొప్ప విద్య వారికి ప్రాప్తించుట ఎంతటి కష్టమో చదువరులే ఊహింతురుగాక. అయినను డేవిడ్ దేవునిరాజ్యముకొరకు తాను చేయవలసిన సేవ ఇదియేయని ప్రార్థనపూర్వకముగా తెలిసికొన్నమీదట ఈ కార్యమునకు వెనుకతీయకయు పట్టువదలకయు విశ్వప్రయత్నము చేసెను. ఒక సంవత్సరము చదివిన తర్వాత డేవిడ్ లండన్ మిషనేరి సొసైటీ సభవారి కొక యుత్తరము వ్రాసి తాను అన్యదేశమునకు వెళ్లి సువార్తను చాటింప సిద్ధముగా నున్నానని తెలియజేసెను. ఆ సభవారప్పటికి ఏ సంగతియు తీర్మానించక, లివింగ్‌స్టన్ వైద్యశాస్త్రము పూర్ణముగా చదివిన పిమ్మట తమ యభిప్రాయము దెలుపుదుమని ప్రత్యుత్తరమిచ్చిరి. కాలక్రమముగా నతడు పరీక్షలన్నిటిలో కృతార్థుడాయెను గనుక సొసైటీవారతని చూచి, నీవు

వేదము చదివి ప్రసంగముచేయు సామర్థ్యము సంపాదించుకొనునట్లు ఒక విద్యాశాలకు పంపింతుము. అక్కడ నీవు బాగా పనిచేసి మంచి యోగ్యత సంపాదించుకొంటివేని నిన్నంగీకరింతుమని చెప్పగా, లివింగ్‌స్టన్ అందుకు సమ్మతించి ఆంగర్ అను ఊరుచేరి తనకు నియమించబడిన విషయములను చదువ మొదలుపెట్టెను. గురిగింజ ఎంత ఎర్రనిదైనను నలుపుండి తీరవలెనన్నట్లు ఎటువంటి బలపరాక్రమశాలురకైనను ఏదో ఒక లోపముండకతీరదు గనుక మన లివింగ్‌స్టన్ గారు ఇతర విషయములలో మిగుల గట్టివాడైయుండినను వాక్చాతుర్యముమట్టుకు సున్న. అతడు సభలో నిలిచి, ఉపన్యాసము చేయజాలకుండెను. ఒక ఆదివారమున అతడు దైవారాధనను నడిపించి ప్రసంగము చేయవలసియుండెను. ప్రసంగముచేయు గడియ రాగా అతడు తానేర్పరచుకొన్న వేద వాక్యమును జనులకు చదివి వినిపించిన తర్వాత ఒకటి రెండు క్షణములట్లే నిలిచి, జనులవైపు చూచి, అయ్యలారా, నా బుద్ధి పెడతలపట్టిపోయినది. నేను చెప్పదలచినదంతయు మరచిపోయినానని చెప్పి అవసరముగా గుడివిడిచిపోయెను. అయినను అందునుబట్టి అతడు విచారపడక ఆ విషయమందే అధిక శ్రద్ధవహించుకొని తరువాతి కాలమందు గొప్పగొప్ప సంఘములయెదుట ఉపన్యాసములు చేసి అందరి శ్లాఘనకు పాత్రుడాయెను.

లివింగ్‌స్టన్ చీనాదేశమునుగురించి ఎక్కువగా చదివి ఆ దేశస్థులయందు మిగుల అభిమానముగలిగి అక్కడికే సువార్త రాయబారిగా పోవలెనను అభిలాషగలవాడై యుం




దక్షిణ ఆఫ్రికాలోని ఒక బెచ్వానా గ్రామము

డెను. అయినను తానొకటి తలంచిన దైవమొకటి తలంచునన్నట్లు ఆ దేశములో చాలాకాలమువరకు ఘోరయుద్ధము జరుగుచువచ్చుటవలన అతడు చీనాదేశమునకు పో సాధ్యము కాకుండెను. తనకు కలిగిన ఆశాభంగమునకు లివింగ్‌స్టన్ మిగుల విచారపడుచుండిన సమయమున ఆఫ్రికా ఖండమందలి బెచ్వానాయను అనాగరిక జనులమధ్య సువార్త ప్రచారముచేసి ప్రసిద్ధికెక్కిన రాబర్ట్ మాఫట్ గారు సెలవుమీద వచ్చి ఇగ్లాండు దేశమునందంతటను సంచారముచేయుచు ఆఫ్రికా ఖండమున దేవుడు చేసిన కార్యములనుగురించి తెలియజేసి, జనులకు బహు ఉత్సాహమును కలుగజేయుచుండెను. మాఫట్ గారు ఒక పట్టణమునకు వచ్చుచున్నాడని లివింగ్‌స్టన్ విని ఆయన ప్రసంగమును వినుటకు వెళ్లి కూటము ముగిసిన తర్వాత ఆయనదగ్గరకు పోయి సంభాషించుచు, అయ్యా, నేను ఆఫ్రికాకు పోదగినవాడనా అని మాఫట్ గారి నడుగగా ఆయన, నీవు పోదగినవాడవేగాని

ఇదివరకు పని జరుగుచుండిన స్థలములకు పోక ఎప్పుడును ఎవరును పోనటువంటి ప్రదేశమునకు వెళ్లి ప్రభువు రాజ్యమును వ్యాపింపజేయవలెను. అనేక పర్యాయములు నేను ఎత్తయిన కొండ శిఖరములకెక్కి హద్దులేని ఆ ప్రదేశమువంక చూడగా వెయ్యి గ్రామములనుంచి ఆకాశమున కెక్కు పొగ నాకగుపడెను. నేను చూడని ఆ జనులకు సువార్తను తెలియజేయ మిగుల నపేక్షగలవాడనైయుంటిని గనుక నీవు వెళ్లి నా కోరికను నెరవేర్చిన పక్షమున అంతకంటె నాకెక్కువ ఆనందము నిచ్చునది వేరొకటి లేదని చెప్పుటనుబట్టి లివింగ్‌స్టన్, చీనా దేశములో నిక నెన్నాళ్లవరకు యుద్ధము జరుగునో ఎవరికి తెలియును? దానికొరకు కాచుకొని నేనెందుకు వృథా కాలయాపనము చేయవలెను? సొసైటీ సభ్యులు సమ్మతించిన యెడల నేను వెంటనే ఆఫ్రికాకు పోగలనుగదా అని తీర్మానించుకొనెను. లివింగ్‌స్టన్ సొసైటీవారికి వ్రాసి తన యభిప్రాయమును తెలియజేయగా వారందుల కంగీకరించి అతనిని ఆఫ్రికాఖండమునకు పంప నిశ్చయించిరి.

ఇంతకుపూర్వమతడు గ్లాస్‌గో సర్వకళాశాలలో వైద్యశాస్త్ర పరీక్ష గెలిచియుండెను గనుక 1840 వ. సం॥ నవెంబరునెలలో అతడక్కడికిపోయి డాక్టర్ సనదు పుచ్చుకొనెను. ఆ ఘనకూటము జరిగిన తర్వాత అతడు గ్లాస్‌గో పట్టణమునకు సమీపముననున్న బ్లాంటైర్ అను తన పుట్టూరు చేరి తన తల్లిదండ్రులతోకూడ ఒక రాత్రి గడిపెను. ఆయన తన జననీజనకులను చూచుట ఇదియే కడపటిసారి గనుక వారు బహు ప్రీతిగా ముచ్చటించుచు



Page 14



అర్ధరాత్రివరకు మేలుకొనియుండిరి. అప్పుడతని తండ్రిగారు, ఇక మనము వెళ్లి పండుకొందామని చెప్పగా డేవిడ్, నాయనా! రేపు మనము ఒకరి నొకరము ఎడబాసిన పిమ్మట తిరిగి ఒకవేళ ఒకరి నొకరము చూడమేమో గనుక తెల్లవారువరకు మాట్లాడుదమనిన, పెద్దవారు, అట్లుకాదు కొడుకా! రేపు నీవు దీర్ఘప్రయాణము చేయవలసియున్నది గనుక నీవు ఆయాసము తీర్చుకొనుటకు కొంచెముసేపు నిద్రించవలెనని ఖండితముగా చెప్పిరి. అయినను వారందరు మరుసటి యుదయమున అయిదుగంటలకు లేచి ప్రార్థనకు కూడి, 121, 139 దావీదు కీర్తనలు చదివి డేవిడ్‌ను దేవునిచేతి కప్పగించి సాగనంపిరి.

అతడు డిసెంబరునెల 8 వ. తేదిన ఓడ యెక్కి ఆఫ్రికాకు పోబయలుదేరెను. ఇప్పుడు సముద్రయాత్ర చేయు పెద్ద పొగయోడలు ఆ కాలమందు లేవు గనుక ఇప్పుడు మూడు వారములలో చేయగల ప్రయాణమునకు అప్పుడు మూడు నెలలు పట్టుచుండెను. అయినను అంత్యములేని ప్రయాణము ఏదియు లేదు గనుక ఓడమీద మూడు నెలలు గడిపిన తర్వాత ఆయన కేప్‌టవున్ చేరెను.

# 2 వ. అధ్యాయము

## ఆఫ్రికాలో పని మొదలుపెట్టుట



లివింగ్‌స్టన్ కాలమందలి
ఒక పొగయోడ

లివింగ్‌స్టన్ కొద్దిరోజులు మాత్రము కేప్‌టవున్‌లో గడిపి తిరిగి జార్జ్ అను ఓడ యెక్కి తూర్పు దిక్కుకు ప్రయాణముచేయ బయలు దేరెను. అతడు ఇంగ్లాండు నుండి వచ్చుచుండగా ప్రతి దినము ఓడ నాయకుడు ఏమేమో విచిత్రమైన యంత్రములు తెచ్చి ఆకాశమువంక పారజూచిన తరువాత లెక్కలుచేయుట చూచి తాను కూడ ఆ శాస్త్రము నేర్చుకొనవలెనని తీర్మానించి, ఓడ నాయకుని సహాయముచే దాని నభ్యసించుచువచ్చెను. ఆ యంత్రములవలన నాయకులు సూర్యునిని నక్షత్రములను చూచి, తాము నడిపించుచున్న ఓడ ఎక్కడికి వచ్చినది తెలిసికొందురు. నడిసముద్రములో



జలముగాక మరేమియు కనబడకపోయినను ఆ యంత్రముల వలన ఓడ యుండేచోటును కనుగొనవచ్చును. కేప్‌టవున్ దాటిన తర్వాత కొన్ని దినములలోపలనే ఓడ దిగిపోవలెనని యెరిగి లివింగ్‌స్టన్ ప్రతిదినము నాయకుని కలిసి ఆ శాస్త్రము నేర్చుకొనుచుండెను. అతని ఆసక్తికి ఆ ఓడ నాయకుడు ఆశ్చర్యపడి, మీకెందుకయ్యా ఈ శాస్త్రము? మీరు జల ప్రయాణములు కాదుగాని నేలప్రయాణములే చేయబోదు రనగా లివింగ్‌స్టన్, అది వాస్తవమేగాని ఆ ప్రదేశములలో నేను కొండలుగాని గుట్టలుగానిలేని గొప్ప యెడారులలో ప్రయాణముచేయవలసియుండును గనుక నేను ఈ శాస్త్రము నేర్చుకొన్నయెడల హద్దులేని ఆ అరణ్యమందు దోవను సులభముగా కనుగొనగలనని ప్రత్యుత్తరమిచ్చెను.

ప్రయాణములో లివింగ్‌స్టన్‌కును ఓడనాయకునికిని మిగుల పరిచయ మేర్పడియుండెను గనుక లివింగ్‌స్టన్ దిగవలసిన ఆల్గోవా ఖాతము చేరినప్పుడు వారిరువురు దుఃఖమనస్కులై ఒండొరులయొద్ద సెలవుపుచ్చుకొని తమ తమ మార్గముల వెళ్లిపోయిరి.

లివింగ్‌స్టన్ పోవలసిన కురుమాన్ అను గ్రామము ఆల్గోవా ఖాతమునకు ఏడ్నూరు మైళ్ల దూరములో నున్నది. ఆ కాలమున ఇనుపదారియైనను రోడ్డైనను లేదుగాని వాటంతట అవే ఏర్పడిన బండ్ల బాటలుమాత్రముండెను. సముద్రమునకు కొంత దూరముగా భూమి సమముగానున్నదిగాని దేశముమీద పోను పోను కనమలను దాటి పీఠభూమి చేరి, తిరిగి ఎత్తయిన కనమలు దాటి కొండల ప్రదేశమున కెక్కును.

బాట మిగుల మిట్టపల్లములుగాను వంకలు విశేషముగాను ఉండుటవల్ల ఒక బండికి పదేసికాండ్ల యెద్దులను కట్టుటకద్దు. ముసాఫరి బంగ్లాలును ఇతర సౌకర్యములును లేవు గనుక ప్రయాణికులు బండ్లలోనే కాపురము చేయుదురు. బాట ఇంత కష్టతరమైనందునను బండి మిగుల భారమైనందునను వారు బహు నిదానముగా సాగిపోవుచుందురు గనుక 700 మైళ్ల ప్రయాణమునకు కనీసపక్షము అయిదు నెలలు పట్టుటకద్దు. వారు దాటి రావలసిన ప్రదేశము నీళ్లులేని యెడారి. ఒకసారి వారు ఎనిమిది దినములవరకు ఒక గడ్డిపుడకయైనను మొలవని రాళ్ల భూమిలో ప్రయాణముచేయుచు నీళ్లు దొరకక బహుగా ఇబ్బందిపడి ఇక మృత్యువాతపడక తీరదని నిరాశ జెంది యుండినంతలో దైవానుగ్రహముచే అప్పుడు చినుకులు పడగా వారు నీరు త్రాగి తమ ప్రాణములు దక్కించుకొనిరి. ఆ యరణ్యమందు చెట్టుచేమలు లేకపోయినను నిప్పుకోళ్లు, లేళ్లు, ఇర్రులు మొదలగు అడవిజంతువులుండెను గనుక వాటిని వేటాడి తమకు కావలసిన ఆహారమును సంపాదించుకొనుచుండిరి.

అయిదు నెలలమట్టుకు పడరాని పాట్లు పడి 1841-సం॥ జూలైనెల 7వ. తేదిన లివింగ్‌స్టన్‌గారు కురుమాన్ చేరిరి. ఆ గ్రామ మిదివరకు ప్రస్తావించిన రాబర్ట్ మాఫట్‌గారి కష్ట ప్రయాసములవలన నేర్పడినదే. దాని చుట్టుపట్ల ప్రదేశము వట్టి ఇసుక యెడారి. అక్కడ వీచు గాలిలో లేశమైనను తేమలేకపోవుటవలన ఒక సూది నెలలకొద్ది బయటపడియుండినను అది తుప్పుపట్టక ఎప్పటివలెనే మెరయుచుండును.



Page 18

ఆఫ్రికాదేశపు ఎద్దుల బండి

మాఫట్‌గారు మొదట వచ్చినప్పుడు తగిన నివాసస్థలమును కనుగొనుటకు అచ్చటచ్చట సంచరించి అనేక చోట్లు చూచిన తర్వాత కడకు కురుమాౝలోనే ఇల్లు కట్టుకొని కాపురము చేసెను. ఆయన అక్కడ కాపురముచేయ తీర్మానించుటకు హేతువేమనిన, దానికి సమీపముననుండు కొండయోరను ఒక నీటిబుగ్గ ఉండుటయే. ఆయన ఆ బుగ్గనుండి చిన్న కాలువలు త్రవ్వించి కట్టకట్టి కోనేరు నేర్పరచిన యెడల ఒక తోట వేసి, పైర్లు పండించి, ఫలవృక్షములను పెంచవచ్చునని నిశ్చయించుకొని కురుమాౝ గ్రామమును తన నివాసస్థలముగా చేసికొనెను. ఆ జలముయొక్క ప్రభావముచేతను మాఫట్‌గారి ప్రయాసముచేతను ఆ నిష్ప్రయోజనమగు బయలుప్రదేశము ఫలవంతమైన ఉద్యానవనముగా మారెను.

ఆ బుగ్గనీటి మూలముగా భూమి ఫలవంతమగుటతో తృప్తిజెందక మాఫట్‌గారు ఆ ప్రదేశములోని జనుల జీవితములుకూడ జీవజలమునుగ్రహించు శ్రీయేసునాథుని సువార్తవలన ఫలవంతముకావలెనని కోరి తాను ఏండ్లకొలది కష్టపడి తర్జుమాచేసి సెచ్వానా భాషలో వ్రాసిన క్రొత్తనిబంధనను లివింగ్‌స్టన్‌చేత పంపియుండెను. ఆ 500 ప్రతులను ఆయన ఎంతో జాగ్రత్తతో కాపాడి కురుమాౝకు తెచ్చి అచ్చటి క్రైస్తవ సంఘ సభ్యుల వశముచేసెను. ఈ నది ఎక్కడికి పారునో అక్కడ సమస్తమును బ్రదుకును (యెహెజ్కేలు 47. 9.)

మాఫట్ గారి విశ్వప్రయత్నములవలన కలిగిన ఫలితమునకును కురుమాన్‌లో జరుగుచుండిన దేవుని రాజ్యసంబంధమైన కార్యమునకును లివింగ్‌స్టన్ సంతోషించినను అక్కడనే స్థావరముగానుండుట కాయన ఇష్టపడలేదు. ఆ నిష్కర్షకు హేతువేమో కనుగొని అందునుగురించి గాఢముగా యోచించుట మన కర్తవ్యము. మాఫట్ గారును మరి యితరులును ఇరువదియేండ్లు పొడుగున కురుమాన్‌లో పడిన ప్రయాసములకు ఫలితముగా ఆ ప్రాంత్యమందు వెయ్యిమంది క్రీస్తు మత మవలంబించి, ఆధ్యాత్మిక విషయములోమాత్రము కాక లౌకిక విషయములయందును పలు విధములైన లాభముల ననుభవించిరి. కాబట్టి వారి ఆత్మాభివృద్ధికైనను లౌకిక సుఖక్షేమమునకైనను మిషనేరీలు పాటుపడవలసిన యవసరము లేదు. ఆ వెయ్యిమంది క్రైస్తవులే తమ స్వదేశస్థులకు క్రీస్తు సువార్త భాగ్యము నెరిగింప బాధ్యులు గనుక తానా ప్రాంత్యమందు పనిచేయక సువార్త నాదము నెన్నడును వినని జనులకు రాయబారియై పోవలసినదని లివింగ్‌స్టన్ తీర్మానించుకొనెను. మాఫట్‌వలె లివింగ్‌స్టన్‌కూడ ఉత్తరపు మైదానమునసుండిన వెయ్యి గ్రామముల పొగను ఆ ఉదయమున చూచి ఆ గ్రామముల జనులకు సువార్తను తెలియజేయ కంకణము కట్టుకొనెను. అయ్యో! ఈ సంగతి చదువుచున్న నీవు నూరేండ్లుగా యేసు ప్రేమను గుర్తెరిగి క్రీస్తు మత ప్రభావమువలన సుఖస్థితికెక్కిన కుటుంబమందు పుట్టి పెరిగిన వాడవేమో! నీవు నివసించు గ్రామమందే ఎందరో నీ కుటుంబమువా రింతకుమునుపు మునిగియుండిన లౌకిక పార



మార్థిక దౌర్భాగ్యములోనే మునిగియుందురుగదా. వారింకను విగ్రహములకు మ్రొక్కుచున్నారు; ఇంకను నిజదేవుని కృప నెరుగరు. ఇందులో నీ ధర్మమేమిటో కొంచెము గమనించి చూడుము. దేవుడు నిన్ను చూచి, “కుమారుడా, నేడు పోయి ద్రాక్షతోటలో పనిచేయుమని” చెప్పగా నేను పోనను చున్నావా!

లివింగ్‌స్టన్ తాను చేయదలచిన పనివిషయమై లండన్ పట్టణమందలి సొసైటీ విధాయకులకు వ్రాసి వారి జవాబు కొరకు కనిపెట్టుచుండిన కాలములో దూరప్రయాణములు చేయుచు ఉత్తరమైదానమునందు నివసించు జనులతో పరిచయము చేసికొనుచు నుండెను. అంతకు మునుపు తెల్లవారెవరును ఆ ప్రదేశమును దర్శించియుండలేదు గనుక ఆ జనాంగముల గుణగతులు ఎవరికిని తెలిసియుండలేదు. వారిలో మొదట సంచారముచేసినవాడు మన లివింగ్‌స్టన్ గారే. వారందరు నొక వంశపువారేయైయుండినను, వారిలో ఇరువది యెనిమిది గోత్రము లేర్పడినవాయెను. పూర్వము ఆయా గోత్రమువారు ఆయా జంతువులకు మ్రొక్కెడివారైయుండి, తాము ఆరాధించెడి జంతువు పేరునుబట్టి తమ గోత్రమునకు ఆ పేరు పెట్టుదురు. అందువల్ల తెనుగుదేశములో రెడ్డిభూమివారనియు పాకనాటివారనియు, మురికినాటివారనియు, వేరువేరు కులము లేర్పడినట్లే వారిలోను పాములవారనియు, మొసళ్లవారనియు, చేపలవారనియు, కోతులవారనియు, సింగములవారనియు, వేరువేరు తెగ లేర్పడియుండెను.

1843 వ. సం॥ న సొసైటీ విధాయకులు లివింగ్‌స్టన్ యొక్క సలహా నంగీకరించి కురుమాన్ ఉత్తర ప్రదేశమందు పని మొదలుపెట్టుటకు సమ్మతించినందున లివింగ్‌స్టన్ మరియొక మిషనేరీని వెంటబెట్టుకొనిపోయి, రెండు వారములు ప్రయాణముచేసినమీదట మాబోట్సాయను స్థలముచేరి అక్కడ కాపురముండుటకు ఏర్పాటు చేసికొనెను. ఆ భూభాగమందలి జనులు బాక్హాట్లా అనగా కోతులవారని పిలువబడుదురు. మాబోట్సా యనగా పెండ్లి విందని యర్థము. బంగ్లా మొదలైన కట్టడములు కట్టుటకు అక్కడ జాగా చూపించుమని ఆయన కోతులవారి నడుగగా వారు, రెండు మైళ్ల నిడివియు ఒకటిన్నర మైలు వెడల్పునుగల జాగా నాయనకు చూపించిరి. ఆ భూమికిగాను తమ కెంతకావలెనని లివింగ్‌స్టన్ వారి నడుగగా వారు అరువదిరూపాయల ఖరీదుగల ఒక పాత తుపాకి తమకిమ్మని యడిగి ఆ జాగాకు కరారునామా వ్రాసియిచ్చిరి.

ఆయన ఒక సమయమున దేశసంచారము చేయుచు పన్నెండుమైళ్ల దూరము వెళ్లినతర్వాత ఎద్దులు అలసినందున మధ్యాహ్నము కొంచెముసేపు ఒక చోట ఆగియుండగా పదిపన్నెండేండ్ల చిన్నది కుక్క తరుముచున్న కుందేలి చందమున పరుగెత్తుకొనివచ్చి బండిక్రింద దూరి దాగుకొనెను. లివింగ్‌స్టన్ అది చూచి ఆ పిల్లకభయమిచ్చి ఆమె సంగతియేమని విచారించగా ఆమె తల్లిదండ్రులులేని దిక్కుమాలినది కాబట్టి దుష్టులు సమయము చూచి ఆ పిల్లను తమవశముచేసికొని అది పెద్దదైనప్పుడు అమ్మనుద్దేశించిరని తెలియవచ్చెను.



లివింగ్‌స్టన్ ఆ యూరిలోని కాయిలాపడినవారందరిని విచారించి వారికి మందిచ్చినప్పుడా చిన్నది ఆయనను చూచి ఆయన మిగుల దయాళుడని గ్రహించి, తాను ఆయన శరణుజొచ్చినయెడల తన్ను తప్పక కాపాడునను ధైర్యముగలిగి ఆయన మఖాముకు వచ్చెను. లివింగ్‌స్టన్‌గారు ఆ పిల్లను చేరదీసి భోజనము పెట్టగా అది నెమ్మదిగా నుండెనుగాని కొంచెముసేపటికి పెద్దపెట్టున ఏడ్చుచు బొబ్బలుపెట్టినది. కారణమేమనిన, తన్ను బలాత్కారముతో ఇంటిలో నుంచుకొన్నవాడు చేత తుపాకి పట్టుకొని తన్ను విడిపించుకొనిపోవుటకు వచ్చుట చూచి ఆ చిన్నది దిగులుపడి వణకసాగెను. ప్రాణము దక్కించుకొనుటకై ఆ పిల్ల తన మెడలోనుండిన పూసలు తీసి ఆ దుష్టునికిచ్చి తన్ను విడిచిపొమ్మని వానిని వేడుకొనుచుండెనుగాని వాడొప్పక ఆమె పైబడి బలవంతముగా. తన ఇంటికి ఈడ్చుకొనిపోవుచుండగా లివింగ్‌స్టన్‌గారి పరివారములో నొక యౌవనుడడ్డపడి ఆమెను విడిపించెను. అతడొక నాయకుని కుమారుడు. అతడు క్రీస్తుమత మవలంబించి లివింగ్‌స్టన్‌దగ్గర పనివాడుగా నుండెను. ఇతనికి భయపడి ఆ దుష్టుడు ఆ పిల్లను విడిచి పారిపోయెను. తరువాత లివింగ్‌స్టన్ వచ్చి, సంగతి విని, ఆ పిల్లను తన బండిలో ఎక్కించుకొని, ఇప్పుడు యాభైమంది నిన్ను విడిపింపవచ్చినప్పటికిని నేను నిన్ను కాపాడుదునని చెప్పి ఆదరించెను.

మాబోట్సాకు సమీపముననున్న ఎత్తయిన కొండలు సింహములకు ఉనికిపట్టు గనుక అవి ఆ యూరివారికి బహు ఉపద్రవము కలిగించుచుండెను. ఆ మృగరాజములు

రాత్రులయందు మాత్రము కాక పట్టపగలుకూడ ఊరి మీదికి వచ్చుటవలన గ్రామస్థులందరు భయకంపితులై ఇల్లు విడిచిపోవుటకు ధైర్యము చాలక ఇండ్లలోనే దాగియుండిరి. ఆ సింహములు వచ్చి పట్టపగలే కంచెలు ఎగిరి గొర్రెల నెత్తుకొనిపోవుచుండెను. ఒకనాడు లివింగ్‌స్టన్‌గారు తన బంగ్లాలో ఏమో వ్రాసికొనుచుండగా ఒకడు పరుగెత్తుకొని వచ్చి, స్వామీ! పెద్ద సింగము వచ్చి దొడ్డి కంచె ఎగిరి గొర్రెలను పట్టి చీల్చుచున్నది. ఇప్పటికే అది తొమ్మిది జీవములను నష్టముచేసినదని మొరబెట్టుకొనగా లివింగ్‌స్టన్ లేచి ఆ వంక చూచుచుండునంతలో ఆ సింహము ఒక గొర్రెను నోటకరచుకొని కంచె నెగిరిపోయెను. ఆ సింహములను తరుమగొట్టుడని లివింగ్‌స్టన్ ఆ యూరివారిని అనేకపర్యాయములు ప్రేరేపించుచు వచ్చినను వారు తెగించలేకుండిరి. ఎందుకనిన, తమ శత్రువులు చేసిన మంత్రకట్టువలన సింహములు తమ్మును పీడించుచున్నట్టు వారు నమ్మినందున వారు ధైర్యశాలురైయుండినను వాటిమీద పడుటకు వెనుకతీయుచుండిరి. లివింగ్‌స్టన్ మరియొకసారి గ్రామకూటమును ఏర్పరచి, ఆ యూరి పెద్దలను చూచి, ఈ యూరిలో మీరైనా ఉండవలెను లేదా సింహములైనా ఉండవలెను. మీరింకను ఆలసించినయెడల త్వరలోనే మీ యూరు నిర్జనప్రదేశమగును. కాబట్టి సింహములమీదపడి వాటిని తరుముడని వారిని పురికొల్పెను.

ఆ సింహములొక చిన్న గుట్టలో తావులు చేసికొని అక్కడనే మరగియుండెను గనుక లివింగ్‌స్టన్ చేసిన ప్రేరణకు ఆ యూరి పురుషులందరు ధైర్యమూని ఆ తిప్పను చుట్టు



కొని ఆర్భాటముచేయుచు సింహములను తరుముచురాగా ఒకటి పొదలలోనుండి బయటికివచ్చి ఒక పెద్ద బండమీద నిలుచుండెను. క్రింది బయలులో లివింగ్‌స్టన్‌గారును ఆయనతోకూడ వచ్చిన మేబాల్వేయును ఒక దేశీయ ఉపాధ్యాయుడును తుపాకులు పట్టుకొని కాచుకొనియుండిరి. సింహము బయటికివచ్చుటను చూచి మేబాల్వే తుపాకి కాల్చగా గుండు సింహము నిలిచియుండిన బండకు తగిలెను గాని సింహమునకు తగులలేదు. అయినను ఆ వేటుకు అది మిగుల రౌద్రము తెచ్చుకొని గర్జించి యెగిరి తన చుట్టు నుండినవారిని దాటి తప్పించుకొనిపోయి అడవి చేరెను. సాధారణముగా ఆ బలశూరులు తమమీదికి వచ్చెడి సింహములను ఈటెలతోనే పొడిచి చంపువారుగాని పైన చెప్పినట్టు వారు అది తమ శత్రువులు చేసిన మంత్రకట్టు అని భయపడినందున వాటి జోలికి పోకుండిరి.

లివింగ్‌స్టన్‌గారును మేబాల్వేయును ఆ గుట్ట యోరను పోవుచు సుమారు నూరడుగుల దూరములోనుండిన యొక బండమీద మరియొక సింహము కూర్చుండియుండగా చూచిరి. అది ఒక చిన్న పొదచాటుననుండినందున లివింగ్‌స్టన్ దానికి కనబడకుండ బహు జాగ్రత్తగా గురిపెట్టి రెండు నాళములు ఒకటేసారి కాల్చెను. ఆ రెండు గుండ్లు సింహమును తగులగా జనులు చూచి, „చచ్చెరా, చచ్చెరా, పోయి పొడుస్తాము రారా” అని కేకలువేయుచు, ఎగురుచుండిరిగాని లివింగ్‌స్టన్ వారిని చూచి, తాళుడి. నేను తిరిగి తుపాకిని బారుచేసేవరకు పోకుడని చెప్పి తిరిగి బారు చేయదొడగెను.

ఆ తుపాకి తోటాలు పెట్టి కాల్చేటిదికాక లాతము కొట్టి బారుచేయునట్టిది గనుక దానిని బారుచేయుటకు కొంత కాలము పట్టును. ఇంతలో జనులు భయంకరముగా కేకలు వేయుటను విని లివింగ్‌స్టన్ వెనుకకు తిరిగి చూచుసరికి దెబ్బ తిని కన్నుల నిప్పులు రాల్చుచుండిన ఆ సింహము తనమీద దుమికి వచ్చినట్లు కనుగొనెను. అది వాయువేగమున వచ్చి నందున లివింగ్‌స్టన్‌కు తప్పించుకొనుటకు వీలులేకపోయెను. ఆ మృగరాజము ఆయన రెట్టను కరచుకొని కుక్క ఎలుకను విదలించినట్టు విదలించుచు గర్జించుచుండెను. అగడ్తలో పడిన పిల్లికి అదే వైకుంఠమన్నట్లు మన కథానాయకుడా తరుణమున సింహము చేతిలో చిక్కుకొని మృత్యువు దేవతకు ఆహుతి కావలసినవాడే. ఇంకొక క్షణములోపల అది ఆయనను చీల్చి తుత్తునియలు చేసియుండెడిదేగాని పూర్వము సింహము గుహలో పడిన ప్రవక్తను కాపాడిన దేవుడు ఇప్పుడు సింహమువాత పడిన తన సేవకుని తప్పించ సంకల్పించెను. ఎట్లనిన, లివింగ్‌స్టన్‌తో కూడ వేటకు వచ్చిన మేబాల్వె అను నాయన కొంచెము ముందుకుపోయి ఆయనకు ఎడముగా నిలుచుండి సింహము చెంగున దుమికి లివింగ్‌స్టన్‌ను పట్టినప్పుడు దానిని గురిపెట్టి కాల్చగా లివింగ్‌స్టన్‌తో చెల్లాట మాడుచుండిన ఆ మృగరాజము వెయ్యిరెట్లు కోపము తెచ్చుకొని మేబాల్వెమీద పడెను. ప్రక్కను నిలుచుకొనియుండిన మరియొకడు మేబాల్వెమీద పడిన సింహమును ఈటెతో పొడుచుచుండగా నది మేబాల్వెను విడిచి ఇతనిమీదపడి ఇతని యెముకలు పగులగొరుకుచుండెను గాని అదివరకు



Page 26

సింహము లివింగ్‌స్టన్‌మీద పడుట

లివింగ్‌స్టన్ కాల్చిన గుండు దెబ్బలచే రక్తము వెల్లువగా కారి బలహీనమైనందున ఆ క్రూర జంతువు సొమ్మసిల్లి నేలపడి ప్రాణము విడిచెను.

పెక్కు సంవత్సరములనుండి తమకు ఉపద్రవము కలుగ జేసిన ఆ మృగరాజము కదలక పడియుండుట చూచి ఆ యూరివారు బహుగా ఉల్లసించిరిగాని తమ సహాయమునకు వచ్చిన లివింగ్‌స్టన్‌గారు రక్తము కారుచు స్మారకము తప్పి పడియుండుట చూచి విచారనిమగ్నులై ఆయన దగ్గరకు పరుగెత్తిపోయిరి. ఆయన నిశ్చయముగా చనిపోయినాడనుకొని వారు మిగుల భయముతో ఆయనదగ్గరకుపోయి చూచిరిగాని ఆయన ఇంకా ప్రాణముతో నుండుట చూచి ఆయన కుపచారము చేయదొడగిరి. సింహము పట్టిన రెట్టలో పదునొకండు కాట్లు పడియుండుటమాత్రముకాక పై చేతి యెముక నలిగినూకయైయుండెను. కాలక్రమమున ఆయన చెయ్యి బాగుపడెనుగాని ఎముక సరిగ అతుకుకొననందున ఆ చెయ్యి ఎప్పుడును బలహీనముగానే యుండెను. అప్పటి నుండి ఆయన తలపైకి చెయ్యి ఎత్తలేకుండెను.

లివింగ్‌స్టన్‌ను ఇంటికి తీసికొనిపోయి తమకు సాధ్యమైనన్ని యుపచారములు చేసిన తరువాత ఆ యూరివారు సింహము చచ్చినందుకు గొప్ప యుత్సవము జరిపి, దాని కళేబరమును వీధుల వెంబడి ఊరేగింపుచేసి, కడకు ఊరి వెలుపలికి తీసికొనిపోయి, తమ శత్రువులు దానిని మంత్రించి తమమీదికి పంపిరని నమ్మినందున మన దేశస్థులు నాగుబాము చంపినప్పుడు నాగేంద్రుని శాంతిపరచుట కేలాగు

దాని నోటిలో కాలణా పెట్టి కాల్చివేయుదురో ఆలాగే వారును దేవతల కోపమును శాంతిపరచుటకు ఆ సింహమును కాల్చి భస్మము చేసిరి.

కుంటిచేతివాడైన లివింగ్‌స్టన్ చాలా దినములవరకు చేతికష్టము చేయలేకుండెనుగాని గాయములు మానినతోడనే ఆయన ఇల్లు కట్టుట కేర్పాట్లుచేసి పని మొదలుపెట్టెను. ఆయన ఆఫ్రికా దేశమునకు వచ్చి అప్పటికి నాలుగు సంవత్సరములైయుండినను ఇంకను పెండ్లిచేసికొనకుండెను గాని ఈ మధ్య ఆయన కురుమాన్‌కుపోయి, అప్పటికి ఇంగ్లాండునుండి తిరిగి వచ్చిన మాఫట్‌గారిని దర్శించి ఆయన కూతురైన మేరి మాఫట్‌గారిని పెండ్లిచేసికొనెను. మాబోట్సా గ్రామమువారు తమ స్థితికి తగినట్లు గుడిసెలు కట్ట నెరిగినవారుగాని తెల్లవారి వసతిగల యిండ్లను కట్టునంతటి నాగరికము నెరుగరు గనుక లివింగ్‌స్టన్‌గారు తానే అన్ని కష్టములు పడి ఇల్లు కట్టవలసివచ్చెను. అయినను కొండను మ్రింగేవానికి గోపురమడ్డమా యన్నట్లు ఆయన కష్టమునకు వెనుకతీయక ముందంజవేసి ప్రయాసముతో బంగ్లాను కట్టి దానిచుట్టు మంచి తోటవేసి అందు పలు విధములైన కూరగాయలు పండించెను. ఆయన ఆ విచిత్రమైన బంగ్లాను కట్టినందువల్లను, ఆ యడవి ప్రదేశమును ఫలవంతమైన తోటగా మార్చినందువల్లను వారాశ్చర్యపడి, ఇది యంతయు మంత్ర ప్రభావముచేతనే కలిగియుండవలెనని భ్రమచెంది ఆ యూరివారాయనను మరెక్కువగా సన్మానించిరి.



మాబోట్సాలో నివాసము చేసికొని, చుట్టుపట్ల ప్రదేశములలో సంచరించుచు, దూరగ్రామములలోని జనులకు క్రీస్తుసువార్తను ప్రకటించుచు, దేశీయ బోధకులను మాబోట్సాకు రప్పించి వారికి విద్యనేర్పి తర్ఫీయతు చేసి, వారి మూలముగా ఆ కోతిగోత్రమువారిని క్రీస్తుకొరకు సంపాదించవలెనని లివింగ్‌స్టన్ యొక్క ముఖ్యాభిలాష. తన మామగారైన మాఫట్‌గారు కురుమాన్‌లో ఏలాగు చేసియున్నారో ఆలాగే తానును మాబోట్సాలో చేయవలెనని నిశ్చయించుకొని బహు ఉత్సాహపూర్వకముగా కార్యము నుపక్రమించెను. అయినను త్వరలోనే ఆయన యోచనకు భంగము కలిగెను. ఎట్లనిన, ఆ దంపతులు బంగ్లా కట్టి తోటను సాగించి కొంతమట్టుకు తమ యత్నము సఫలపరచిన పిమ్మట ఇతరుల వలన కలిగిన అసందర్భములనుబట్టి ఆ యూరు విడిచి ఉత్తరమున 40-మైళ్ల దూరములోనుండిన మరియొక స్థలమునకు పోవలసివచ్చెను. తామంతగా కష్టపడి కట్టిన యిల్లును, ప్రయాసపడి సాగించిన తోటను, సఫలమగుచువచ్చిన సువార్తసేవను విడుచుట వారికి మిగుల సంకటముగా నుండెను గాని దైవసంకల్ప మెంత విపరీతముగా కనబడినను ఆయన చిత్తము నంగీకరించుట ఆయన భక్తుల బాధ్యత గనుక దైవచిత్తము ననుసరించి లివింగ్‌స్టన్‌గారు మొసలిగోత్రమువారైన బక్వాయిన్ అను జనుల ప్రాంత్యముచేరి చొన్వాని యను ఊరిలో దిగిరి. అక్కడ కాపురముండిన మొసలి గోత్రపు నాయకుడగు సేచేలి లివింగ్‌స్టన్‌గారిని బహు గౌరవముగా చేర్చుకొని, ఆయన తన జనుల క్షేమాభివృద్ధినిమిత్తము చేసిన యత్న

ములకు తోడ్పడుచు, క్రీస్తుబోధయెడల మిగుల అభిమానముగలిగి లివింగ్‌స్టన్‌గారియొద్ద మూడేండ్లు శ్రద్ధగా నేర్చుకొన్నమీదట శ్రీ యేసుపేరట జ్ఞానస్నానముపొందెను.

సేచేలి క్రీస్తు మతము నవలంబించినవాడైనను అతని ప్రజలైన బక్వాయిన్‌వారు లివింగ్‌స్టన్‌గారి బోధ నంగీకరింపరైరి. సేచేలి అందునుగురించి మిగుల విచారపడి వారిని బలవంతముగా మతములో చేర్చవలెనని లివింగ్‌స్టన్‌కు యోచన చెప్పెను. యథా రాజా తథా ప్రజాః అన్నట్టు తాను క్రైస్తవుడైయుండగా ప్రజలందరు క్రైస్తవులు కావలెనని అతని యభిప్రాయము గనుక ఒకనాడతడు లివింగ్‌స్టన్‌ను చూచి, అయ్యా! మీరీ జనులకొరకు వృథాగా ప్రయాసపడుచున్నారు. వీరికెన్ని కథలు చెప్పినను ప్రయోజనములేదు. నేను దెబ్బలతోనే వారిచేత పని చేయించకపోయినయెడల వారేమియు చేయరు. కాబట్టి కులపెద్దలనందరిని పిలిపించి, చెర్లకోల ప్రయోగముతో వారందరు మత మవలంబించునట్లు చేయుదమని హెచ్చరించగా లివింగ్‌స్టన్, అట్లు కాదయ్యా. మనము దౌర్జన్యముచేసినయెడల వారు పేరుకు మాత్రమే క్రైస్తవులగుదురుగాని నిజక్రైస్తవులు కారు. క్రీస్తు మతము నవలంబించినవారు ఇష్టపూర్వకమైన భక్తులుగా నుండవలెనుగాని నామకార్థభక్తులు కాదని చెప్పి, నాయకుని సలహాను నిరాకరించెను.

సేచేలి జ్ఞానస్నానము నొందినందున లివింగ్‌స్టన్ మిగుల సంతోషించి ఆ మొసలిగోత్రమువారందరు కాలక్రమముగా క్రీస్తు బోధ నంగీకరింతురని నమ్ముచు వారి యాత్మీ



యాభివృద్ధినిమిత్తమై దివారాత్రులు పాటుపడుచుండెను. అయినను ఆయన కోరిక త్వరలో నెరవేరకుండ గొప్ప యాటంకము కలిగెను. ఎట్లనిన, ఆ ప్రాంత్యములలో తరచుగా వర్షము కురియకపోవుటవలన పదే పదే కరవు సంభవించి దేశమును పీడించుచుండెను. లివింగ్‌స్టన్ చొన్వానిలో మూడు నాలుగేండ్లు కాపురముండిన పిమ్మట అనావృష్టిచే కరవు ఎక్కువైనందున ప్రజలు మిగుల బాధపడుచు, ఈ యుత్పాతము లివింగ్‌స్టన్‌గారి మాంత్రికశక్తిచేతనే కలిగెనని తలంచి, క్రీస్తు మతమును నిరాకరించి లివింగ్‌స్టన్‌గారి నేలాగైనను చంపవలెనని సమకట్టిరి. పూర్వము ఆఫ్రికా ఖండమందు కొందరు తమ మాంత్రిక విద్యాచేత వర్షము కురిపింపగలరని జనులు తలంచుచుండిరి. వారు పలు విధములైన ఆచారములచే దేవతల కోపము చల్లార్చి, క్షామనివారణ చేయగలరని సామాన్య జనులు నమ్మి వారియెడల మిగుల సన్మానమును భయమును గలిగియుండిరి. ఆ కాలమున పై చెప్పిన మూఢభక్తి అంతటను ప్రబలియుండెను గనుక మొసలి గోత్రమువారు సేచేలిని సమీపించి, తన మంత్ర ప్రయోగమువలన కరువును పోగొట్టి వర్షము కురిపింపజేయవలెనని వేడుకొనిరి. అంతకుముందు సేచేలి ఆ మూఢభక్తి ననుసరించి తాను మంత్ర ప్రభావముచే వర్షమును రప్పించి క్షామనివారణ చేసెదనన్నట్టు వారియెదుట నటించుటనుబట్టియే ఈ కరువు సంభవించగా ఆయన యథాప్రకారము మంత్రించి వర్షము రప్పించవలెనని ప్రజలాతనికి మొరలిడుచువచ్చిరి. అయినను సేచేలి ఇట్టి వ్యర్థాచారములు క్రీస్తు బోధకు బద్ధ

విరుద్ధమని యెరిగి వారెంతగా తన్ను గోజాడినను అందుకు సమ్మతింపడాయెను.

మొసలిగోత్రమువారు నివసించు ప్రదేశము యొక్క నైసర్గిక స్థితి మిగుల విపరీతమైనది. ఆ ప్రాంత్యములోని యెక్కుడు భాగము వట్టి ఇసుకయు బండయుగల ఎడారి గనుక అక్కడి జనులకు నీళ్లు దొరుకుట బహు కష్టము. వారా ఎడారిలోని నలుదిశలు తిరిగి నీళ్ల వసతిగల చోటును కనుగొన్న తర్వాత దారాపుత్రాదులతోకూడ తమకున్న గొడ్డు గోదలను అక్కడికి తీసికొనిపోయి ఇండ్లు కట్టుకొని వాసము చేయుదురు. ఇట్లుండగా ఎనిమిది పది సంవత్సరములకు అకస్మాత్తుగా అక్కడి యూటలును జలధారలును ఇంకిపోవుటచే వారు తమ పశువులతోకూడ మిగుల ఇబ్బందిపడుచు మరియొక స్థలమునకు వలసపోవుదురు. చొన్వానిలో ఇట్లే జరిగెను. అందువల్ల అక్కడ కాపురముండిన ఆ బక్వాయిన్ జనులు జీవనము జరుగక మరి యెక్కడికో పోవలసియుండెను. ఉసురుంటే ఉప్పమ్ముకొనియైనను బ్రతుకవచ్చునన్నట్లు వారు తమ ప్రాణములను దక్కించుకొనుటకై తమ సగుకు సంబారమంతయు తీసికొని పడమట అయిదారామడల దూరముననుండిన కొలోబెంగ్ అనునొక ఏటి యొడ్డున క్రొత్త పేటను కట్టుకొనిరి. ఆ ప్రదేశము నిర్జనమైన అరణ్యముగా నుండెను గనుక వారు మొదట అక్కడ వచ్చి చేరిన కొంత కాలమువరకు అక్కడి యడవి జంతువుల యుపద్రవమింతంత కాదు. అవి యిండ్లమధ్యను తిరుగుచు పశువుల నెత్తుకొనిపోవుచుండెను. ఒకనాడు లివింగ్‌స్టన్ తన యింటి



వాకిట నిలిచియుండగా బంగ్లా కెదురుగానుండిన బయలులో నొక ఖడ్గమృగమును చూచి బంగ్లాలో నిలుచుండియే తుపాకితో దానిని కాల్చెను.

కొలోబెంగ్‌లో లివింగ్‌స్టన్ గారును ఆయన కుటుంబమును బహు కష్టసాధ్యముగా జీవించవలసివచ్చెను. అక్కడ వారికి సహాయము చేయువారెవరును లేనందున వారు తమ యింటి కార్యములు తామే చేయవలసివచ్చెను. వారికవసరమైన సరుకులు దొరకనందున వారికి ఒక్కొకప్పుడు చాలినంత ఆహారము లేకుండెను. బక్వాయిన్ వారు శుద్ధ అనాగరికులు గనుక ఇల్లు కట్టుటయందైనను వారాయనకు తగిన సహాయము చేయజాలకుండిరి. లివింగ్‌స్టన్ తానే ఇటుకలు చేసి, కలపను సిద్ధపరచి, గోడలు కట్టి, ఇల్లు తయారుచేయవలసియుండెను. ఇంటిలో పనివారు లేనందున వారు తామే వంటలు చేసికొనుటమాత్రము కాక తమకు అనుదినము కావలసియుండు దినుసులనుకూడ సిద్ధపరచవలసియుండెను. గుండు, మూలమట్టము, మొదలగు కొరముట్లను ఎట్లు వాడవలసినది తెలియక రాళ్లను ఇటుకలను ఉన్నపాటుననే వేయుటచే కట్టిన గోడ తన బరువుకు తానే నిలువలేక పడిపోవుచుండెను. కాబట్టి లివింగ్‌స్టన్ తన చేతులార ప్రతి రాతిని ఇటుకను చక్కగా అమర్చి గోడలు కట్టెను.

భార్యాభర్తలిద్దరును ఈ ఊడిగపు పనులలో తగులుకొనియుండినను ప్రజల క్షేమాభివృద్ధికి పలువిధములుగా ప్రయాసపడుచుండిరి. లివింగ్‌స్టన్ పురుషులకు విద్యాబుద్ధులు చెప్పి వారికి నానావిధములైన వృత్తులు నేర్పుచుండగా ఆయన

భార్యగారు బిడ్డలకొరకొక పాఠశాల నేర్పరచి స్త్రీలకు కుట్టుపని నేర్పి, వారు తమ బిడ్డలను భక్తి మార్గములందు పెంచునట్లు వారికి బోధించి వారి వృద్ధికి ప్రయాసపడుచుండెను.

అయినను వారు కొలొబెంగ్‌లో స్థావరముగా నుండుటకు వీలులేకపోయెను. నదీతీరముననే ఊరు కట్టినందున ఇక తమకు నీళ్లకరువు తీరెనని నమ్మి రెండు సంవత్సరములవరకు పైర్లు పండించి, తోటలు సాగించి, ఆ స్థలమందు ఇక స్థిరముగా నుండి, జనులను వృద్ధికితెచ్చి, వారిలో కొందరిని బాగా తర్బీయతుచేసి సువార్తసేవకులగా చుట్టుపట్ల జనులయొద్దకు పంపి, ఆ ప్రాంత్యములలో ప్రభువురాజ్యమును స్థాపించవలెనని గురిపెట్టుకొని దానికొరకు మిగుల నుత్సాహముగా నెదురు చూచుచుండినను ఆయన మనోరథము సఫలముకాక పోయెను. ఎందుకనిన, కొన్నాళ్లయిన పిదప తిరిగి అనావృష్టి కలిగినందున పశువులకు మేతయు ప్రజలకన్నమును లేనందున జనులు పడరాని పాట్లు పడుచుండిరి. జనులతోపాటు లివింగ్‌స్టన్‌యును ఆయన భార్య బిడ్డలును ఇబ్బందిపడుచుండిరి. కడకు భోజనపదార్థములే లేనందున వారు అడవి మిడతలను పట్టి వేయించి తినవలసివచ్చెను. ఒక్కొక్కసారి జనులు లివింగ్‌స్టన్‌గారి బిడ్డల అవస్థ చూడలేక వారికొక విధమైన కంబళి పురుగును తెచ్చి యిచ్చిరి. ఎప్పుడో ఒకనాడు ఒకడు ఒక కప్పను పట్టి తెచ్చి యిచ్చినయెడల దానిని వండుకొని తిని ఆ దినమును ఒక పండుగదినముగా నాచరించెడివారు. కడకు కొలొబెంగ్ ఏరు ఎండిపోవుట చూచి లివింగ్‌స్టన్ ఇక నా చోట నుండుట కష్టమని యెంచి, తన పనికిగాను అనుకూలమగు స్థలమును వెదకుటకు పోయెను.

# 3 వ. అధ్యాయము

## మకలోలో దేశ సంచారము

కొలొబెంగ్‌లో లివింగ్‌స్టన్‌గారి కుటుంబము పడిన కష్ట ప్రయాసములవలన వారి ఆరోగ్యము చెడినందున వారు క్షీణించుచు వచ్చిరి. కరువు తీరిన తర్వాతకూడ వారు అస్వస్థతగా నుండి నానా రోగములవలన బాధపడుటను చూచి లివింగ్‌స్టన్‌గారు వారిని ఇంగ్లాండుకు పంప నిశ్చయించుకొనెను. ఇది ఆయనకు మిగుల వ్యసనమును కలిగించెనుగాని బిడ్డల క్షేమము అన్నిటికన్నను ప్రాముఖ్యమైనదని యెంచి అందుల కొడబడెను.

ఆ మధ్య కొలొబెంగ్ ప్రాంత్యములకు వచ్చిన కొందరు పరదేశులు ఉత్తరమున చాలా దూరములో నుండిన ఒక ఫలవంతమైన భూభాగమునుగురించి అనేక విచిత్రములను చెప్పుచుండిరి. అక్కడ గొప్పగొప్ప తటాకములును పలు విధములైన జంతువులును సమృద్ధిగా నున్నవనియు, ఆ దేశముల పరిస్థితులు మిగుల సౌఖ్యకరమైనవనియు వివరించుచుండిరి. ఆ దూరదేశ వార్తను వినిన మన లివింగ్‌స్టన్‌గారు తన మనోరథము నీడేర్చుటకు అక్కడ నేమైనా అవకాశము కలుగునేమో అని యోచించి, ఆ దేశమును చూడవలెనని తీర్మానించుకొనెను. ఆ ప్రాంత్యములనుగురించి ఆయన విన్న సంగతులను చూడగా అక్కడ ఐరోపీయులు నిరుపద్రవ

ముగా నివసించి క్రీస్తు సువార్త ప్రచారమునకు దేశీయులను తర్ఫీయతు చేయుటకు అనుకూలముండునని నిశ్చయించుటమాత్రముకాక బొట్టెలబేరము చేయువారి క్రూరక్రియలు మాన్పించునట్లు ఆఫ్రికా దేశస్థుల క్షేమాభిలాషులు ఎవరు నెరుగని ప్రాంత్యములను దర్శించి జనులకు పరిచితిచేసి వారి రక్షణార్థమై యుక్తమైన వ్యాపారమును జరిపించుట యవసరమని ఆయన యుద్దేశము.

ఆ కాలమందు అరబ్బీ దేశస్థులును పోర్చుగీసువారును బానిసవ్యాపారమును బహు కర్ణకఠోరముగా నడిపించి ఆఫ్రికాఖండపు లోభాగమందలి జనులను వేలకొలదిగా కొల్లపెట్టుచుండిరి. వారు దుష్టులకు కూలియిచ్చి సముద్రమునకు దూరముగనుండిన ప్రాంత్యములలోని జనులను పట్టుకొని వచ్చునట్లు వారిని గుంపులు గుంపులుగా పంపుచుండిరి. ఊరిబావిలోని తాబేటివంటి ఈ అనాగరికులు దొంగవ్యాపారము చేయు అరబ్బీయులును పోర్చుగీసువారును తెచ్చిన చిత్రవిచిత్రములైన వస్తువులు, నిగనిగలాడు నగా నట్రలు, నక్కీ కుట్టిన లుంగీలు మొదలగు పనికిమాలిన సరుకులకు భ్రాంతిచెంది ఎటులైనను వాటిని తీసికొనవలెనని ఆశించి వాటికి బదులు ఇంకేమియు నియ్యలేక తాము యుద్ధములో పట్టుకొన్నవారిని క్రయముగా నియ్య సమ్మతించెడివారు. ఈలాగున ఈ దుష్టవ్యాపారము చేయువారు మనము నిమ్మకాయలు టెంకాయలు కొని తీసికొన్నట్టే, వీరికి రంగు పూసలను, అద్దములను, చీటిచీరలను చూపి, మనుష్యులను కొనుక్కొనుచుండిరి. తుపాకులంటే ఆ మొరటు జనులకు బహు



ప్రియము గనుక ఒక పనికిమాలిన తుపాకిని సంపాదించుటకు సహితము వారు ధర్మాధర్మములను చూడక తమ స్వజనులనుకూడ అమ్మివేయుచుండిరి. ఒక్కొకప్పుడు ఈ దుష్టుల క్రూరకార్యము నెరవేరకపోవుటవల్ల గ్రామములమీద బడి ఇండ్లకు అగ్గిపెట్టి తమ్ము నెదిరించువారిని కాల్చివేసి మిగిలిన వారిని పట్టుకొని వారి మెడలకు పంగలకొయ్యలను తగిలించి, కాళ్లకు సంకెళ్లువేసి, ఎద్దులను తోలుకొనిపోయినట్లు చబుకులతో వారిని కొట్టి తరుముచు నూర్లకొలది మైళ్ల దూరములో నుండిన సముద్రమునొద్దకు తీసికొనిపోయి బానిసలుగా అమ్ముచుండిరి. ఆ దిక్కుమాలిన దరిద్రులు ఆకలిదప్పులకు బాధపడుచు తమతోపాటుగా నడువలేని పసిబిడ్డలను అడవిలో పారవేయుచు, వంక వాగులు దాటుచు, వ్యాధులవల్ల అవస్థపడుచు, కడకు మార్గాయాసము సహించలేక వేలకొలదిగా ఈగలవలె చనిపోవుచుండిరి. వారు బలహీనులై నడువలేకుండగా రాతిగుండెగల ఆ అరబ్బీయులు లేశమైనను కరుణచూపక వారిని తుపాకులతో కాల్చి చంపుచు అడవి జంతువులకు బలిగా నిచ్చుచుండిరి. ఒక్కొకప్పుడు ఈ మానవ దయ్యములు గ్రామములలో పట్టుకొన్న వారిలో నూటికి 75 వంతున దోవన చనిపోవుట కద్దు. రాలిన సున్నమునుబట్టి సున్నపు బండి పోయిన దోవను గుర్తుపట్టునట్లు ఈ బానిసల ఎముకలవలన వారు నడచిన దోవను కనుగొనవచ్చును.

ఈ వ్యసనకరమైన వ్యాపారము అప్పుడు రెండు ఆధారములు గలిగియుండుటవలన నింత భయంకరముగా జరుగు

చుండెను. సముద్రమునకును గొప్ప గొప్ప పట్టణములకును చాలా దూరములోనుండే ఈ గ్రామములకు మనుష్యులుగాని వాహనములుగాని సులభముగా నడువగల మార్గములు లేనందున రాకపోకలు మిగుల అరుదు గనుక నీలాటి మారుమూల గ్రామములలో నీ దుష్టులు జరిపెడి బానిస వ్యాపారము సంగతి నాగరిక ప్రపంచమునకు తెలియకుండెను. కాబట్టి మంచి బాటలువేసి రాకపోకల కనుకూలము చేసినయెడల వీరి దుర్మార్గము లోకమునకు వెల్లడియై త్వరలోనే నిలిచిపోక తప్పదని యెంచి లివింగ్‌స్టన్‌గారు అట్టి రస్తాలు ఎక్కడెక్కడ వేయ సాధ్యమగునో కనుగొనుట తన భారమని నిశ్చయించుకొనెను.

అదిగాక ఈ దూరగ్రామవాసులు అరబ్బీయులు తెచ్చిన రంగు గుడ్డలకును మాయ నగానట్రలకును భ్రమచెంది వాటికిగాను తగిన సొమ్మియ్యలేక తాము యుద్ధమందు పట్టుకొనినవారినైనను తమలోని అనాధలనైనను అమ్మి ఆ పనికిమాలిన వస్తువులను కొనుక్కొనెడివారు గనుక వారి దరిద్రస్థితియే ఆ వ్యాపారమున కాధారమని లివింగ్‌స్టన్‌గారు గ్రహించుకొని, వారు తమ ధాన్యమును చేతి పనులను అనుకూలమైన స్థలములకు తీసికొనిపోయి సరియైన ధరలకమ్మి తమ కవసరమైన సరకులను తెచ్చుకొనునట్లు సౌకర్యము లేర్పరచినయెడల అరబ్బీయుల దుష్టవ్యాపార మంతరించునని లివింగ్‌స్టన్ తెలిసికొనెను. కాబట్టి అట్టి వ్యాపారమున కనుకూలమైన పెద్ద రస్తాలేలాగు పడునో కనుగొనవలెనని ఆయన దేశసంచారము చేయుచుండెను.



పరదేశస్థుల మూలముగా తాను వినిన ఆ సరస్సును కనుగొనుటకై లివింగ్‌స్టన్‌గారు బయలుదేరిన సమయమున నామియాను ఆ తటాకముదగ్గరనే నివసించెడి యొక దేశాధిపతి ఆయనను పిలుచుకొనివచ్చుటకు తన భటులను పంపెను గనుక లివింగ్‌స్టన్‌గారు ప్రయాణమై వారి వెంట పోయిరి.

వారు కొలొబెంగ్ విడిచిన కొన్నాళ్లకు కలహారి యెడారిలో ప్రవేశించిరి. ఈ తెల్లని ఇసుకమయమైన ప్రదేశమందు వర్షము క్రమముగా కురియదు. అయినను అక్కడక్కడ పూర్వకాలమున పారిన నదుల జాడలనుబట్టి అది ప్రాచీనకాలమందు ఫలవంతమైన భూభాగమైయుండినట్లు దృష్టాంతమగుచున్నది. ఇప్పుడా ప్రదేశమందు నీళ్లు దొరుకుట మిగుల కష్టసాధ్యమేయైనను అడవి జంతువులు విశేషముగా నుండుటమాత్రముకాక అక్కడక్కడ మనుష్యులును సంచరించుచున్నారు. బావులు, వాగులు మొదలగు జలాధారములు లేకపోయినను కొన్ని సంవత్సరముల కొకసారి కుంభవర్షము కురియుటవలన నానా విధములగు దోసకాయ సంబంధమైన తీగలు మొలుచుచున్నవి. వాటిలో కొన్నిటికి ఎర్రని పండ్లు కాయును. నీళ్లు ఎండిపోయిన భూమిలో మిగుల విచిత్రమైన కొన్ని తీగలు మొలుచుచున్నవి. ఆ తీగలనుబట్టి భూమిలోపల ఒకటి ఒకటిన్నర అడుగు లోతుగా త్రవ్వినయెడల చల్లని నీళ్లతో నిండిన దానిమ్మపండంత గడ్డ యుండును. ఇంకొక విచిత్రమైన తీగ వ్రేళ్లకు తాటికాయలంత పెద్ద పెద్ద దుంపలు పది పన్నెండు

పుట్టును. అవి కాటి ముంజెలవంటివై తీగచుట్టు మొలచుచున్నవి గనుక ఆ యడవి జనులు ఆ తీగెను కనుగొని గడ్డలున్నవో లేవో తెలిసికొనుటకు చేత నొక రాయి పట్టుకొని ఆ తీగకు చుట్టుగా నేలను తట్టి అది యిచ్చు శబ్దమువలన ఆ గడ్డలు ఉన్నది లేనిది కనుగొని, వాటిని త్రవ్వి నీరు త్రాగి దాహము తీర్చుకొందురు. వర్షము అధికముగా కురియు సంవత్సరములలో ఆ యెడారియంతయు ఎన్నశక్యముకాని కళింగకాయలతో నిండియుండును గనుక అట్టి సుభిక్షకాలమున మనుష్యులకును మృగములకును ఆహారము సమృద్ధిగా నుండును. ఏనుగులు, సింహములు, దుప్పులు, సమస్త చతుష్పాద జంతువులును వెక్కసమగునంతవరకు ఆ కాయలు తినుచుండెడివి.

అయినను ఆ ప్రాంత్యములలో జలాధారము మిగుల తక్కువైనందున దోవ నెరుగని ప్రయాణికులకా యెడారి మిగుల అపాయకరమైనది. అందెక్కడను నీళ్లు కనుగొనలేక అనేకులు దాహబాధచేత చనిపోయియుందురు. ఆ యరణ్యములో వాసముచేయువారికి జలధారలు ఎక్కడ నుండేది తెలిసియుండునుగాని వారు శత్రువులకు భయపడి నీళ్లున్న స్థలములకు దూరముగా కాపురముందురు. అందువల్ల వారి శత్రువులు వారిపైబడినను నీళ్లు ఎక్కడను కానక విధిలేక వారిని విడిచిపెట్టిపోవలసియుండును. ఆ కిరాతులు నీళ్లకుగాను బహు విచిత్రమైన యుక్తి చేసెడివారు. ఎట్లనిన, నీళ్ల జాడలను కనుగొని లోతుగా ఇసుక త్రవ్వి, బోలుగానుండు రెండడుగుల పొడవుగల ఒక రెల్లుపుడక కొనకు కొంచెము గడ్డి కట్టి తాము త్రవ్విన గుంటలో రెల్లుపెట్టి దానిచుట్టు తడి



యిసుక పోసి గట్టిగా కూరుదురు. ఆమీదట ఒక స్త్రీ పుడక పై కొనను నోటిలో పెట్టుకొని దానిలోని గాలిని పీల్చివేయును. గుంటలో పూడ్చిన గడ్డిలోని గాలిని పీల్చుకొలది దానికి ప్రతిగా నీళ్లు సమకూడి కడకు ఆ స్త్రీ నోటిలోనికెక్కును. ఆమె తన దగ్గర తూటు పొడిచిన ఒక నిప్పుకోడి గుడ్డును ఉంచుకొని నోరు నిండినప్పుడెల్లా ఆ గుడ్డులోపలికి ఆ నీటిని ఉమియుచుండును. ఇట్లు కావలసినన్ని గుడ్లు నింపిన తర్వాత వాటి నెత్తుకొని ఆ చెలమకు దూరములోనున్న తమ గుడిసెలకు తీసికొనిపోయి భూమిలో దాచియుంచుదురు. సాధారణముగా వారు వాటిని పొయ్యిక్రింద దాచిపెట్టుటవలన ఆ నీళ్లు భద్రముగా నుండును.

లివింగ్‌స్టన్‌గారును ఆయన సహచరులును ఒక నెల దినములీ కష్టసాధ్యమగు అరణ్యములో ప్రయాణము చేసిన మీదట ఒక పెద్దనది యొద్దను చేరి తమ అరణ్య ప్రయాణము ముగిసినందున మిగుల సంతోషించి, ఇంత దూరము తామెక్కివచ్చిన బండ్లు దిగి పడవల నెక్కి నది వెంబడి ప్రయాణముచేసి కడకు ఆగస్టునెల మొదటి తేదిన తాము వెదుకుచు వచ్చిన సరస్సును కనుగొనిరి. లివింగ్‌స్టన్‌గారును ఆయన సహచరుడగు ఆస్వెల్‌గారును ఆ తటాకమును కనుగొనువరకు ఐరోపీయులెవరును దానిని చూచియుండలేదు గనుక ఆఫ్రికాఖండముయొక్క లోభాగమంతయు వట్టి ఇసుక యెడారియేయని అందరు అనుకొనియుండిరి. అట్లుగాక ఆ ప్రాంత్యము మిగుల ఫలవంతమైన ప్రదేశమనియు, అక్కడ గొప్ప గొప్ప చెరువులును లెక్కకు మించిన నదు

లును గలవనియు, ఆయన చూచి తెలియజేయుటవలన ఆయన లోకప్రసిద్ధిగాంచినవాడాయెను.

ఆ గొప్ప సరస్సును కనుగొనుట వలన లివింగ్‌స్టన్‌గారు తలపెట్టిన రెండు కార్యములలో నొకటి నెరవేరెనుగాని ఆ ప్రాంత్యమందు కొన్ని దినములు గడిపిన తర్వాత తన రెండవ కార్యమునుకూడ నెరవేర్చ యత్నించెను. ఇదివరకు లివింగ్‌స్టన్‌గారు కొలొబెంగ్‌లో నుండగా ఆయనతో ఎక్కువ పరిచయముగా నుండిన సేచేలియొక్క స్నేహితుడును సహాయకుడునైన సెబిత్యువాని యను దేశాధిపతి ఆ సరస్సుకు ఇన్నూరుమైళ్ల దూరములో నివసించుచుండెను. ఆ ప్రదేశము ఐరోపీయులగు మిషనేరీలు నివసించుటకు వసతిగా నుండుననియు సెబిత్యువాని సహాయమున ఆ దేశ జనులమధ్య సువార్త ప్రచారము సఫలముగా చేయ సాధ్యమగుననియు, లివింగ్‌స్టన్‌గారుద్దేశించినందున సెబిత్యువాని దర్శనముచేయ మిగుల నభిలాష గలిగియుండెను. అయినను ఆయన తన యభీష్టమును ప్రస్తావించినతోడనే ఆయన బసచేయుచుండిన గ్రామాధిపతి ఆయన నడ్డగించి, ఆవల పోకుండునట్లు ఆయనకెన్నియో ఆటంకములు చేయదొడగెను. లివింగ్‌స్టన్‌గారు తన దేశమును దాటి సెబిత్యువాని యొద్దకు పోయినయెడల, ఆయనకు తరువాత రాబోయే ఐరోపీయులగు వర్తకులు తుపాకులు మొదలగు ఆయుధములను తెచ్చి సెబిత్యువానికి అమ్ముటవలన సెబిత్యువాని తనకంటె బలవంతుడై తన రాజ్యము నాక్రమించుకొనునని భయపడి, లివింగ్‌స్టన్‌గారి మనవి నంగీకరించకపోవుటమాత్రము



కాక ఎవరును వారికి సహాయము చేయకూడదని దేశమందంతటను దండోరా వేయించి జనులను భయపెట్టెను. అయినను స్వశక్తియే పరమోత్కృష్ట సాధనమన్నట్టు లివింగ్‌స్టన్‌గారు వాసములు జమాచేసి ఒక తెప్పను కట్టి దానిలో నదిని దాటుటకు యత్నము చేసెను. అయినను చాలాసేపు నీళ్లలో నిలిచి కష్టపడి కట్టిన ఆ తెప్పమీద నెక్కిపోగా దానికి వేసిన కొయ్యలు చాలా పుచ్చినవైనందున ఒక మనుష్యుని బరువుకైనను అవి తట్టుకొనలేక విరిగిపోవుచుండెను గనుక లివింగ్‌స్టన్ నిరాశచెంది ఇక సెబిత్యువాని దర్శనము సాధ్యము కాదని నిష్కర్ష చేసికొని తిరిగి కొలొబెంగ్ దారి పట్టెను.

లెచ్యులటేబి చేసిన ఆటంకమువలన మకలోలో దేశమునకు పోవుటకు వీలులేక వెనుకకు రావలసియుండినను లివింగ్‌స్టన్ తన యత్నమును చాలించుకొనక అక్కడ పోవుటకు సిద్ధపడుచువచ్చెను. ఆయన అక్కడనుండగానే దేహసౌఖ్యముకొరకు ఇంగ్లాండుకు వెళ్లియుండిన ఆయన భార్యగారును ముగ్గురు బిడ్డలును వచ్చి చేరిరి గనుక 1850 సం॥ ఏప్రిల్ నెలలో వారందరు మకలోలో దేశమునకు పోవ బయలుదేరిరి. లివింగ్‌స్టన్‌యొక్క స్నేహితుడగు సేచేలి వారి వెంటనుండెను. అతడు నామి సరస్సువరకు పోయి లెచ్యులటేబిని ఒప్పించి, లివింగ్‌స్టన్‌గారు సెబిత్యువాని దేశమునకు పోవునట్లు అతని సమ్మతింపజేయుటకు అక్కడికి వెళ్లెను. వారు కలహారి యెడారి దాటి లెచ్యులటేబి గ్రామము చేరిన తరువాత సేచేలియొక్క ప్రోత్సాహమువలన అతడు సెబిత్యువాని దేశమునకు పోవుటకు లివింగ్‌స్టన్‌గారికి సెలవిచ్చెను.

అందుకు లివింగ్‌స్టన్‌గారు మిగుల సంతోషించి ఆ దూర దేశమునకు పోవ బయలుదేరి రెండు దినములు ప్రయాణము చేసిన తరువాత ఇద్దరు బిడ్డలకు కఠిన జ్వరము తగిలినందున వారు నిలిచిపోవలసివచ్చెను. మరుసటి దినమున వారి పనివారందరును కాయిలాపడిరి గనుక వారా ప్రయాణము చాలించుకొని వెనుకకు మరలవలసివచ్చెను. లివింగ్‌స్టన్ సతిగారు మిగుల అస్వస్థతగా నుండుట వలన వారు కురుమాన్‌కువచ్చి మాఫట్‌గారి యింటిలో దిగిరి.

లివింగ్‌స్టన్‌గారు తనయొద్దకు వచ్చుచుండగా దారిలో కలిగిన అసందర్భములనుబట్టి తిరిగి కురుమాన్‌కు వెళ్లిన సంగతి సెబిత్యూవాని తెలిసికొనగా ఆయనను తన యూరికి పిలుచుకొని వచ్చుటకై అతడు మనుష్యులను పంపెను. వారు కురుమాన్‌కు పోవు మార్గమున లెచ్యులటేబి, సెకోమి, సేచేలి యను ప్రజాధిపతుల గ్రామములను దాటవలెనని యెరిగి లెచ్యులటేబికి పదమూడు ఎర్రావులను, సెకోమికి పదమూడు తెల్లావులను, సేచేలికి పదమూడు కర్రె ఆవులను బహుమానముగా పంపించెను. సెబిత్యూవాని పంపిన రాయబారులు వచ్చినప్పుడు లివింగ్‌స్టన్‌గారు తన భార్య బిడ్డలను పిలుచుకొనివచ్చుటకు కురుమాన్‌కుపోయి వారిని కొలొబెంగ్‌కు తీసికొనివచ్చి ఆ దూర ప్రయాణమునకు సిద్ధపడి, పెద్ద బండిలో సరకు సంబారము నెక్కించి బయలుదేరెను. సెబిత్యూవాని దేశమునకు పోవుటకై వారు తిరిగి కలహారి యెడారి దాటవలసియుండెను. ఎడారి దోవలు ఎడారి నివాసులకే తెలిసియుండెనుగాని మరియెవరికిని తెలియవు గనుక



వారు తమకు దారి చూపుటకై ఒకనిని వెంటబెట్టుకొని పోయిరి. కలహారి యెడారి భయంకరమైన ప్రదేశమని ఇదివరకు తెలిసికొన్నాముగాని ఈ ప్రయాణమందు వారు పడిన పాట్లు ఎన్నశక్యముకానివి. వారు బయలుదేరక మునుపే వారి మార్గదర్శి ఒక నెల దినములవరకు నీళ్లు దొరకవే దొరకవని హెచ్చరించినందున వారు పీపాయిలలో నీళ్లు తీసికొనిపోయిరిగాని చాలా దినములుగా వట్టి యిసుక మైదానమందు ప్రయాణము చేయవలసివచ్చినందున దాహమువలన మిగుల బాధపడిరి. అది కేవలము నిర్జనమైన అరణ్యము గనుక మూడు దినములవరకు వారికొక పిట్టయైనను పురుగైనను కనబడలేదు. గోరుచుట్టుపైన రోకటిపోటన్నట్లు నడి యెడారిలోనే వారి మార్గదర్శి దోవ కనుగొనలేక అల్లాడుచుండెను. ఎక్కడను నీళ్లు దొరకక తెచ్చిన నీళ్లు అయిపోవచ్చిన తరుణమున ఒక పనివాడు అజాగ్రత్తచే పాత్రను క్రిందపడవేయగా అందుండిన నీళ్లన్నియు నేలపాలాయెను. ఆ మీదట వారికి నాలుగు దినములవరకు ఒక నీళ్ల చుక్కయైనను చూచు ప్రాప్తము లేకపోయెను. ఆహా! వారి శ్రమ సంకటము లేమందుము! అయినను అరణ్యమందలి ఇష్మాయేలును జ్ఞాపకము చేసికొనిన దేవుడు ఈ పసిబిడ్డల మొర విన నేతెంచడా? తప్పక నేతెంచునుగదా. అందువల్ల అయిదవనాటి సాయంకాలమున నీళ్లు వెదుకబోయిన సేవకుడు సొరకాయ బుర్రలో నీళ్లుతెచ్చి యివ్వగా వారందరు తనివి దీర త్రాగి ఆ యమృతధారల ననుగ్రహించిన దేవుని స్తుతించిరి. అయినను వారి

గండము తప్పించుకొని వెంటనే సుఖము చెందిరని మన మనుకొనదగదు. నీళ్లున్న ప్రదేశమునకు వచ్చినందున వారి కష్టములు కొంతవరకు తీరినను పశువులకు ఉపద్రవము సంభవించగా వారు మరింత యాతనపడిరి. వారప్పుడుండిన ప్రాంత్యములో సెట్సి యనబడిన ఒక విధమైన ఈగలు ప్రబలియుండెను. అవి తేనెటీగ వర్ణముగాను మన యిండ్లలోని ఈగలంత పెద్దవిగాను ఉండి, దోమవలె మనుష్యులను మృగములను కుట్టుచున్నవి. ఇవి అడవి జంతువులనుగాని, గాడిదెనుగాని, మేకనుగాని కుట్టినను వాటికేమియు అపాయము సంభవించదు. అయినను అవి యెద్దులను, గుర్రములను, కుక్కలను కుట్టినయెడల అవి నెలలకొద్ది చిక్కిపోవుచు కాలక్రమముగా బాధ ఎక్కువైనందున తప్పక చచ్చిపోవును. కొన్ని ప్రాంత్యములలోని ఈ యీగలు మనుష్యులను కుట్టినయెడల వారికి ఉపద్రవకరమైన నిద్రమబ్బు కలిగినందున దినక్రమేణ బలహీనులై కడకు చనిపోదురు. ఈ యీగలవలన కలుగు ఉపద్రవము లివింగ్స్టన్‌గారికి తెలిసియుండెను గనుక అవి యుండిన ప్రాంత్యమునకు వచ్చినతోడనే తన యెద్దుల విషయము కడు జాగ్రత్త తీసికొనెను. ఆ సమయమున ఇరువై ఈగలైనను ఎద్దులమీద వ్రాలలేదని చెప్పగలిగియుండినను నలభైమూడు ఎద్దులు ఈగలు కుట్టి చచ్చిపోయెను. కొన్ని విషయములలో నీ ఈగల సంగతి కడు విచిత్రముగా నున్నది. ఏమనిన, అవి కుట్టుటవలన ఎద్దులు చచ్చిపోవుచుండినను, పాలు త్రాగెడి దూడలకుమాత్రము ఏ హానియు సంభవింపలేదు. మరియు అవి ఒక యేటి ఈవలి



యొడ్డున మునురుకొనియుండినను ఏటి ఆవలి యొడ్డున బొత్తుగా లేకుండెను.

లివింగ్స్టన్ వచ్చుచున్న సమాచారము సెబిత్వ్యావాని తెలిసికొని ఆయన నెదుర్కొనుటకు పది యామడల దూరము వచ్చి, ఆయనకు మిగుల వైభవముగా స్వాగతమిచ్చి, తన ముఖ్యపట్టణమగు లిన్‌యాంటికి తీసికొనిపోయి ఆయనకొరకు మిగుల సౌఖ్యకరమైన యేర్పాట్లు చేసెను. సెబిత్వ్యావాని యొక్క యనుమతి సంపాదించి, అతని రాజ్యములో క్షేమకరమైన స్థలమును కనుగొని తాను చాలా దినములనుండి యుద్దేశించిన దేశీయ యుపదేశుల పాఠశాలలను స్థాపింప సాధ్యమగునని లివింగ్స్టన్ సంతోషించుచుండెను. అయినను ఆ యుద్దేశము అప్పుడు నెరవేరునట్లు దేవుడు సంకల్పించలేదు. లివింగ్స్టన్‌గారు లిన్‌యాంటి చేరిన ఒక నెల దినములకు సెబిత్వ్యావానికి అంతకుముందు చాలా దినములక్రిందట తగిలిన గాయము చెలరేగినందున అకాలమృత్యువాతపడెను.

సెబిత్వ్యావానికి తదనంతరముగా ఆయన కుమార్తె సింహాసనమెక్కెను గనుక లివింగ్స్టన్‌గారు ఆ దేశములో సంచరించుట కామె సెలవిచ్చునో లేదో కనుగొనుటకై పన్నెండు దినముల ప్రయాణమంత దూరములోనుండిన ఆమె యారికి మనుష్యులను పంపెను. ఆమె లివింగ్స్టన్‌గారి మనవి నంగీకరించి, ఏలాటి యభ్యంతరములేకుండ ఆయన తన యిష్టము వచ్చినట్లు ఆ దేశమందెక్కడైనను సంచరించవచ్చుననియు, తనకు అనుకూలమగు స్థలమేర్పరచుకొని ఇల్లు కట్టుకొని పని చేయవచ్చుననియు సెలవిచ్చెను. సువార్త ప్రచారయత్న

మున కనుకూలమైన స్థలమును కనుగొనవలెననియు, జనులు చెప్పుచుండిన మహా జీవనదిని కనుగొనవలెననియు ఈ రెండు ఉద్దేశములు పెట్టుకొని లివింగ్‌స్టన్‌గారు తన సంసారమును మకలోలో పెద్దల కాపుదల కప్పగించి యుత్తరదిశ ప్రయాణముచేయుచు పోయిరి. ఆయన తన తోటి ప్రయాణికుడగు ఆస్వెల్‌గారిని కలిసికొని నూట ముప్పది మైళ్ల దూరము వెళ్లిన తర్వాత 1851 సం॥ జూన్ నెల అంత్యమున జాంబీసియను మహానదిని కనుగొనెను. అప్పుడు ఎండకాలమైయుండినను ఆ యేటిలో 400 అడుగుల వెడల్పున నీళ్లు చాలా లోతుగా ప్రవహించుచుండెను. వర్షాకాలమున ఆ యేరింకను 20 అడుగులు పైకి వచ్చి ఇరు ప్రక్కల పదునైదు మైళ్ల దూరమువరకు దేశముమీద పారలి పారును. ఆ జీవనది ఆ ప్రాంత్యముద్వారా ప్రవహించు సంగతి ఐరోపీయులెవరును అంతకుముందు తెలిసికొనియుండలేదు గనుక లివింగ్‌స్టన్ గారే దానిని మొట్టమొదట కనుగొన్నవారైనందుచేత ఆయన పేరు మిగుల ప్రసిద్ధిచెందినదాయెను. వారు ప్రయాణముచేసి వచ్చిన ప్రాంత్యములో నెక్కువభాగము జౌకు నేలయైనందున ఐరోపీయుల నివాసమున కనుకూలమైన స్థలము కాదు గనుకను, ఆ మహానది యుత్పత్తి స్థానమును తెలిసికొని సముద్రమునొద్దకు ఆ దేశ సరకులను తీసికొని పోవుటకు ఆ యేటి వెంబడియే మార్గము నేర్పరచి బానిస వ్యాపారము నాపవలెనని దృఢ నిశ్చయము చేసికొనెను గనుకను ఆయన తన భార్య బిడ్డలను విడిచివచ్చిన యూరికి తిరిగి వెళ్లెను. అయినను లివింగ్‌స్టన్ తానిప్పుడు పెట్టుకొన్న



యుద్దేశమును నెరవేర్చువరకు తన సంసారమును ఆ జ్వరాల ప్రదేశమందు విడుచుట అపాయకరమనియు వారిని ఇంగ్లాండు దేశమునకు పంపుట ఉచితమనియు తీర్మానించి, మొదట కురుమాన్ గ్రామమునకును తరువాత కేప్‌టవున్‌కును వారిని తీసికొనిపోయి కేప్‌టవున్‌లో ఓడెక్కించి స్వదేశమునకు పంపెను. ఆయన వారి నెడబాయుచు, ఇక మిమ్మును తిరిగి రెండేండ్లలోపల కలిసికొనెదనని చెప్పి వారి కభయమిచ్చెనుగాని అట్లు జరుగుటకు అయిదేండ్లు పట్టెను.

లివింగ్‌స్టన్‌గారు తన భార్యబిడ్డలను సాగనంపి 1852 సం॥ జూన్ నెలలో కేప్‌టవున్ విడిచి తిరిగి మకలోలో దేశమునకు ప్రయాణమాయెను. ఆయన 1853 సం॥ మే నెల అంత్యమున వారి ముఖ్యపట్టణమైన లిన్‌యాంటి చేరెను. అక్కడికి పోవుచుండగా ఆయన దోవలో తన మామగారైన మాఫట్‌గారిని దర్శించెను. ఆ భక్తశ్రేష్ఠుడప్పటికి నలభైయేండ్లకు పైగా సువార్త ప్రచారమునకు ప్రయాసపడి ఆ సమయమందు సత్యవేద గ్రంథమును సెచ్వానా భాషయందు తర్జుమా చేయుచుండెను. లివింగ్‌స్టన్‌గారు కురుమాన్‌లో నుండగా తన స్నేహితుడగు సేచేలికి కలిగిన యుపద్రవమును తెలిసికొని మిగుల విచారాక్రాంతుడాయెను. పూర్వము హాలాండు దేశమునుంచి డచ్చివారు వచ్చి దక్షిణాఫ్రికాలో వలసరాజ్యముల నేర్పరచుకొని క్రమక్రమముగా దేశము నాక్రమించుకొనిరి. వారు స్వదేశస్థులను తరిమి వారి భూములను వశపరచుకొనిరి. ఈ బోయెర్లనబడినవారు ఆ నల్లవారిని పశువులతో సమాన

ముగా నెంచి వారిని బహు క్రూరముగాను అన్యాయముగాను చూచుచుండిరి. లివింగ్‌స్టన్‌గారు దేశీయుల పరముగా నిలిచి వారియభివృద్ధి నిమిత్తము ప్రయత్నించినందున బోయెర్‌వారు ఆయనను ద్వేషించి, ఆయన స్నేహితులైన దేశీయులను బాధపరచి ఏనాడైనను లివింగ్‌స్టన్ తమ చేతికి చిక్కినయెడల ఆయన రక్తము త్రాగుతామని శపథము చేసికొనిరి. ఆ సమయమున ఆయన ప్రయాణమై తాను ముందు కాపురముండిన కొలొబెంగ్ అను గ్రామమునకు పోవుచుండగా కురుమాన్‌కు కొంత దూరములోనే ఒక బండి చక్రము విరిగిపోయినందున ఆయన తిరిగి కురుమాన్‌కు వచ్చి దానిని బాగుచేయ వలసివచ్చెను. ఈ విపత్తువలననే ఆయన తనకు రానైయుండిన మరణ గండమును తప్పించుకొనెను. ఎట్లనిన, ఆ తరుణమున సేచెలి భార్య తన చంటిబిడ్డ నెత్తుకొని మాఫట్ దొరసాని ఆశ్రయము జొచ్చి బోయెర్‌వారు కొలొబెంగ్ గ్రామముమీద పడి దానిని కొల్లపెట్టిరనియు, సేచెలి యొక్క పిల్లలను తమ సేనాధిపతికి దాసులుగానుండుటకు చెరపట్టుకొనిపోయిరనియు, ఆమెకు తెలియజేసెను. అట్లయితే నీవేలాగు తప్పించుకొంటివని మాఫట్ దొరసానిగారడుగగా సేచెలి భార్య, వారు ఇంటిమీద పడగా నేనీ బిడ్డ నెత్తుకొని ఒక సందులో బడి ఊరు వెలుపలనుండిన ఒక గుహయొద్దకు పరుగెత్తుకొనిపోయి దాగుకొంటిని. బోయెర్‌వారు ఆయూరును కొల్లపెట్టిన తరువాత తుపాకులు కాల్చుచు నేను దాగుకొనియుండిన గుహాతట్టుకే వచ్చి, చివరకా గుహపై నుండిన బండ నెక్కి గుహలోని నాకు తుపాకుల నోర్లు కన



బడునట్లుగా కాల్చుచుండిరి. ఆ సందడికి బిడ్డ భయపడి కెవ్వున నేడ్వగా వారు మమ్మును కనుగొందురేమో అని మిగుల భీతి జెంది నా కడియములు తీసి ఆడుకొనుటకు బిడ్డచేతికిచ్చితిని. వాటితో ఆట్లాడుకొనుచు బిడ్డ యూరకుండెను గనుక బోయెర్‌వారు మమ్మును కనుగొనలేక దాటిపోయిరని తెలియజేసెను. లివింగ్‌స్టన్‌గారు దేశీయులకొరకు చేయుచుండిన యుపకారమునకు బోయెర్‌వారు మండిపడి ఆయనయెడల పగ వహించి ఆయనకు హానిచేయుటకు సందు కనిపెట్టుచుండిరి గనుక వారు కొలొబెంగ్ గ్రామమును పాడుచేసినప్పుడు ఆయన యిల్లు దోచుకొని మందులన్నిటిని మంటకలిపి ఆయన పుస్తకములన్నియు చింపి పరశురామ ప్రీతి గావించిరి. ఈ దుష్కార్యమును నడిపించిన బోయెర్ సేనానాయకుడు లివింగ్‌స్టన్ గారిని చంపవలెనను ఉద్దేశముతోనే ఆ గ్రామమునకు వచ్చియుండెను గనుక బండి చక్రము విరిగి ప్రయాణమున కాటంకము కలిగినందుకు లివింగ్‌స్టన్‌గారు మిగుల విచారపడినను ఈ సంగతి విన్న తరువాత ఆ విపత్తువల్లనే దేవుడు తన ప్రాణము దక్కించెనని గ్రహించుకొని ఆయన ఘనమైన నామమును మిగుల కొనియాడెను. ఆయన కొలొబెంగ్ గ్రామము చేరినప్పుడు పాడుచేయబడిన తన బంగ్లాను చూచి సరి. సరి. నాకిప్పుడు ఇల్లులేనిదే మంచిపనియైనది. ఇక నిరభ్యంతరముగా దేశ సంచారము చేయగలనని ఒక సరసోక్తి చెప్పెనట.

వారు కొలొబెంగ్ విడిచి లిన్[illegible] పోవ బయలుదేరిరి. అట్లు చేయుటలో వారు [illegible] కలహారి [illegible] దాట



ఆఫ్రికా దేశములోని పదియడుగుల పొడవుగల పింజెరపాము

వలసివచ్చెనుగాని ఇదివరకు రెండు మూడు పర్యాయములం దానిని దాటినందున వారు మునుపటివలెగాక సులభముగా దాటగలిగిరి. ఒకనాడు వారు దోవను వెళ్లుచు పంద్రెండడుగుల పొడవును మనుష్యుని తొడయంత లావునుగల ఒక పింజెరపామును కాల్చిరి. సింహములు రాత్రిలో వారి మఖాము దగ్గరకు వచ్చి బండ్ల చాటుననుండి యెద్దులు బెదరి పగ్గములు తెంపుకొని పారిపోవలెనని ఉరుమువలె గర్జించెను గాని వారు తమ మఖాముమధ్య వేసిన చలిమంటకు భయపడి యెద్దులమీద పడకయే వచ్చిన దోవపట్టిపోయెను.

వారు ఎడారి దాటి ఏటి సమీపముననున్న వృక్షకోటి మైదానమునకు వచ్చిరి. ఆ ప్రాంత్యమందంతటను గడ్డి జొన్నపైరువలె రెండు మట్ల యెత్తుగా పెరిగినందున బండ్లు పోవుటకుగాని దోవను కనుగొనుటకుగాని వారికి వీలులేక మిగుల అవస్థపడిరి. ఆ మైదానము మధ్య ప్రవహించు ఏటి యొద్దను పలువిధములైన అడవి జంతువులు సంచరించుచుం డెను. వానిలో ఒక బ్రహ్మాండమైన తెల్లని ఖడ్గమృగము పొర్లాడుకొనుటకు బురదగుంటను వెదకుచు ఏటివెంబడి పోవు



చుండెను. ఖడ్గమృగము మిగుల రోషముగల జంతువు గనుక సాధారణముగా మనుష్యుని చూచినతోడనే అది వానిమీదికి వచ్చును. కాబట్టి లివింగ్‌స్టన్‌గారును ఆయన పరివారమును ఆ భయంకరమైన జంతువును చూచి మిగుల జడిసిరిగాని ఖడ్గ మృగము యొక్క ముక్కుమీది కొమ్ము పెద్దదియు కన్నులు చిన్నవియునై యున్నందున అది వారిని చూడక దాటిపోయెను.



తలకుమించి పెరిగిన పచ్చిక

వారప్పుడు సంచరించుచుండిన ప్రాంత్యమునకును వారు చేరవలసిన మకలోలో దేశమునకును మధ్య నొక పెద్ద నది ప్రవహించుచున్నందున వారు బండ్లు దాటగలిగిన రేవుకొరకు వెదకుచువచ్చిరి. అయినను ఏటి యొద్దను మనుష్యులు చొరవకూడనంత దట్టముగా గడ్డి మొలచియుండున వారు దానిలో పోలేకుండిరి. ఆ గడ్డి పదును గల కత్తివలె వాడియైన అంచులు గలది గనుక అది యెక్కడ తగిలినను కోసికొని గాయము లేర్పడుచుండెను. ఆ గడ్డిలో కొంతదూరము వెళ్లిన తర్వాత వారి గుడ్డలు తునకలు తునకలుగా చీల్చుకొనిపోవుటమాత్రము గాక వారి కాళ్లు చేతులు కోసికొని రక్తము కారుచున్నందున వారు వెనుకకు మరలవలసివచ్చెను. పిరికిబంటుకు

తుమ్మాస్థ అన్నట్టు గుండెలేనివారట్టి గండములకు వెరచి పట్టువదలి యూరకుందురుగాని మన లివింగ్‌స్టన్‌గారట్లు కాక వెనుకకు పోయినంత తెలివితక్కువలేదని యెరిగి ఎట్టి విపత్తుకైనను విసుగుజెందక కష్టములు హెచ్చుకొలది మరింత పట్టుదలతో ప్రయత్నించువాడు. కాబట్టి వారు గడ్డిగుండ పోవుటకు దోవకొరకు వెదకుచుండగా వారికొక నీటి గుర్రము పోయిన జాడ కనబడెను. వారు ఆ జాడ వెంబడి వెళ్లి యేటియొడ్డు చేరిరి. అయినను గోడపెట్టు చెంప పెట్టన్నట్టు వారు ఏటియొడ్డు చేరగా వారికి నిరాశ కలిగించు మరియొక విపత్తు తటస్థించెను. ఏమనిన, ఏటిలో నీళ్లు చాలా లోతుగా నుండినందున వారు నీళ్లలో దిగిపోవుటకు సాధ్యముకాకుండెను. కాబట్టి వారు విఫలమనోరథులై వెనుకకుపోయి జంబులోనే ఒక గుడిసె కట్టుకొని దోమల కాటుకు నిద్రపట్టక రాత్రియంతయు మేలుకొని కాలము గడిపిరి. ఇప్పుడైనను లివింగ్‌స్టన్‌గారు పట్టువదలక, పిల్లికి తెలిసింది ఒకటే యుపాయమూ అన్నట్టు, ముప్పది యడుగుల యెత్తుగల ఒక చెదలపుట్ట నెక్కి దేశమును కలయజూచి తాము దాటలేకుండిన ఆ నదిలో వేరొక ఉపనది వచ్చి సంగమించుచున్నట్టు కనుగొనెను. వెంటనే వారు తమదగ్గర నుండిన పడవను మిగుల ప్రయాసముతో ఆ యేటియొద్దకు తీసికొనిపోయి పెద్ద యేటిలోకి నడిపించిరి. వారు నడి యేటిలో పడవను నడిపించుచుండినప్పుడు ఏటిలో మునిగి యుండిన ఏనుగంత పెద్ద నీటిగుర్రమొకటి పడవనానుకొనిమే పైకి వచ్చెను. ఆ గొప్పజంతువు లేపిన తరంగములవలన



ఆ పడవ మునుగునట్లుండెనుగాన వారు తిరిగి మృత్యువాత పడితిమనుకొనిరి. అయితే దైవవశాన వారీసారికూడ ప్రాణములు దక్కించుకొనిరి.

వారు ఉదయమునుండి సాయంకాలమువరకు ఆ యేటి వెంబడి పడవను నడిపించినను ఏటియొడ్డున గోడవలె మొలచిన గడ్డిలో ఒక మనుష్యుడు పోగలిగినంత కంతకూడ కనబడనందున వారు మిగుల ప్రయాసపడి తమ యత్నములన్ని వ్యర్థమైపోయెనని విసుగుజెందియుండినంతలో ప్రొద్దుగ్రుంకి చీకటిపడువేళ ఒక గ్రామము కనబడగా వారు తమ ప్రయాసములన్ని మరచి ప్రాణములు తెప్పరిల్లినవారైరి. ఆ యూరి జనులు ఇదివరకు లివింగ్‌స్టన్‌గారు నెళవు చేసికొని యుండిన మకలోలోవారే గనుక ఆయన రాకడకు వార పరిమితముగా సంతోషించి, ఆయనకు గంభీరముగా స్వాగతమిచ్చి, విందుచేసి, రాత్రికి బస చూపిరి.

మరుసటి యుదయమున గ్రామ పెద్దలందరు గుమికూడి లివింగ్‌స్టన్‌గారు బసచేయుచుండిన ఇంటియొద్దకు వచ్చి ఉభయకుశలోపరి నడిగి భార్య బిడ్డల క్షేమము విచారించి ఆయన బడలికను తీర్చ తగిన యేర్పాటు చేసిన తరువాత ఆయన అవతలి యొడ్డున విడిచివచ్చిన బండ్లను ఏరు దాటించి తీసికొని వచ్చుటకై పోయిరి. ఆ పెద్ద బండ్లు గడ్డిలో దోవ చేసికొని రాలేకపోయినందునను, వాటిని ఏరు దాటించుటకు అవి పట్టగలిగినంతటి పడవలు లేకపోయినందునను మకలోలోవారు వాటిని ఆయా భాగములుగా విప్పి, ఇవతలి యొడ్డుకు తెచ్చిన తరువాత వాటిని యథాప్రకారము

అమర్చిరి. లివింగ్‌స్టన్‌గారును ఆయన సహప్రయాణికులును ఏటియొద్దను నుండిన గ్రామములో కొన్నిదినములు గడిపిన తర్వాత మకలోలోవారి ముఖ్యపట్టణమైన లిన్‌యాంటికి ప్రయాణమైరి. వారు బసచేసిన గ్రామవాసులందరును ఆయన నెదుర్కొని గొప్ప యూరేగింపుచేసి మిగుల వైభవముతోను మహా ఆర్భాటముతోను మూడామడల దూరములోనుండిన లిన్‌యాంటికి ఆయనను తీసికొనిపోయిరి. లివింగ్‌స్టన్‌గారు వచ్చుచుండిన సంగతి లిన్‌యాంటివారైన ఆ 6000 మంది తెలిసికొని పనిపాటులువిడిచి ఆబాలగోపాలముగా ఆయన నెదుర్కొనుటకు వచ్చి ఆయన తెచ్చిన అద్భుత శకటములను చూచి అపరిమితముగా నాశ్చర్యపడిరి. వారంతకు మునుపు చక్రములతో నడచు దేనినైనను చూచియుండలేదు గనుక ఆ బండ్లు వారి కెక్కడలేని చోద్యమును కలిగించెను. కడకు లివింగ్‌స్టన్‌గారు 1853 సం॥ మేనెల అంత్యమున మకలోలో దేశముయొక్క ముఖ్యపట్టణమైన లిన్‌యాంటి జేరిరి.

పోయినసారి ఆయన లిన్‌యాంటికి వచ్చినప్పుడు సెబిత్వ్యాని కుమార్తె రాజ్యము చేయుచుండెనుగాని రాజ్యకార్యమామెకు మిగుల భారమైనందున ఆమె తన తమ్ముడగు సేకేలేటు కధికారమిచ్చి తాను రాజీనామా ఇచ్చెను గనుక ఈసారి లివింగ్‌స్టన్ లిన్‌యాంటికి వచ్చుసరికి పదునెనిమిదేండ్ల యీడుగల సేకేలేటు రాజ్యపరిపాలన చేయుచుండెను. లివింగ్‌స్టన్‌గారు గ్రామములో ప్రవేశించినప్పుడు సేకేలేటు తన కొలువుకూటముతో ఆయన రాకకొరకు కాచుకొనియుండి రాజులకువలె ఆయనకు గంభీరస్వాగతమిచ్చి చాలా మర్యాద



చేసెను. ఘనతకెక్కిన పరదేశులు రాజదర్శనమునకు రాగా మకలోలోవారు తమ పురాతన ఆచారము ప్రకారము వారికి మర్యాద చూపుటకు అందరు దర్బారులో కూర్చున్న తర్వాత రాజస్త్రీమణులు తలా ఒక పెద్ద బానెనిండ పానకము దెచ్చి దర్శనమునకువచ్చినవారియెదుటనుంచి, అందులో విషము కలుపలేదని సూచించుటకై వారు దానిలోనిది కొంచెము త్రాగుదురు.

ఐరోపీయులగు మిషనేరీలు దేశీయులను సువార్త ప్రచారమునకు తర్బీతు చేయునట్లు వారు క్షేమముగా నివసించుటకు తగిన స్థలమును కనుగొనుటయే లివింగ్‌స్టన్ మకలోలో దేశమునకు వచ్చుటకు కారణమని మనము ఇదివరకు తెలిసికొంటిమి. ఆ యుద్దేశానుసారముగా ఆయన లిన్‌యాంటిలో నొక నెలదినములు గడిపి ఆ దేశముయొక్క సాధకబాధకములను తెలిసికొనెనుగాని అక్కడ జ్వరము లధికమైనందున ఆ ప్రాంత్యము తానుద్దేశించిన పాఠశాల కనుకూలమైనది కాదని తీర్మానించి ఆ యత్నము మానుకొనెను. అయినను సువార్త ప్రచారమునకును ఆ దూర ప్రాంత్యముల జనుల యభివృద్ధికిని మరియొక విధముగా వీలు కలుగజేయవలెనని తలంచి ఆయన అట్లుచేయుట కుపక్రమించెను. ఎట్లులైనను అరబ్బీయుల దుర్వ్యాపారము నాపవలెనని ఆయన పట్టుపట్టియుండెను గనుక తాను నూతనముగా కనుగొన్న నదుల మూలమున సముద్రమునుండి ఆ లోప్రాంత్యములకు మార్గము నేర్పరచినయెడల ఆ మార్గమున సువార్త ప్రచారకులు వచ్చి క్రీస్తుమతమును బోధించుటవలనను ఆ ప్రాంత్యపు

జనులు తమ సరకులు తీసికొనిపోయి న్యాయమైన వ్యాపారములుచేసి లాభము సంపాదించుటవలనను అరబ్బీయుల వ్యాపారము లడుగంటి అనాగరిక జనులకు ఎన్నశక్యముకాని మేలు కలుగునని తీర్మానించుకొనెను. అట్లు లిన్‌యాంటినుంచి పశ్చిమ సముద్రమువరకు మార్గమును కనుగొన్న తరువాత తూర్పుదిక్కు సముద్రమునకు దోవ నేర్పరచుటకూడ తన భారమని ఎంచి, పశ్చిమ సముద్ర తీరముననున్న లోవాండయను ఓడ రేవుకు వెళ్ల నిశ్చయించుకొనెను. కాబట్టి ప్రయాసకరమైన ఆ దీర్ఘ ప్రయాణము చేయుట కాయన 1853 సం॥ నవంబరు నెల 11 వ తేదిన బయలుదేరెను.

# 4 వ. అధ్యాయము

## లివింగ్‌స్టన్ లిన్‌యాంటినుండి లోవాండవరకు చేసిన ప్రయాణము

లివింగ్‌స్టన్‌గారు పశ్చిమ సముద్రమువరకు వెళ్లవలెనని తాను చేసికొన్న తీర్మానమును సేకేలేటుకు తెలియజేయగా, ఆయన దర్బారు కావించి, పిన్నపెద్దలతో నీ విషయమును గురించి చర్చచేయ నాజ్ఞాపించెను. దర్బారుకు వచ్చినవారిలో నెక్కువ భాగమువారు అందుకు సమ్మతించి లివింగ్‌స్టన్ వెంట కొంతమందిని పంపుట కొప్పుకొనిరి. అయితే సేకేలేటు ఈలాగు ఐరోపీయులతో పరిచయము కలుగజేసికొనుటను ఒక ముసలివాడు ఖండించుచు, మీరెందుకీ కార్యములో కలియుచున్నారు? ఈ తెల్లవైద్యుడు మిమ్మును మోసపుచ్చి అడవిపాలు చేయునని మీరెరుగరా? అయ్యో! మీ గుడ్డలిప్పుడే రక్తము వాసన కొట్టుచున్నవే అని కోపోద్రేకముతో పలికెను. అయినను సేకేలేటును అతని కొలువుకూటమును లివింగ్‌స్టన్ యొక్క ఉద్దేశము నంగీకరించి ఆయనను వెంబడించుటకై ఇరువదియేడుమంది నేర్పరచి ప్రయాణమునకు సిద్ధపరచిరి.

ఇంత పరివారమునకు జీతనాతము లిచ్చుటకు లివింగ్‌స్టన్‌గారికి శక్తియుండెనా? ఇతరులు బలాత్కారముచేతను

విశేష రొక్కమిచ్చుటచేతను తమ కార్యములను తుదముట్టించుచుండగా లివింగ్‌స్టన్‌గారు శాంతముగాను ద్రవ్యములేకుండను వారందరికంటె గొప్ప యత్నములు కొనసాగించుటను చూడగ ఎవరికైనను ఆశ్చర్యము కలుగకమానదు. అయినను ఆయన వినియోగించిన ఉపకరణములే వేరు. సంతోషము సగము బలమని మన మెరిగినట్లు ఇతరులను బెదిరించి బలాత్కారముచేయక ప్రేమ సాధనముగా వారిని ఒప్పించి, వారితో పరిచయము చేసికొని, వారిలో విశ్వాసము పుట్టించినందున వారు ఇష్టపూర్వకముగాను ఉత్సాహముతోను ఆయనకు తోడ్పడిరి. ఆ ప్రేమాకర్షణచేత వారు జీతనాతములు లేకపోయినను ప్రాణమునకు తెగించి ఆయనను సేవించిరి. మంచితనముచేత ఒకనితో మన్నైనా మోయించవచ్చునన్నట్లు లివింగ్‌స్టన్‌గారు ఏండ్లకొలది ప్రయాణములు చేయుచువచ్చినను ఒకసారియైనను మనుష్యులమీద తన తుపాకి నుపయోగించినవాడు కాడు.

ఆ సమయమున ఆయన 1500 మైళ్ల దూర ప్రయాణమునకు బయలుదేరుచుండినను బహు కొద్దిగామాత్రము సామానులు తీసికొనిపోయెను. ఆ ప్రాంత్యములలో బండ్లు పోలేకుండెను గనుక లివింగ్‌స్టన్‌గారు తాను లిన్‌యాంటికి తెచ్చిన బండ్లన్నియు సేకేలెటు వశముచేసి పడవలనెక్కి బయలుదేరెను. గుడ్డలు తిండిబండములు బహు కొద్దిగా మాత్రము తీసికొనివెళ్లియుండినను, దిక్కులు తెలిసికొనుటకు కావలసిన యంత్రములను, సువార్త ప్రచారమునకు మాజిక్‌లాంతరును, ప్రార్థనాభ్యాసమునకు బైబిలును ప్రాముఖ్యముగా నెంచి వాటిని మరువకుండ తీసికొనిపోయెను.



సేకేలేటు లివింగ్‌స్టన్‌గారిని సాగనంపుటకు తన పరివారముతోకూడ చోబినదివరకు వచ్చి వారికి కావలసిన పడవల నేర్పాటుచేసి, లివింగ్‌స్టన్‌గారి యుపయోగార్థము తన స్వంత పడవనిచ్చి వారియొద్ద సెలవుపుచ్చుకొని తిరిగి లిన్‌యాంటికి పోయెను.

చోబి నదిలో నీటి గుర్రములు, మొసళ్లు, పెద్ద పెద్ద తాబేళ్లు మొదలగు జలచరములు మెండుగా నుండెడివి. నీటిగుర్రములు సాధారణముగా సాధువైనవేగాని పోతువాటికి బలముడిగినప్పుడు తక్కినవి వాటిని మందలోనుండి తరిమివేయును గనుక అవి ప్రత్యేకముగా తావులు చేసికొనియుండును. అట్టి ముసలిపోతులు మిగుల భయంకరమైనవి. అవి నీళ్లలో మునిగి కొంచెముసేపు అడుగుననే యుండునుగాని తిరిగి పైకి వచ్చినప్పుడు పడవ కనబడినయెడల దానిని నోటితో కొరికి బద్దలుచేయును. లివింగ్‌స్టన్‌గారు ఆ యేటివెంబడి పోవుచున్నప్పుడు నీటిగుర్రము పగులగొరికిన ఒక పడవను కనుగొనిరి.

ఆ యేటిలో మొసళ్లు మెండుగా నుండుటమాత్రము కాక వాటివల్ల బహు ఉపద్రవము కలుగుచుండెను. ఏటివద్దకుపోయిన కుర్రవాండ్లనేకులు ప్రతి సంవత్సరము క్రూరమృగముల కాహుతియగుచుండిరి. మొసళ్లు నీళ్లలో మునిగి తమ మూతినిమాత్రము నీటిపైకి ఎత్తుకొని, ఏరు దాటుచున్న మనుష్యులకొరకును, పశువులకొరకును కనిపెట్టు



మొసలి

కొనియుండును. ఒకనాడు లివింగ్‌స్టన్‌గారి పనివారు ఏరు దాటుచున్నప్పుడు ఒక మొసలి వారిలో నొకని నడుము పట్టుకొని అడుగున కీడ్చుకొనిపోయెను. అతడా మొసలికి బలియాయెనని లివింగ్‌స్టన్ విచారపడుచుండినంతలో అతడు తాను చేత పట్టుకొనియుండిన చిన్న ఈటెతో ఆ మొసలిని పొడిచినందున అది యా దెబ్బకు తట్టుకొనలేక అతని విడిచిపెట్టగా నతడు తప్పించుకొని గడ్డెక్కెను.

వారు పగలంతయు ప్రయాణముచేయుచు పడవలలోనే యుండగలిగినను రాత్రులందు పండుకొనుటకై యేటియొడ్డుకు వచ్చి తీరవలెను గనుక ప్రొద్దువాలు సమయమున వారు మఖాముకొరకు తగిన చోటును కనుగొని పడవలు దిగి, గడ్డెక్కి, చెట్లలో కొమ్మలు నరికి తమకొరకు గుడిసెలు కట్టుకొనుచువచ్చిరి. వారు ఆ గుడిసెలు కట్టిన విధమేదనగా, మొదట ఆకులతోను మట్టలతోను వాటిని కట్టినమీదట వారు పొడుగాటి గడ్డితో వాటిని కప్పెడివారు. దుష్టమృగముల భయమునకు వారు ఒకదాని నానుకొని ఒకటి కట్టి, ఆ మఖామును వలయాకారముగా నేర్పరచి, ఎద్దులను నడుమ కట్టివేసి, తెల్లవారులు పెద్దమంట వేయుచుండిరి. ఆలాగు చేసి



నను ఒక్కొకప్పుడు సింహాములు గుడిసెలలో జొరబడి యెద్దులను ఎత్తుకొనిపోవుచుండెను.

వారు రెండు దినములు చోబినదివెంబడి పడవలు నడిపించిన తరువాత ఆ యుపనది జాంబీసి యను పెద్ద నదిని కలియు చోటికి వచ్చి దాని వెంబడి మాకాలాకా జనుల ముఖ్యపట్టణమైన సేశేకె చేరిరి. సేశేకె విడిచిన తర్వాత వారు పడవలు నడిపించుచు నీళ్లు బండలమధ్య వడిగా ప్రవహించు చోట్ల పడవలనెత్తి ఏటి యోరను వానిని దింపుచుబోయిరి. ఈలాగు చాలా దూరము పడవలు నడిపించినమీదట జాంబీసి నది తూర్పుదిక్కునుండి వచ్చుచుండుట చూచి వారు పడమటి సముద్రతీరము చేరగోరినందున ఆ నదిని విడిచి, కొంత దూరము నేల ప్రయాణముచేసి, పడమరకు ప్రవహించు నదుల వెంబడి పడవలను నడిపించి తుదకు లోవాండయను ఓడరేవు చేరిరి. అయినను ఇక్కడ వ్రాయబడియున్నంత సులభముగా వారు గమ్యస్థానము చేరలేదుగాని నెలలకొద్ది కష్టతరమైన ప్రయాణములుచేసి, పడరానిపాట్లు పడిరని మన చదువరులే గ్రహింతురుగాక.

లివింగ్‌స్టన్ స్నేహితుడగు సేకేలేటు అధికారమునకు లోబడిన ప్రాంత్యములలో వారధిక ప్రయాసము లేకుండనే ప్రయాణముచేయగలిగియుండిరి. అయితే ఆ ప్రాంత్యములను దాటి పోర్చుగీస్‌వారు తరుచుగా సంచరించి బోట్లబేరము చేయుచుండిన ప్రాంత్యములకు రాగా వారు మిగుల ప్రయాసపడిరి. ఆ జిల్లాలలోని జనులు పోర్చుగీసువారి దౌర్జన్యమువలన పీడింపబడినవారై తామనుభవించిన అన్యా

యమునకు ప్రతిఫలముగా తమ చేతికి చిక్కిన లివింగ్‌స్టన్ వంటివారిని మిగుల క్రూరముగా చూచుచుండిరి. ఐరోపీయులు తమ విషయమున చేసిన కీడుకుగాను వారు మక్కికి మక్కియన్నట్టు సమయము చూచి వారికి ప్రతికీడు చేయువారు గనుక వారు లివింగ్‌స్టన్‌ను మిగుల బాధపెట్టిరి. వీరి క్రూరత్వము లివింగ్‌స్టన్‌గారి కార్యాభంగమునకు కారణమై యుండినను ఆ దుర్గుణము ఇతరుల దుష్క్రియల ఫలితమని యెరిగి ఆయన వారి బలాత్కారమును శాంతముగా సహించుకొనెను.

లివింగ్‌స్టన్ ఈలాగు ఒక్కొక్క ప్రాంత్యమును దాటి మరియొక ప్రదేశమున ప్రవేశించినతోడనే పోర్చుగీసువారి శిష్యత్వము ననుసరించుచుండిన దేశాధిపతులు ఆయనయొద్దకు రాయబారులను పంపి, „మీరొక మనుష్యునియైనను ఎద్దునైనను, తుపాకినైనను, దంతమైనను ఇచ్చి మా ప్రాంత్యమును దాటిపోవలెను లేదా వెనుకకు మళ్లవలెను, ఈ రెండును తప్పితే ఉపవాసముండియైనా చావవలెనని" తెలియజేసిరి. ఒక మనుష్యుని ఇచ్చుటకు లివింగ్‌స్టన్ ఏమాత్రము ఒప్పుకొనడు. సామానులు మోయుటకు ఎద్దులు కేవలమావశ్యకము గనుక ఎద్దునిచ్చుటకూడ దుస్సాధ్యమే. తుపాకిచే ఆయన అడవి జంతువులను కాల్చి తన పరివారమునకు ఆహారము సంపాదించుచుండెను గనుక దానినిచ్చుటకూడ అబద్ధమే. ఇక దంతములంటావా మా సేకేలేటు ఇచ్చిన దంతములను లోవాండకు తీసికొనిపోయి వాటివలన పోర్చుగీసువారికిని మకలోలోవారికిని వ్యాపారము జరుగునట్లు చేయవలె



నని నిశ్చయించుకొనెను గనుక వారు ఆశాపాతకులై యడిగిన వస్తువులలో దేనినైనను ఇవ్వలేక ఆయన ఒక్కొక్కప్పుడు మిగుల బాధపడవలసివచ్చెను. 1854 సం॥ మార్చినెల 4 వ తేదిన ఈ దుర్మార్గులగు దేశాధిపతుల బాధ ఆయనకు ప్రాణానికి వచ్చినట్టుండెను. ఆ దినమున వారు చిబోక్వియను జనుల ప్రాంత్యములో ప్రవేశించి వారి నాయకుడగు జాంబి నివసించు గ్రామమున కేగిరి. వారా గ్రామము చేరినతోడనే ఆ ఆశాపాతకుడు కొందరు భటులను పంపి ఒక మనుష్యునియైనను, ఎద్దునైనను, తుపాకినైనను, తుపాకిమందైనను, గుడ్డయైనను, శంఖమైనను, మరి యేదైనను సరే తీసికొని రమ్మని ఆజ్ఞాపించెను. లివింగ్‌స్టన్‌గారు వారి బెదరింపులకు వెరువక వారిని రిక్తహస్తములతోనే పంపివేసెను. ప్రొద్దుగ్రుంకు వేళప్పుడు ఆ యూరివారందరు తమ నాయకుని వెంబడి బయలుదేరి కత్తులు కటారులు త్రిప్పుచు భయంకరముగా బొబ్బలుపెట్టుచు వచ్చి లివింగ్‌స్టన్‌గారి మఖామును చుట్టుకొని ఆయనను బెదరించుచు, తామడిగినట్టు ఇవ్వకపోయిన యెడల వారిని చంపుదుమని భయపెట్టినప్పుడు ఆయన పరివారము మిగుల భయపడి, తమ ప్రాణరక్షణార్థమై వారిని తుపాకులతో కాల్చవలెనని తీవ్రపడిరిగాని లివింగ్‌స్టన్‌గారందుకు సమ్మతించక వారిని సముదాయించి, తన గుడిసె దగ్గర ఒక చిన్న పీఠమువేసికొని దానిమీద సావధానముగా కూర్చుండి, వారి నాయకుని చూచి, అయ్యా! కూర్చుండుమని చెప్పగా అదివరకు సింహమువలె గర్జించుచుండిన ఆ వీరశూరుడు సాధువైన గొర్రెపిల్లవలె ఆయన కెదురుగా

నేలమీద కూర్చుండెను. అంతట లివింగ్‌స్టన్‌గా రతనిని చూచి, అయ్యా! భగవంతుడు అందరి ఉపయోగమునకని ఇచ్చిన ఈ నేలమీద నడుచుటకై మీరు నా యొద్ద రొక్కమడుగుట న్యాయమేనా? అని యడిగెను. భూమి దేవుడందరికి పొత్తుగానిచ్చిన సొత్తు గనుక తోటలుగాక మరియే భూమియైనను నాదని ఎవరుగాని చెప్పదగదని ఆఫ్రికా దేశస్థులు చెప్పువారు. లివింగ్‌స్టన్‌గా రాసంగతి నెరిగియుండియే ఆలాగడిగినందున ఆ నాయకుడు మాట్లాడక మానియాయెను. అయినను వారు పట్టువదలక తమ కొకనిని బానిసవానిగా నిమ్మని ఆయనను గోజాడుచుండిరిగాని ఆయన ఒక క్షణమైనను అందుకు సమ్మతించువాడు కాడు. తుదకాయన వారి కొక గుడ్డ యిచ్చెను. అది చాలదని వారు ఇంకను గోజాడగా ఒక రుమాలుకూడ ఇచ్చెదనని ఆయన వారితో చెప్పెనుగాని ఇచ్చేవాన్ని చూస్తే చచ్చేవాడుకూడ లేచునన్నట్టు ఆయన ఇచ్చేబుద్ధి అగుపరచేకొలది వారు మరి యెక్కువగా అడుగసాగిరి. యావనులు ఆయుధములు ఆడించుచు, ఎగిరి దుముకులాడుచు, కొట్టుమనియు నరుకుమనియు ఆర్భాటముచేయగా వారిలో నొకడు లివింగ్‌స్టన్‌గారిని పొడుచుటకు ఆయనమీద పడుచువచ్చెను. ఇంతలో లివింగ్‌స్టన్‌గారు అతనితట్టు తిరిగి తన తుపాకిని అతని గడ్డముక్రింద పెట్టగానే అతడు గుండె కరిగినవాడై బ్రతుకు జీవుడా అని పిక్కబలము జూపి ఇంటిలోకివెళ్లి దాగుకొనెను.

అంతట లివింగ్‌స్టన్ వారి నాయకుని చూచి, ‘‘అయ్యా! మీరు మమ్మును దౌర్జన్యముచేసి మామీదికి వచ్చినయెడల



ప్రాణసంరక్షణార్థమై మేము తిరుగబాటుచేసి మిమ్ము నొకవేళ చంపవలసివచ్చునేమోగాని మా యంతట మేము మీజోలికి రాము. అందువల్ల హత్య జరిగినయెడల అందుకు మీరే కారకులుగాని మేము కాము’’ని వారిని హెచ్చరించెను. ఈలాగు దర్బారు జరుగుచున్నప్పుడు లివింగ్‌స్టన్‌గారి పనివారు ఈటెలు పట్టుకొని ఆ నాయకుని చుట్టుకొనిరి గనుక తన జనులు లివింగ్‌స్టన్‌గారిని తుపాకితో కాల్చినయెడల గుండు తగిలి తానే చావవలసియున్నదని నాయకుడు కనుగొని అన్నిటికన్న ప్రాణరక్షణ ముఖ్యము గనుక రాలినమట్టుకు గోవింద అన్నట్టు లివింగ్‌స్టన్‌గారితో సమాధానపడి ఆయన యిచ్చిన బహుమానములతో తృప్తిపడి వెళ్లిపోయెను. ఆ ప్రాంత్యనివాసులు తమ సహజ గుణములనుబట్టి క్రూరులు కారుగాని మనుష్యులను బానిసలనుగా పట్టి వారిని సముద్రతీరమునకు తీసికొనిపోవువారు. ఒక్కొక్క ప్రాంత్యమును దాటునప్పుడు ఆ దేశ నాయకునికి ఒక మనుష్యుని ఇచ్చుట వాడుక గనుక అది తమ హక్కని భావించుకొని లివింగ్‌స్టన్‌కూడ వారివలెనే ఇయ్యవలెనని ఆయనను నిర్బంధించిరి. ఈ నాయకులు లివింగ్‌స్టన్‌గారియెదుట సాధించిన క్రూరత్వములు మిగుల బాధకరమైనవైయుండినను ఒక్కొక్క సమయమున అవి నగుబాటుకుకూడ కారణమగుచుండెను. ఎట్లనిన, వారొక జమీందారి సరిహద్దుకు రాగా ఆ పాళెగాడు తన భటులను పంపి కట్నమిచ్చి తన దేశమును దాటిపోవలెనని లివింగ్‌స్టన్‌గారిని ఇబ్బందిపెట్టెను. ఆయన వారికొక యెద్దును చూపించి, దీనిని మీ సర్దారుకు తీసికొని

పోయి ఇవ్వండని చెప్పెను. వారా యెద్దు తోకకు కుచ్చు లేదని చూచి, ఆహా! మాకు అది వద్దు. మీరు దాని కుచ్చును కత్తిరించివేసి మందెక్కించియున్నారు గనుక దానివలన మాకు దిష్టి తగులునని చెప్పగా లివింగ్‌స్టన్ వారి మాటలను బట్టి ఒక మంచి ఉపాయము నేర్చుకొన్నందుకు పకపక నవ్వుకొనుచు ఆ భటులు వెళ్లిపోయిన తర్వాత తన పనివారిని చూచి, ఇకమీదట నెవరును మన యెద్దులను అడుగకుండునట్లు వాటి కుచ్చులు కత్తిరించివేయుడని యుత్తరువిచ్చెను.

వారప్పుడు ప్రయాణము చేయుచుండిన ప్రాంత్యములలోని భాష లివింగ్‌స్టన్‌గారికి తెలియకుండినందున ఆయన నేరుగా వారికి సువార్తను ప్రకటించలేకుండెను గాని బొమ్మలలాందరు మూలముగా వారికి పటములు చూపుచుండగా ఆయన పరివారములోని యొకడు వాటి సంగతి చెప్పుచుండును. ఒకనాటిరాత్రి ఒక పాళెగాడు తన పరగణాలోని జనులందరిని పిలిపించి ఒక మైదానములో పోగుచేయగా లివింగ్‌స్టన్‌గారు అబ్రాహాము చరిత్రకు సంబంధించిన పటములు చూప నారంభించెను. ఒక పటములో అబ్రాహాము ఇస్సాకును కట్టి బలిపీఠముమీద పెట్టి కత్తిదూసి, చేయియెత్తి నరకబోవుచున్నట్లుండెను. ఆ పటమును చూపించి సంగతి వివరించిన తర్వాత వేరొక పటమును పెట్టుటకై ఆ పటమును జరుపవలసివచ్చెను. అది జరుగుచుండగా కూడివచ్చిన జనులు అబ్రాహాము ఆ పటములోనుండి దిగివచ్చి తమమీద పడబోవు ననుకొని, చస్తిమిరా నాయనా! అని బొబ్బలిడుచు గబగబ లేచి, ఒకరినొకరు తగులుకొని కుప్పతెప్పలుగా క్రిందపడిరి.



*Page 69*

లివింగ్‌స్టన్ మకలోలోవారికి ప్రసంగించుట



వీలుకలిగినవారందరు దయ్యమును చూచినవారివలె పరుగెత్తు కొనిపోయి ఇండ్లలో చొరబడి వాకిండ్లు వేసికొనిరి. ఒక ప్రక్కనుండిన జనులు బెదరిన గొఱ్ఱెల మందవలె ఒక్క గుంపుగా పారిపోవుచు తమ విగ్రహములుండిన గుడిసెమీద పడగా అది కూలబడిపోయెను.

యేసు రక్షకుని సువిశేషమును తెలియజేయుట తన ముఖ్య కర్తవ్యమని లివింగ్‌స్టన్‌గారు ఎంచి వీలుకలిగినప్పు డెల్ల తాను మకాముచేసిన ప్రతి చోటను మనుష్యులను పోగు చేసి యేసునుగురించి వారికి బోధించెను. తమ నాయకుని యుత్తరువు మీరజాలక అందరును కూటమునకు వచ్చిరి. ముప్పదిమూడు కోట్ల దేవతలుచేరి ముక్కు పట్టించగలరు గాని 'నారాయణా' అనిపించగలరా అన్నట్లు అందరికి విను బుద్ధి యుండదు. ఒకనాటి కూటములో లివింగ్‌స్టన్‌గారు బోధించు చుండగా కొందరు యౌవనులు ఆయన బోధను లక్ష్య పెట్టక తాము చంపియుండిన ఒక మృగముయొక్క చర్మము నకు ఉప్పుపట్టించ నారంభించిరి. లివింగ్‌స్టన్‌గారి ప్రక్కను కూర్చుండిన నాయకుడు దడిచూచి చెదరిపోయే గొఱ్ఱెలతట్టు గొల్లవాడు రాయి విసరివేసిన చందమున తన చేతిలోనుండిన దుడ్డుకర్రను బలముగా విసరి వారిమధ్య పడవేసెను.

ఆ ప్రాంత్యపు జనులు అంతకుముందెన్నడును ఐరోపీ యులను చూచియుండలేదు గనుక లివింగ్‌స్టన్ ఒక మను ష్యుడు కాడనియు, సముద్రములో నివసించు ఒక మహాత్ము డనియు భావించుకొనిరి. ఆయన తన టోపీ తీసినప్పుడు వారు, అదిగో! ఆయన తలమీద నుండేవి వెంట్రుకలా? కావు.

అవి సింహావు జూలు అని ఒకరితో నొకరు చెప్పుకొనుచుండిరి. అందుకు లివింగ్‌స్టన్‌గారు, మీరు చెప్పుచున్నట్లు నావి వయామైన వెండ్రుకలేగాని మీవికూడ పూర్వమిటులనే యుండి యెండకు కమిలిపోయి ఉంగరములు తిరిగి చెడిపోయినవని వారిని గేలిచేసెను. తాము నల్లగా నుండగా ఆయన తెల్లగా నుండుటనుబట్టి ఆయన మనుష్యుడు కాడను వారి తప్పభిప్రాయమును దిద్దుటకై ఆయన తన చొక్కాయిని విప్పి రొమ్ముమీది చర్మమునకును ముఖముమీది చర్మమునకును ఉండు వ్యత్యాసమును చూపి, నేను విశేషముగా ఎండలో తిరుగుటవలన నా ముఖముమీది చర్మము మీ చర్మమువలెనే నల్లగానున్నదిగాని ఎండ తగలని భాగము తెల్లగానున్నది. మీరు నేను వేసికొన్నన్ని గుడ్డలు వేసికొనక ఎప్పుడును ఎండలో తిరుగుచుందురు గనుక మీ చర్మము నల్లనిదాయెను. ఇందువల్ల నేను మీవంటి మనుష్యుడనేగాని మహాత్ముడను కానని వారు గ్రహించునట్లు చెప్పెను.

మకలోలో ప్రదేశమున నెక్కడను బాటలు లేనందున వారీ ముసాఫరికి బయలుదేరి వచ్చినప్పుడు లిన్‌యాంటిలో తమ బండ్లు విడిచిపెట్టి పడవల మూలముగా జలప్రయాణము చేసిరి. తమకు అనుకూలమైనంతవరకు వారు జాంబీసి నది వెంబడి ప్రయాణము చేసిరిగాని వారు నేలను పోవలసి వచ్చినప్పుడు పడవలను విడిచిపెట్టి కాలినడకను ప్రయాణము చేసిరి. సహించకూడని ఉష్ణ ప్రదేశమున ఐరోపీయులు నడుచుట మిగుల కష్టసాధ్యము గనుక లివింగ్‌స్టన్ తన యెద్దులలో నొకదానిని వాహనముగా నుపయోగించ నిశ్చయించు



కొనెను. ఆఫ్రికాదేశస్థులిదివరకు ఏ మృగముమీదనైనను ఎక్కియుండలేదు గనుక లివింగ్‌స్టన్ ఒక యెద్దునెక్కి స్వారీ చేయనుద్దేశించినట్టు వారు తెలిసికొనగా అందరు నాయనను గేలిచేసిరి. అయినను ఆయన ఒక యెద్దు నేర్పరచుకొని దానికి స్వారీ నేర్ప నారంభించెను. సిన్వాదు అను పేరుగల ఒక విధమైన ఎద్దు మిగుల చెడ్డదియు రోషముగలదియునై యుండినను అది ఇతర యెద్దులకంటె బాగా బలిసియుండుట మాత్రముగాక దాని కొమ్ములు వదలై క్రిందికి వాలియుండును గనుక దానిమీద నెక్కినవారికి ఉపద్రవముండదు. అయినను సిన్వాదు బహు మూర్ఖబుద్ధిగలది గనుక అది తన యిష్టమువచ్చినట్లు నడుచునేగాని యజమానుని యిష్టప్రకారము పోదు. ఒక్కొకప్పుడది దోవను నడుచుచు ఆకస్మికముగా ప్రక్కకు తొలగి చెట్లమధ్యకు దారితీయును. ఒకసారి లివింగ్‌స్టన్‌గారెక్కిన యెద్దు ఈప్రకారమే చేసి కొమ్మలు చాలా క్రిందికి వాలియుండిన ఒక చెట్టుక్రిందికి దూరగా ఆయన ఒక కొమ్మ తగులుకొని క్రిందపడెను. మరియొకసారి వారొక నదియొడ్డుకు వచ్చిరి. అప్పటికి ఇతర యెద్దులు నదిలో దిగి పోవుచుండుటను సిన్వాదు చూచి లివింగ్‌స్టన్‌గారికి దిగుటకైనను అవకాశమియ్యక వంచుకొనిన తల యెత్తకుండనే, తోక మిటారించుకొని సర్రునపోయి ఏటిలో దుమికెను. నడియేటిలోకి రాగా అది ఒక పెద్ద గుంటలో కాలుపెట్టి తలక్రిందుగా పడి లివింగ్‌స్టన్‌గారిని నీళ్లలో విసరివేసెను. ఆయన పరివారము ఆయన నీళ్లలో పడుటను చూచి, భయముతో బొబ్బలుపెట్టుచు ఆయనకు సహాయముచేయుటకు ఏటిలో

దుమికి ఈదులాడుచు రాగా ఆయనకూడ ఖాతలో ఈదుచు పోయె గద్దెక్కుటను చూచి మిక్కుటముగా సంతోషించిరి. విరోధియులకు ఈతరాదని వారంతకుమునుపు అనుకొని యుండిరిగాని ఇప్పుడాయన తమవలెనే ఈదుటను చూచి ఆయన సామర్థ్యమునకు బహుగా మెచ్చుకొనిరి.

వారు జాంబీసినదిని విడిచినపిమ్మట జలమయమైన ప్రదేశములో సంచరించుచుండిరి. అక్కడ వర్షము అపరిమితముగా కురియుటవలన ఆ ప్రాంత్యములో ఎక్కడ చూచినను చెట్లు విశేషముగా పెరిగియుండుటమాత్రముకాక ఎల్లయెడల బురదనేల యుండుటచే వారికి ఎన్నశక్యముగాని ప్రయాసములు కలిగెను. ఒక్కొకప్పుడు వారు పోవు దోవన ఆకాశము నంటుచున్న వృక్షములు సూర్యకిరణములు చొరరాదనంత దట్టముగా పెరిగియుండుటవలన మిట్టమధ్యాహ్నమున సహితము వారు గ్రుడ్డి వెలుగులో సాగిపోవుచుండిరి. ఒక్కొకప్పుడు నేలమీద అసాధ్యముగా పొదలు అల్లుకొనియుండుటచే వారు చెట్లుచేమలు నరికి దోవ చేసికొనవలసియుండెను. వర్షములు కురియని సమయములకూడ చెట్లమీదనుండి నీళ్లు ఎడతెగక కారుచున్నందున వారములకొలది వారి గుడ్డలు నిత్యము తడిసేయుండెను. వనములోను నీళ్లలో నడుచుచు కుంభవర్షమువలన నానుచుండిన లివింగ్స్టన్ గారు తన గడియారములో నీళ్లు ప్రవేశించకుండునట్లు దానిని చంకలో పెట్టుకొని కాపాడుచుండెను. వారప్పుడు ప్రయాణముచేయుచుండిన ప్రాంత్యములలో గ్రామములు మిగుల కొద్దిగా నుండెను గనుక వారికి భోజన పదార్థములు దొరుకుట మిక్కిలి కష్ట



Page 72

డిబ్బాదు లివింగ్స్టన్ను జాంబీసి నదిలో పడద్రోయుట

తరముగా నుండెను. ఆ ప్రదేశములలోని జనులు వారిని అడ్డగించి వారియొద్ద బలవంతముగా కట్నము తీసి, క్రూరత్వము సాధించుటవలన వారు బహు ప్రయాసములు పడిరి. లివింగ్‌స్టన్‌గారు మార్గాయాసమువలన అలసటజెంది ఆహారములేక క్షీణించుచుండగా తగిలిన కాలే తగులుతుందన్నట్టు నిత్యము నీళ్లలో నానుటవలన ఆయనకు కఠిన జ్వరము తగిలెను. ఆయన పరివారముకూడ నీ శ్రమసంకటములను భరించలేక, అరణ్యములోని ఇశ్రాయేలీయులు మోషేమీద సణిగినట్టు లివింగ్‌స్టన్‌గారిమీద సణిగి ఆయనను అడవిలో దిగవిడిచిపోవలెనని తలంచిరి. అయినను లివింగ్‌స్టన్ ఈలాటి కష్టములకు చిల్లిగవ్వంతయినను జడియువాడుకాడు గనుక వారిని చూచి, మీరు నన్ను విడిచిపోయినను నేనేమో ఈ యత్నము మానక ఒంటరిగానైనను ముందుకు సాగిపోదునని వారితో చెప్పి. తన డేరాలోకి వెళ్లి తన ప్రాణముమీదికి వచ్చిన ప్రమాదమును బట్టి తన్ను వెయ్యి గండములనుండి కాపాడిన దేవుని ప్రార్థించెను. ప్రార్థన ముగించి లేవగానే తన పరివారములోనొకడు డేరాలోకి తొంగిచూచుటను కనుగొని అతనిని పలుకరించగా, అతడు లోపలికివచ్చి, లివింగ్‌స్టన్‌గారి పాదములమీదపడి, స్వామీ! నేనెన్నడును నిన్ను విడువనని చెప్పెను. తక్కినవారందరును వచ్చి, అయ్యా! మేమందరము నీ బిడ్డలమే. అవసరమైతే నీకొరకు మా ప్రాణములను కూడ పెట్టుదుము. మా ప్రాణములు విసికినందున మేము నిష్ఠురముగా మాట్లాడితిమిగాని మా తప్పు క్షమించి ఇకమీదట మా విశ్వాసమును చూడుమని వేడుకొనిరి.

ఆ తరువాత వారింక కొన్నాళ్లవరకు ఇక్కట్లు పడవలసి వచ్చెనుగాని లిన్యాంటి విడిచిన ఆరు మాసములకు వారొక నాడు మిట్ట ప్రదేశమున కెక్కి అక్కడనుండి సముద్రమును కనుగొని తమ ప్రయాసములు త్వరలోనే తొలగిపోవునని బహుగా సంతోషించిరి.

లివింగ్‌స్టన్‌తో వచ్చినవా రిదివర కెన్నడును సముద్రమును చూచియుండలేదు గనుక దానినిబట్టి వారు మిగుల అతిశయించుకొనిరి. మరియు సూర్యకాంతికి వెండివలె నిగనిగలాడుచుండిన ఆ అంతులేని జలనిధిని చూచి వారు విభ్రాంతచేతస్కులైరి. వారు తిరిగి తమ స్వగ్రామము చేరినప్పుడు తాము చూచిన వింతలన్నిటినిగురించి తమ బంధుమిత్రాదులతో చెప్పుచు, లోకము చాలా పెద్దదనియు దానికొక హద్దులేదనియు మన పెద్దలు చెప్పిన మాటను పూర్ణముగా నమ్మితిమిగాని మా దొరగారితో మేము ప్రయాణము చేయుచు ఒకనాడు ఒక కొండపేటుకు రాగా లోకము మమ్మును చూచి, ఇక్కడివరకే నా సరిహద్దు. దీనికవతల నేను లేనని చెప్పెననిరి.

ఆ మీదట వారు మెల్లగా కొండ దిగి మైదానమునకు వచ్చి సుఖప్రయాణముచేసి లోవాండ చేరిరి. అక్కడ బానిస వ్యాపారమును నివారణచేయు నిమిత్తము బ్రిటిష్ దొరతనమువారు నియమించిన గొప్ప యుద్యోగస్థుడొక డుండెను. జ్వరము, శీతభేది, మొదలగు వ్యాధులతో బాధపడి సరియైన పోషణలేక చిక్కి, క్షీణించి, అస్థిపంజరమై యుండిన మన కథానాయకుడు అతని యింటికి పోగా అతడు



లివింగ్‌స్టన్‌గారి దుస్థితికి మిగుల వ్యసనపడి ఆయనకు ఉపచారముచేసి తన యింటిలోనే ఆయనకు బసయిచ్చెను. లివింగ్‌స్టన్‌గారప్పటికి జ్వరబాధితుడై మిగుల అవస్థపడుచుండెను గనుక ఆ యుద్యోగస్థుడాయనను తన మంచముమీద పరుండబెట్టి పరామర్శించెను. అందునుగురించి లివింగ్‌స్టన్ తన భార్యగారికి జాబు వ్రాయుచు, నేను ఆరునెలలనుండి నేలమీద పండుకొని చాలా ప్రయాసపడితిని గనుక ఇక్కడ ఈ మెత్తని పాన్పుమీద శయనించుట వైకుంఠములో నున్నట్లు తోచెనని తెలియజేసెను.

# 5 వ. అధ్యాయము

## లోవాండనుండి మరల లిన్‌యాంటికి వచ్చుట

లివింగ్‌స్టన్‌గారు లోవాండ చేరిన తరువాత కఠిన జ్వరముతో పడి ఆరు వారములవరకు మంచముపట్టియుండెను. ఆరు నెలలనుండి తియ్యకుండ పడరానిపాట్లు పడినవాడు బ్రతికి గడ్డెక్కుట మహా వింతయేగదా. అయినను లోవాండలోని ఆ బ్రిటిష్ ఉద్యోగస్థుడును రోమన్ కాథొలిక్ సంఘాధ్యక్షుడును, సామాన్యులగు పోర్చుగీసువారును ఆయన విషయమై శ్రద్ధ వహించుకొని పరామర్శ చేసినందున కాలక్రమేణ ఆయన స్వస్థత నొందెను.

ఆ సమయమున రెండు బ్రిటిష్ యుద్ధపు నావలు ఆ రేవుకు వచ్చెను. ఆ యోడల నాయకులు లివింగ్‌స్టన్‌గారు చేసిన ప్రయాణములనుగురించియు, ఆయన కనుగొన్న క్రొత్త ప్రాంత్యములనుగూర్చియు, ఆయన తెలిసికొన్న వినోదములనుగురించియు విని మార్గాయాసమువలన ఆయనకు కలిగిన బలహీనతకు వ్యసనపడి, ఆయనయెదుట బహు గౌరవముగా ప్రవర్తించిరి. ఆయన చాలా బలహీనముగా నుండినందున తిరిగి అడవి ప్రయాణములకు తెగించినయెడల తప్పక మృత్యువు దేవతకు ఆహారమగునని తలంచి, ఆయన కొన్నాళ్లవరకు ఈ కష్టములలో తగులుకొనక తమ యోడెక్కి



ఇంగ్లాండుకుపోయి సుఖముగా కాలము గడుపవలెనని సలహా నిచ్చిరి. ఆయన తన భార్య బిడ్డల నెడబాసి అప్పటికి రెండున్నర సంవత్సరములగుటమాత్రముకాక వారిని ఓడమీది కెక్కించిన పిదప ఆయన అసాధ్యమైన అరణ్య ప్రయాణములలో మునిగియుండెను గనుక అప్పటినుండి వారి సమాచారమే ఆయనకు తెలియకుండెను. అట్టి తరుణమున భార్య బిడ్డలను చూచు ప్రాప్తము సంభవించినప్పటికిని తన స్వసుఖమును నిరాకరించి శ్రమ సంకటములు సహించుటయే తన ధర్మమని నిశ్చయించువాడెట్టి వీరశూరుడో మన మూహించుటకూడ కష్టమే.

ఇట్టి సుఖప్రాప్తము నాయన నిరాకరించుటకు కారణమేమని విచారించగా, ఆయన లిన్‌యాంటినుంచి తెచ్చిన మకలోలో పనివారిని తిరిగి తమ దేశమును చేర్చుటయే యని విశదమగును. ఈ అనాగరికులు తనకు సహాయముచేసి కష్టములకు వెనుకతీయక, తనకొరకు తమ ప్రాణములకు తెగించిన విశ్వాసశిఖామణులగుటచేత, వారిని అనాథులగా విడువక తమ గృహములు చేర్చుట తన అనివార్య ధర్మమని యెంచి ఆయన తన సుఖమును తృణప్రాయముగా భావించుకొనెను. ఇట్టి గుణమునుబట్టియే లివింగ్‌స్టన్ ఆడితప్పనివాడని ఆఫ్రికా దేశమందంతట ప్రసిద్ధిగాంచెను.

మకలోలో దేశస్థులు ఐరోపీయుల వాసస్థానములను చూచుట ఇదియే మొదటిసారి గనుక లివింగ్‌స్టన్‌గారి పరివారము లోవాండలో చూచినదంతయు వారికి పరమాద్భుతముగా నుండెను. వారు సహజముగా లంగోటి కట్టుకొను

వారైయుండి లావాండలోని బ్రిటిష్ యుద్యోగస్థుడు తమ కిచ్చిన ఎర్రచారల ఉడుపులను ఎర్ర కుళ్లాయిలను చూచుకొని మురియుచు, మింటిని మంటిని ఎరుగనంతగా సంతోషించుచు బహు గప్పాలుకొట్టుచుండిరి. వారు తమ యిండ్లకుగాను నొగలైనను వెదుళ్లయినను చొప్పగూడు మాదిరి వేసి వాటిని పైన కత్తెరవలె చేర్చి గుడిసెల నేర్పరచువారు గనుక ఐరోపీయుల ఇండ్లను చూచి ఆశ్చర్యపడుచు, క్రింది యిల్లు ఏటవాలుగా నుండగను కట్టెలు నిక్కపొడుచుకొని యుండగను వారేలాగు ఇంటిమీద ఇల్లు కట్టిరి? ఇదెక్కడి గారడీ విద్యరా? అని మిగుల అద్భుతపడుచు, ఇవి ఇండ్లు కావు గాని కొండలో నారు తొలిపించిన గుహాలని నిశ్చయించిరి.

సర్వసాధారణమైన ఇండ్లను చూడగనే వారింతగా వింతపడితే సముద్రముమీద నడుచుచున్న యుద్ధనావలను చూచినప్పుడు వారి యాశ్చర్య మేమనవచ్చును? వారు వాటి విషయమై విపరీతాభిప్రాయములుగలిగి వాటికి భయపడినందున కొన్నాళ్లవరకు వారు వాటిని సమీపించనే లేదు. దగ్గరకు రమ్మని ఓడ నాయకులు పిలిచినప్పుడు లివింగ్స్టన్ వారి కభయమిచ్చినను వారు తెగించలేకుండిరి. అయినను లివింగ్స్టన్ చేసిన ప్రోత్సాహములకు వారు కడకు లోబడి ఆయనకూడ తమతో వచ్చునను ధైర్యముతో అందుకు సమ్మతించిరి. ఓడెక్కిన పిదప దానిలో లివింగ్స్టన్వంటివారే ఉన్నారని కనుగొని, ఆయనను చూచి, అయ్యా! వీరందరు మీవంటి మహాత్ములే అని చెప్పి మరింత ధైర్యము తెచ్చుకొనిరి.



మొదట ఓడ యెక్కినప్పుడు వారికి భయ మధికమగుటచే గొర్రెల మందవలె అందరు నొక చోట కదలక అట్లే నిలిచిరిగాని నాయకులు వారితో పరిచయము చేసికొని తమ భోజనములో కొంత వారికిచ్చినందున వారు భయము వదలి ఓడలోని ప్రతి భాగమును పరిశోధించుచు అద్భుతపడుచు వచ్చిరి కడకు ఓడ నాయకుడు పెద్ద ఫిరంగి యొకటి బారు చేసి వారిలో నొకడు దానిని కాల్చవచ్చునని చెప్పగా, వారు మొదట వెనుకదీసి తర్వాత నెట్లో తెగించిరి. ఆ ఫిరంగివలన కలిగిన శబ్దమును వినియు దాని గుండు ఎగిరిపోయి పడిన దూరమును చూచియు వారు ఐరోపీయుల వింత జ్ఞానమునకు ఆశ్చర్యమగ్నులైరి. వారదివరకు పదిమంది పట్టునంతటి చిన్న పడవలనుమాత్రము చూచియుండిరి గనుక లివింగ్స్టన్ ఓడలనుగురించి వారితో చెప్పగా అవి తామిదివరకు చూచిన పడవలవంటివే అని ఊహించుకొనిరిగాని యుద్ధపుటోడలను చూచినప్పుడు, ఒరే! ఓడలు పడవలు కావురా. అవి గ్రామములంత పెద్దవే అని తమ స్వజనులతో చెప్పి వారిని మిగుల అద్భుతపరచిరి.

లివింగ్స్టన్గారు లోవాండ చేరుటనుబట్టి ఆయన యత్నము కొంతవరకు నెరవేరినను ఆయన యుద్దేశము సఫలముకాకపోయెను. ఆయన దాటి వచ్చిన ప్రదేశమునందెక్కడను ఐరోపీయులు నివసింపదగిన స్థలము కనబడలేదు గనుక తానుద్దేశించిన సువార్త ప్రచారకులను తర్బీతుచేయు పాఠశాల ఆ ప్రాంత్యములలో స్థాపన కానేరదని గ్రహించుకొనెను. అదిమాత్రముకాక ఆ ప్రదేశములో సూర్యప్రకా

శము నెరుగని బ్రహ్మాండమైన యడవులును, లెక్కలేని పంక వాగులును, సర్వత్ర జౌకునేలయు నుండుటవలన వ్యాపారమునకు తగిన రాజమార్గము వేయుట అసాధ్యమని స్పష్టముగా దెలిసికొనెను. లోవాండలో నుండగా లివింగ్‌స్టన్‌గారు పోర్చుగీసువారితో పరిచయము చేసికొని వారు బానిస వ్యాపారము నణచివేయుటకు చేసిన యేర్పాట్లను తెలిసికొనెను పైపైగా వారు దానినిగురించి మిగుల ఖండితమైన నియమములు చేసినను లోలోపల వారే దానికి ఆధారము కలుగజేసి ధనము సంపాదించుచుండిరని ఆయన గ్రహించుకొనెను. సర్కారువారు ఎంత కఠిన పద్ధతులను నియమించినను ఉద్యోగస్థులు దుర్మార్గులైనయెడల వాటిని భంగము చేయుదురని మనకు తెలిసిన విషయమే గనుక బానిస వ్యాపారము కూడదని సర్కారువారు దండోరా వేసినను అది నిరభ్యంతరముగా జరుగుచుండెను.

1854 సం॥ సెప్టెంబరు నెల 20 వ. తేదిన లివింగ్‌స్టన్‌గారు లోవాండను విడిచి లిన్‌యాంటికి పోవుటకు బయలుదేరెను. లోవాండలోనివారు ఆయనయెడల తమకుగల గౌరవమునకు సూచనగా ప్రయాణమున కవసరమైన వస్తువులను ఆయన కిచ్చిరి. ముఖ్యముగా ఆయన యుపయోగము నిమిత్తమై ఓడ నాయకులు ఒక మంచి డేరా కుట్టించి ఆయన కిచ్చిరి. బ్రిటిష్ ఉద్యోగస్థులును పోర్చుగీసు ఉద్యోగస్థులును కలిసి ఆయన సామానులు మోయుచుండిన మకలోలో పనివారికి తలా ఒక మంచి దుస్తు బట్టలనిచ్చి, వారి నాయకుడగు సేకేలేటుకు ఒక గుర్రమును, సైన్యాధిపతి యుడుపులను,



రెండు గార్దభములను బహుమానముగా పంపిరి. సెట్సి అను ఈగవలన గార్దభముల కపాయము కలుగదు గనుక అవి ఆ ప్రదేశమందు వృద్ధియై జనుల కుపయోగపడునట్లు వారు వాటిని పంపిరి.

వారు కొంతదూరము సాగిపోయిన తర్వాత ఒక జమిందారుని దర్శించి ఆయనయొద్ద కొన్నాళ్లుమాత్రముండ నుద్దేశించుకొనిరిగాని ఆ సమయమున లివింగ్‌స్టన్ కొంత విచారకరమైన వర్తమానము తెలియబడినందున మూడు నెలల వరకా ధనవంతుని యింటిలోనే బసచేయవలసివచ్చెను. అందుకు కారణమేమనిన, లోవాండనుంచి వచ్చిన యుత్తరములలో, ఆయన తన ప్రయాణ వివరములను వ్రాసిన పుస్తకమును ఇంగ్లాండుకు తీసికొనిపోవుచుండిన ఓడ బండ తగిలి బద్దలైనందున ఆ పుస్తకము నీటిపాలాయెనను దుర్వార్త తెలియబడెను. చాలాకాలము కష్టపడి వ్రాసిన గ్రంథమును కోల్పోయినందున లివింగ్‌స్టన్‌గారు మిగుల విచారపడినను అందునుగురించి విచారించిన ప్రయోజనములేదని తలంచి మూడు నెలలు ప్రయాసపడి తిరిగి ఆ పుస్తకమును వ్రాసెను.

వారీ ధనవంతుని యిల్లు విడిచిన తర్వాత కాప్టెన్ నీవ్స్ అను నొక పోర్చుగీసు వ్యవసాయకుని ఇంటికి వచ్చిరి. లోవాండకు పోవుచున్నప్పుడు లివింగ్‌స్టన్‌గారు ఆ జమిందారుని దర్శించియుండెను గనుక తిరిగి అతనియొద్ద కొన్నాళ్లు బస చేయుటకు అతని యింటిలో దిగెను. కస్సాంగె అను ఆ ప్రాంత్యములోని జనులు వ్యాధుల విషయమై బహు విపరీతాభిప్రాయములుగలిగి తమమీద విరోధులు మంత్ర

ప్రయోగము చేసినందున వ్యాధులు వచ్చునని నమ్మెడివారు. లివింగ్‌స్టన్‌గారు కాప్టెన్ నీవ్స్‌గారి యింటిలో బసచేయు చుండినప్పుడు ఆ జమిందారుని సేవకులలో నొకని కుమారుడు కఠిన జ్వరముతో బాధపడుచుండగా వైద్యుడగు లివింగ్‌స్టన్ గారు వానికి కావలసిన మందును సిద్ధపరచి ఇయ్యబోగా ఆ పిల్లవాని తల్లి వానికి దిష్టి తగిలినది గనుక మందిచ్చి ప్రయోజనములేదని ఆక్షేపించుటవల్ల ఆ కుర్రవాడు వృథాగా చని పోయెను. ఈ చిల్లంగివిద్యవిషయమై వారికి కలిగిన మూఢ భక్తివలన ఆ జనులలో విశేష ప్రాణనష్టము కలుగుచుండెను. ఒకనికి ప్రాణాపాయకరమగు వ్యాధి సంభవించగా చిల్లంగి పోతు భీకరవేషము వేసికొని దైవావేశము కలిగినట్లు నటించుచు, ఊరంతా తిరిగి బొబ్బలుపెట్టుచు, జబ్బుపడినవాని మీద ఎవరు మంత్రకట్టు సాధించిరో వానికొరకు వెతుకు లాడును. మంత్రశక్తిచే ఒకని కనుగొని వానిమీద నేరము మోపి, అతడు కార్పణ్యముచే ఆ కాయిలా రాజేసేనో లేదో కనుగొనుటకై వానికి పచ్చి విషము త్రాగించును. ఈలాగు మృతినొందువారిలో ముప్పాతిక మువ్వీసము నిరప రాధులే గాని ఆ చిల్లంగిపోతు కీర్తికి లోపము కలుగకుండు నట్లు వారి మరణ మగత్యమాయెను. ఆ ప్రాంతములలో ప్రతి సంవత్సరము నూర్లకొలది జనులు ఆ మూఢాచారము నకు బలియగుచుండిరని లివింగ్‌స్టన్‌గారు వ్రాసిరి.

లివింగ్‌స్టన్‌గారు తాను పూర్వము నడిచిన త్రోవనే తిరిగి ప్రయాణము చేయుచుండెను గనుక ముందు ప్రయాణ మందు తనకు పరిచయమైనవారిని దర్శించుచువచ్చెను.



వారు తనకు చేసిన యుపకారమును లివింగ్‌స్టన్‌గారు మరు వక లోవాండలో నుండినప్పుడు వారికొరకు మంచి బహు మానములు సమకూర్చి తెచ్చియిచ్చెను.

కటేమా యను నాయకుని గ్రామము చేరునప్పటికి అతడు వేటకుపోయియుండెనుగాని లివింగ్‌స్టన్‌గారు వచ్చిన సంగతిని కొందరు పోయి చెప్పగా కటేమా వచ్చి ఆయనకు మర్యాదచేసి, ఆయన పరివారమున కవసరమైన సరకులను కొదువలేకుండ ఇచ్చి, వారు తన దేశమునందున్నంతకాలము వారికి సహాయము చేయవలెనని గ్రామాధికారులందరికి తాకీదులు పంపెను. లివింగ్‌స్టన్ ఆ నాయకునికొరకు దర్బారు చేర్చి, కటేమాకు ఎర్రని (నక్కీ) జలతారు నిలువుటంగీని అర్పించి ఆయనకు ధరింపజేసెను. కటేమా తనకు కలిగిన గౌర వమునకు మిట్టిపడుచు ఆ ప్రశస్త వస్త్రములకు అతిశయ పడుచు పట్టరాని సంతోషముగలవాడాయెను. ఆ దేశా చార ప్రకారము రాజు కొలువుకూటమునకువచ్చి తిరిగి పోవు నప్పుడు నేలమీద నడువకుండ ఆయన పరివారములోని యొకని వలన మోయబడవలెను గనుక ఆ దర్బారు ముగిసినప్పుడు కటేమా ఒక భటుని మెడమీద కూర్చుండి వెళ్ళిపోయెను.

ఇంకను కొన్నాళ్ళు ప్రయాణము చేసినమీదట వారు మనెంకో యను రాణి ఏలుచుండిన ప్రదేశమునకు వచ్చిరి. రాణి తాను రావీలులేనందున లివింగ్‌స్టన్‌కు మర్యాద చేయు టకై తన భర్తను పంపి, తనకును ఆ సుప్రసిద్ధునికిని కలిగిన ప్రాణస్నేహమునకు సూచనముగా ఒక విశేషమైన ఆచారము జరుపవలెనని యుత్తరువు చేసెను. మధ్య ఆఫ్రికా ఖండమం

దలి జనులలో ఆ యాచారము సర్వత్ర ప్రబలియుండుటను బట్టి దాని వివరము లిచ్చట వర్ణించుట యుక్తము.

మసెంకో రాణిగారి భర్తయు లివింగ్‌స్టన్ యొక్క పరివారములో ముఖ్యుడును మధ్యను నిలువబడి ఒకరి చేతుల నొకరు పట్టుకొనియుండగా మరియొకడు వచ్చి వారి చేతుల మీదను, కడుపులమీదను, కుడి చెంపలమీదను, నొసళ్లమీదను రక్తము కారునంతగా గాయములు చేసెను. రెండు పాత్రలలో వారొక విధమైన మద్యమును పోసి అక్కడ పెట్టియుండిరి గనుక గాయములలో కారుచుండిన రక్తములో నొక్కొక్క బిందువును గడ్డిపుడకతో నెత్తి ఒకని రక్తము నొక పాత్రలోను మరియొకని రక్తము నింకొక పాత్రలోను కలిపిరి. ఆ మీదట ఆ పాత్రలను మార్చి ఒకరి రక్తము కలిసిన మద్యము నొకరు త్రాగిరి. ఇదంతయు నడుచుచుండగా చుట్టు కూర్చుండియుండిన ఇరు పక్షములవారును తమ దండములతో నేలను తట్టుచు, ఆ ఒప్పందమునకు సమ్మతించినట్లు పద్యములు పాడుచు ఆ యాచారము ముగిసినప్పుడు మిగిలిన మద్యమును త్రాగిరి. ఈ యాచారములో కలిసిన ప్రధానులు ఆ నాటినుండి ప్రాణపర్యంతమును స్నేహితులైయుండి ఒకని కపాయము సంభవించినట్లు మరియొకరు తెలిసికొనగా అతనికి తక్షణము సహాయముచేయ బాధ్యులమని యొప్పుకొందురు.

లివింగ్‌స్టన్‌గారెవరిమధ్య సంచారముచేసినను వారి యెదుట మర్యాదగాను న్యాయముగాను నడచినందున అందరి యభిమానమునకు పాత్రుడై ఎన్నడును ఆయుధ ప్రయోగము



చేయు నగత్యము లేకుండ తన కార్యమును తుదముట్టించె నని చూచితిమి. అయినను ఈ ప్రయాణమందొకసారి ఒక పనివాని దుడుకుతనమువలన ఆయుధప్రయోగము చేయు నంతటి దురవస్థ సంభవించెను. ఎట్లనిన, ఒకనాడు వారొక యూరి సమీపమున మకాముచేసియుండగా ఆ యూరివాడొకడు వచ్చి, లివింగ్‌స్టన్ యొక్క పరివారముతో వాదులాడుచు అల్లరి చేసినందున మకలోలోవాడొకడు ఆతురపడి వానిని ముఖముమీద కొట్టెను. తన పనివాడు చేసిన తప్పుకు లివింగ్‌స్టన్ తానే మన్నింపడిగి ఆ గ్రామ పెద్దకు ఒక తుపాకిని అయిదు తానుల గుడ్డను ఇచ్చి సమాధానముచేసికొన జూచెనుగాని అతడు సమ్మతించక మరెక్కువ కావలెనని తొందరచేయగా లివింగ్‌స్టన్ ఇయ్యనొల్లకపోయెను వారా గ్రామము విడిచి అడవిలో కొంతదూరము వెళ్లిన తరువాత క్రింది పొదలలోనుండి జనుల పెద్ద గుంపు వచ్చుచున్నట్లు చప్పుడు వినబడెను. ఆ గుంపు సమీపమునకు వచ్చుకొలది తమ ఈటెలను విసరుచు తుపాకులు కాల్చుచు, లివింగ్‌స్టన్ గారి పనివారు జడిసి సామానులన్ని విడిచిపెట్టి పారిపోదురు గనుక ఆ సరుకు సామానులన్నియు తమ వశమగునని అనుకొని వారిమీద పడి వారు మోయుచుండిన బరువులనెత్తి క్రింద పడవేసిరి. లివింగ్‌స్టన్‌గారు జ్వరబాధితుడై బలహీనముగా నుండినను ఇది భయంకరమైన పోరాటమగునని గ్రహించి తాను సవారి చేయుచుండిన యెద్దును త్రిప్పి తన తుపాకి పట్టుకొని గుంపుమధ్యకు ఎద్దును తరిమి వారి నాయకుని రొమ్మునకు సరిగా గురిపెట్టెను. నాయకుడు ఆరు నాళ

ముల తుపాకిని చూచి గుండె కరిగినవాడై, స్వామీ! శరణు, శరణు. నేను మీతో మాట్లాడ వచ్చితినిగాని మరేమియు లేదని కృతాంజలిబద్ధుడై వేడుకొనెను. లివింగ్‌స్టన్ ఆ నాయకుని చేతిలోని తుపాకిని పెరుక్కొని దానిని బాగా పరీక్షించి చూచి అతడప్పుడే దానితో కాల్చియుండెనని గ్రహించుకొనెను గాని ఇక చేయునదేమియు లేక అతని చూచి, మీతో కలహించుట మా కిష్టములేదుగాన శాంతముగా వెళ్లుండనగా, అతడు, నేను వెనుకకు తిరిగి పోవునప్పుడు నన్ను నీవు వీపున కాలుస్తావేమో అని చెప్పెను. అందుకు లివింగ్‌స్టన్ వానిని తిన్నగా చూచి, ఓరి దుర్మార్గుడా! నా విషయమై నీకు భయమున్నను నీ విషయమై నాకు భయములేదు గనుక నేనే వెనుకకు తిరిగి పోతానులే అని చెప్పి తన యెద్దును త్రిప్పి దోవను సాగిపోయెను. లివింగ్‌స్టన్‌గారి పనివారు తమ యజమానుని ధైర్యమున కద్భుతపడి, ఓహో! మన యేలినవారే అడ్డము రాకుండిన యెడల మనము వారిని నలిపియుండక పోదుమా? అని జంభాలు నరుకుచుండిరి.

వారక్కడనుండి ప్రయాణమై ఒకనాడరణ్యముగుండ పోవుచుండగా బానిసవారిని పట్టుకొనిపోవుచుండిన యొకడు వారి కెదురాయెను. వాడు ఎనిమిదిమంది స్త్రీలను గొలుసులతో బంధించి అమ్ముటకు తీసికొనిపోవుచుండెను. వారిలో నొక పిల్ల కాయిలావలన చిక్కిపోయి నడుచుటకు శక్తిలేక చెటలో దూరి కనబడకుండపోయెను. ఆ క్రూర హృదయుడు ఆ పిల్లనుగురించి లేశమైనను విచారింపక మిగిలిన స్త్రీలను తోడుకొనిపోయెను. లివింగ్‌స్టన్ ఆ విచారకరమైన వార్తను

జనులు ఆయుధములు చేబూని వారి వెనువెంటనే వచ్చిరిగాని కలహామునకు వెనుకతీసినవారివలె నటించిరి.

లివింగ్‌స్టన్‌గారును ఆయన పరివారమును ఆ గండము గడచినట్లనుకొనిరిగాని వారు కాసాయి నదియొద్దకు రాగా ఆశాపాతకుడగు దేశాధిపతి కుతంత్రము పన్ని తమ్మును ఏరు దాటకుండ ఆటంకములు చేసెనని గ్రహించుకొనిరి. లివింగ్‌స్టన్‌గారును ఆయన పరివారమును ఆ గ్రామమును విడిచిన తోడనే పాలెగాడు నలుగురు భటులను పంపి పడవను నడిపించువాడు వారిని ఏరు దాటించకూడదని ఉత్తరువుచేసెను గనుక వాడు పడవలను మరియొకచోటికి తీసికొనిపోయెను. ఆ రేవునొద్ద కాసాయినది నూరడుగుల వెడల్పుగలదై మిగుల వడిగా ప్రవహించును గనుక పడవలేకుండ నదిని దాటుట మిగుల దుస్సాధ్యము. ఈ యిరుకు సమయములో నెవరికేమియు తోచకుండగా సంధ్యవేళ లివింగ్‌స్టన్ పనివారిలో నొకడు ఏటి వెంబడి వెదకుచుబోగా ఒక పడవ కనబడెను. అతడు దానిని తీసికొనివచ్చి దానిమీద నందరిని ఎక్కించుకొని ఆవల చేర్చెను. అందరిని దాటించిన తర్వాత నతడు పడవను ఇవతలి గడ్డకు తెచ్చి బాడుగకుగాను దానిలో పూసల హారము పెట్టి ఏటిలో నీదుకొని వచ్చెను. వారందరు గడ్డెక్కి మఖాము ఏర్పరచి భోజనము చేసికొనిరి. తరువాత వారు పండుకొనిరిగాని పనివారు తాము పన్నిన తంత్రోపాయమునకు ఉప్పొంగి పకపక నవ్వుచు అర్ధరాత్రివరకు మేలుకొని సరససల్లాపములు చేయుచుండిరి. ఉదయమున పడవలవారు వచ్చి తమ పడవలతోనే వారు ఏరు దాటుటను చూచి,



ఆహా! మీరెంత జిత్తులమారులయ్యా అని వారితో ననగా వారు ఓహోహో! మీరెంత పుణ్యాత్ములయ్యా! మాకు పడవనిచ్చినందుకు మీకు వందనములని చెప్పి వారిని హాస్యము చేసిరి.

కాసాయి నదిని దాటిన తరువాత వారు గొప్ప మైదానమునకు వచ్చిరి. అక్కడ అడవి గాడిదెలును ఏనుగులును కారుపోతులును మెండుగా నుండెను. ఒకనాడు లివింగ్‌స్టన్ ఒక అడవి గాడిదెను తుపాకితో గాయపరచగా ఆయన పనివారు దానిని వేటాడబోయిరి. ఆ సమయమున లివింగ్‌స్టన్‌గారు ఎత్తుగా పెరిగిన గడ్డిలో నడచుచున్నప్పుడు ఒక కారుపోతు అతని కనుగొని కంట నిప్పులు రాల్చి దౌడుతీయుచు అతనిపై బడుటకు వచ్చెను. సమీపములో నెక్కడను ఒక చెట్టుకూడ లేకుండుటను చూచి ఆయన తుపాకి గుర్రము నెత్తి గురిపెట్టి కాచుకొనియుండెను. ఆ పోతు లివింగ్‌స్టన్ ముందర మూడు నాలుగు గజములవరకుండిన పొదను దాటలేక దాని వైదొలగి వచ్చునంతలో ఆయన దాని భుజమునకు గురిపెట్టి కాల్చి తత్క్షణమే తాను నేలమీద బోర్ల పండుకొనెను. దెబ్బ తిన్న ఆ పోతు పొదకు ఇంకా కొంచెము ఎడముగా పరుగెత్తి లివింగ్‌స్టన్‌ను దాటి ఆయన వెనుకనుండిన యొక గుంటలో పడి చచ్చెను. దిన గండము నూరేండ్ల ఆయుస్సు అన్నట్లు లివింగ్‌స్టన్‌గారికి ఏ హానియు కలుగలేదు.

వారా మైదానమున సంచరించుచు కాలక్రమేణ సేకేలేటుయొక్క రాజ్యములోని మొదటి గ్రామము చేరిరి. ఒక సంవత్సరమునకు పైగా తమ్ము విడిచిపోయినవారింకను బ్రతికి

యుందురా అని ఆ యూరివారు వారిపై ఆశలు వదలి యుండిరిగాని యిప్పుడు వారిని చూచినతోడనే వారేమైనా యమలోకమునుండి తిరిగివచ్చిరా అన్నట్లు వారి రాకకు అపరిమితముగా ఆనందించిరి.

వారా యూరిలో నాలుగు దినములు గడిపి తిరిగి ప్రయాణమై జాంబీసి నదియొద్దకు వచ్చి, పడవలు మాట్లాడుకొని, లిన్యాంటికి పోవుటకై బయలుదేరిరి. ఆ నదిలో నీటి గుర్రములు మెండుగా నుండెను. ఇవి తిమింగిలములవలె చేపలను పట్టుకొనుటకు నీళ్లలో మునిగి కొంతసేపు అడుగున పారాడుచుండునుగాని అప్పుడప్పుడు ఊపిరి పీల్చుకొనుటకు పైకి రావలెను. అట్లు వచ్చినప్పుడు అవి నోటిలోకి నీళ్లు పీల్చుకొని తమ నాసికారంధ్రములద్వారా పైకి చిమ్మివేయును. అవి నీళ్లు పైకి చిమ్మినప్పుడు మనము పూలబాణములు కాల్చినట్లే యుండును. నీటి గుర్రముయొక్క పిల్ల పెద్దదగువరకు తనకు తానే నీళ్లలో ఈదులాడక తన తల్లి మెడపాంపుమీది కెక్కి కూర్చుండును. పిల్లలున్న సమయమున నీటి గుర్రముల కెక్కువ రోషము గనుక వానిని సమీపించిన మనుష్యుల కవి తప్పక హానిచేయును. అవి సాధారణముగా పగటిపూట నడియేటిలో ఈదులాడుచుండునని పడవలు నడిపించువారెరిగి పడవలను ఏటి యొరను నడిపించెడివారు. ఒకనాడు వారు పడవలను నడిపించుచుండగా లివింగ్‌స్టన్‌గారెక్కియుండిన పడవ ప్రక్కన ఒక నీటి గుర్రము తేలి తన ముట్టెతో ఆ పడవను కుమ్మి దానిలో కూర్చుండియుండిన లివింగ్‌స్టన్‌గారిని ఆయనతోనుండినవారిని చెండాట ఆడి





తల్లి వీపున ఎక్కిపోవు నీటి గుర్రపు పిల్ల

నట్లు ఏటిలోకి ఎగరవేసెను. నీటి గుర్రము నీళ్లపైకి వచ్చినప్పుడు తనకు కనబడిన పడవను కొరికి బద్దలుచేయును గనుక వారు ప్రయాసముతో గట్టెక్కిన పిదప పడవ ఏమగునో యని కొంతసేపు కనిపెట్టుచుండిరిగాని ఆ నీటిగుర్రము దానినేమియు చేయక ఏటివెంబడి ఈదుకొనిపోవుటను చూచి భయము మాని పడవను గట్టెక్కించిరి.

1855 వ. సం॥ సెప్టెంబరు నెలలో వారు సేశేకె గ్రామముచేరి ఒక సంవత్సరముక్రిందట లివింగ్‌స్టన్ మామయైన మాఫట్‌గారు పంపిన సరకు సంబారములను ఆ యూరివారిచేత పుచ్చుకొనిరి. ఆ సరకులు తెచ్చినవారు మకలోలోవారి బద్ధవైరులైన మాటబేలివారే. మకలోలోవారు తమ శత్రువులు తమ్మును మోసపుచ్చి ఆ సరకులో తమ్మును వశపరచుకొను మందులను తెచ్చియుందురని సందేహించినందున వారు మాఫట్‌గారియొద్దనుంచి వచ్చినట్లు చెప్పినను నమ్మరైరి. అయినను మాటబేలివారు, సరే. మీ రెట్లియినా తలంచుకొనండి. మేముమాత్రము ఈ సరకులు తెచ్చి మా ధర్మము తీర్చియున్నాము. ఇదిగో! సామానులన్ని

ఇక్కడ పెట్టి పోవుచున్నాము. అవి చెడిపోయిన యెడల అందుకు మీరే జవాబుదారులని చెప్పి, ఏటి ఆవలి ప్రక్కన ఆ మూటలన్నియు దించి వెళ్లిపోయిరి. వారు వెళ్లిపోయిన తరువాత మకలోలోవారు ధైర్యము తెచ్చుకొని యేరు దాటి ఆవలి ప్రక్కకు వెళ్లి వారు తెచ్చిన మూటముల్లెలన్నియు ఏటి నడుమనుండిన ఒక ద్వీపమునకు మోసికొనివచ్చి ఒక చిన్న గుడిసె కట్టి దానిలో భద్రము చేసిరి లివింగ్‌స్టన్ ఆ సరకు తీసికొన్నప్పుడు వాటిలో నొక చిల్లిగవ్వయైనను పోలేదని కనుగొనెను.

సేశేకెనుండి వారు నేల ప్రయాణముచేసి కొన్ని దినములలోపల తాము దాదాపు రెండు సంవత్సరముల క్రిందట బయలుదేరిన లిన్‌యాంటికి వచ్చి అక్కడ తాము విడిచిపెట్టిపోయిన బండ్లును ఇతర సామానులును తాము విడిచివెళ్లినట్టే తిరిగి గైకొనిరి.

లివింగ్‌స్టన్‌గారును ఆయన సహప్రయాణికులగు ఇరువైయేడు మందిమకలోలోవారును సురక్షితముగా తిరిగి వచ్చినందుకు లిన్‌యాంటివారందరు చాలా సంతోషించి పదిదినములవరకు ఆబాలగోపాలముగా ఉత్సవములు జరిపిరి. లివింగ్‌స్టన్ యొక్క పనివారు తాము కన్న విన్న వింతలన్నిటిని గూర్చి తమవారితో నూరు పర్యాయములు చెప్పినను వారి తనివితీరకుండెడిది. సేకేలేటు లోవాండవారు తనకొరకు పంపిన బహుమతులు చూచి, ఏనుగు నెక్కినంత సంతోషము నొందినవాడాయెను. ఆదివారము ఆరాధనకు వచ్చినప్పుడు పోర్చుగీసు సైన్యాధిపతి యుడుపులు ధరించుకొన్న ఈ నాయ



కుడు పట్టరాని సంతోషముచేత మింటిని మంటిని ఎరుగక ఎక్కడలేని గర్వము వహించుకొనెను. లివింగ్‌స్టన్‌గారు ఆరాధనను నడిపించి ప్రసంగముచేసెనుగాని ఆరాధనకు వచ్చినవారందరు సేకేలేటు దాలు దంభమునకు విభ్రాంతిపడి ప్రసంగము గమనించక అతనితట్టే చూచుచుండిరి.

లిన్‌యాంటివారు లోవాండ సమాచారమంతయు విని అందునుగూర్చి తలపోసికొని, అట్లయితే మనము పోర్చుగీసువారితో వ్యాపారములుచేసి లాభము సంపాదించవచ్చును గదా యనుకొని దంతములు, చర్మములు, తేనె మొదలగు పదార్థములను సమకూర్చి వ్యాపార పరసను సిద్ధపరచి లివింగ్‌స్టన్‌గారి సహప్రయాణికులచే లోవాండకు పంపి విక్రయించుటవలన లాభము సంపాదించిరి. అయితే తాను పడిన ప్రయాసమునకు ఫలితముగా వర్తకులు సముద్రమునొద్దకు తమ సరకులు తీసికొనిపోవుటకై దోవ యేర్పడినందున కాలక్రమేణ న్యాయమైన వ్యాపారము వృద్ధిజెందుకొలది బానిస వ్యాపారము అంతరించునని లివింగ్‌స్టన్‌గారు గ్రహించి తన యత్నమింతమట్టుకు సఫలమైనందున మిగుల సంతోషించెను.

దీర్ఘయాత్రలు సలిపిన లివింగ్‌స్టన్‌గారి పరిజనులు లోవాండలోని బ్రిటిష్ యుద్యోగస్థుడు తమకిచ్చిన చారల యుడుపులు వేసికొని వీధులు వీధులు తిరుగుచు ఒయ్యారముగా నడుచుచు, ఎప్పుడును ఇల్లు విడిచి బయటపోనివారియెదుట జంభాలు నరుకుచు, „ఓరిబావి తాబేటికి లోకవార్త యేమి తెలుసును? మేము లోకాంత్యమువరకు పోయివచ్చిన వీర

శూరులమని" ప్రేలుచుండిరి. వారు లివింగ్‌స్టన్‌గారి కళ్యాణ గుణగతులను బహుగా ఎత్తి పొగడినందున, ఆయన తూర్పు సముద్రమువరకు దోవను కనుగొనవలెనని యుద్దేశించినట్లు తెలిసికొన్నతోడనే అనేకులు ఆయనను వెంబడించుటకు తమకు సెలవియ్యుమని వేడుకొనిరి.

# 6 వ. అధ్యాయము

## తూర్పుదిశ యాత్ర

లివింగ్‌స్టన్‌గారియెదుట సేకేలేటుకును అతని జనులకును గలిగిన యభిమానమునకు వారాయన కొనర్చిన సహాయమే ఆనవాలు. ఆయన లొవాండకు బయలుదేరి పోయినప్పుడు ఆ యాత్ర కవసరమైన సామానులన్నియు వారిచ్చుటమాత్రముగాక సామానులు మోసుకొనిపోవుటకు ఇరువైయేడుమంది మనుష్యులనుకూడ పంపిరి. లొవాండలో నున్నప్పుడు లివింగ్‌స్టన్‌గారు లండన్ మిషనేరి సొసైటీవారియ్యవలసిన వేతనములో కొంత మొత్తము గైకొని దానితో కావలసిన పరంజాము సమకూర్చి వాటితోను లొవాండ కాపురస్థులగు జాతివారిచ్చిన బహుమానములతోను తాను సేకేలేటునొద్ద చేసిన ప్రేమానుబంధమైన ఋణము తీర్చ నిశ్చయించుకొనెనుగాని తిరిగి వచ్చుచున్నప్పుడు దోవన ఆయన సరకులను దోచుకొన్న ఆశాపాతకులగు పాళెగాండ్ల బలాత్కారమువలన ఆయనయొద్ద నేమియు మిగులకుండెను. కడకు కట్టుగుడ్డలతోనే ఆయన లిన్యాంటికి వచ్చెను.

ఆ మారుమూల ప్రాంత్యములలోని వ్యాపారమంతయు సాటాబేరముగా జరుగుచుండెను గనుక వారు రొక్క

మేమిటో ఎరుగనివారైయుండిరి. నెయ్యికి బదులు గింజలను, గుడ్డలకు బదులు గుమ్మడికాయలను ఇచ్చి వారు వ్యాపారము చేయువారు. లివింగ్‌స్టన్‌గారు శుష్క దరిద్రుడని వారెరిగియుండినను ఆయనయెదుట తమకుగల అనురక్తి ప్రభావముచేతనే తూర్పుదిశ ప్రయాణమునకు ఆయన కవసరమైనవి యావత్తు వారు సిద్ధముచేసి ఆయన కప్పగించిరి.

మకలోలో వారు తనకిచ్చిన సరుకుకు లివింగ్‌స్టన్ గారు తగిన క్రయ మియ్యలేకపోయినను వారి కాయన విలువలేని ధన మొసంగియుండెను ఎట్లనిన, ఆయన వారి మధ్య నున్నంత కాలము అవకాశమున్నప్పుడెల్ల వారికి శ్రీ యేసు ప్రేమనుగురించి బోధించుటమాత్రముకాక ఆ ప్రేమను తన అనుదిన చర్యలమూలముగా దృష్టాంతపరచెను. వారు క్రీస్తు దివ్యబోధను తెలిసికొనుటవలన దురాచారములను కొన్నిటిని వదలి అనేక విషయముల గుణపడిరి గనుక వారాయనకిచ్చిన ఆస్తికంటె ఆయన వారికిచ్చిన ఐశ్వర్యమే నూరంతలు గొప్పదని నిస్సందేహముగా చెప్పవచ్చును. ఆయన అన్యదేశస్థుడై యుండినను క్రీస్తుయొక్క ప్రేమ ప్రభావముచేతనే తమమధ్య సహోదరభావము గలిగి జీవించుట చూచి, ఆయనయెదుట మితిలేని గౌరవాభిమానముగలవారైరి. లివింగ్‌స్టన్ 1855 సం॥ నవెంబరునెల 3 వ తేదిన జాంబీసి నదివెంబడి తూర్పు సముద్రమునకు పోవుటకు బయలుదేరినప్పుడు సేకేలేటు ఇన్నూరుమంది పరిజనులతో ఆయనను వెంబడించెను. పరివారములో నెక్కువ



భాగము మఖాము సిద్ధపరచుటకై ముందుకుపోయియుండగా ఆ ప్రాంత్యమున ప్రబలియుండిన విషపుటీగలు ఎద్దులను కుట్టకుండ సేకేలేటును లివింగ్‌స్టన్‌యును కొందరు పరిజనులను నిలుపుకొని చీకటిపడువరకు ఆగియుండిరి. సెట్సి యను ఆ విషపుటీగ చీకటివడిన పిదప నుపద్రవము చేయ నేరదు.

వొక్క రాత్రి పదిగంటలకు బయలుదేరి ఏనుగుగడ్డిలోబడి పోవుచుండగా ఉరుము మెరుములతోటి కుంభవర్షము కురిసెను. కటికచీకటిగా నుండినందున వారు దిక్కుతెలియక ఎవరి దోవను వారు చెదరిపోవుచు ఒకరినొకరు తగులుకొని మిగుల అవస్థపడిరి. పనివారంతకుమునుపే సామానులు తీసికొనిపోయియుండినందున డేరాగాని పరుపుగాని మరియే సౌకర్యముగాని వారికి లేకపోయెను. వారు మఖాము చేరలేక దోవ ప్రక్కన ఎవరో బాటసారులు వేసికొని విడిచి పోయిన చలిమంటను కనుగొని ఉదయమువరకు అక్కడనే ఆగవలెనను ఉద్దేశముతో గుడ్డగుడుసులేకయే నేలమీద పండుకొనిరి.

కప్పుకొనుట కేమియులేక లివింగ్‌స్టన్‌గారు చలికి వణుకుచుండగా నొకడు వచ్చి, ఆయనను తట్టి, స్వామీ- నా కంబడి తీసికో అని చెప్పి ఆయనకు తన కంబడి కప్పెను. లివింగ్‌స్టన్ వద్దనుచుండినను సేకేలేటు బలవంతముచేసి ఆయనకు కంబడి కప్పి తాను ఊరకనే పండుకొనెను.

వారా అరణ్య ప్రదేశమును దాటి కడకు జాంబీసి నది యొద్దున నుండిన సేశేకె గ్రామము చేరి, నదివెంబడి చేయవల

సిన ప్రయాణమునకు కావలసిన పడవలను సమకూర్చి బయలుదేరి నాలుగైదు దినములు సాగిపోయిన తర్వాత ఆ నది బండలమధ్య వడిగా ప్రవహించు చోటుకు వచ్చి ఆ వెల్లువలో పడవలను నడుపలేక గడ్డకెక్కించి అక్కడనుండి నేల ప్రయాణముచేయ మొదలుపెట్టిరి. ఆ చోటుకు కొంత దూరముగా నుండిన విశ్రుతమైన ఆకాశగంగనుగురించి మకలోలో వారివలన దెలిసికొని ఆ ప్రాంత్యము విడువకముందు దానిని చూడవలెనని నిశ్చయించుకొనెను. సేకేలేటుకూడ లివింగ్‌స్టన్ గారిని కలిసికొని ఆ ఎత్తుపోతనొద్దకు పోనిశ్చయించి యుండెనుగాని వారు మాటలాడిన పడవలలో నొకటి మాత్రము వచ్చినందున దానిని లివింగ్‌స్టన్ కప్పగించి అతడు నిలిచిపోయెను. అక్కడనుండి వారు ఇరువై నిమిషములు పడవను నడిపించిన తరువాత అయిదారుమైళ్ల దూరములో నుడిగాలి పెట్టినప్పుడు దుమ్ము ఆకాశమునకు లేచినట్టు మిన్నుముట్టుచుండిన ఆ నీటి యావిరి అయిదుచోట్ల స్తంభములుగా కనబడుచుండెను. అక్కడనుండి ప్రచండ శబ్దము ఘోషించుచుండెను. అది చూచి మకలోలోవారు, అయ్యా! అదిగో మోసియోఆతున్య అని చెప్పిరి. అందుకు అదిగో మ్రోగుడు మొగిలని యర్థము. అదియే పైచెప్పిన ఆకాశగంగ. వారా మహా సెలయేటిని సమీపించినకొలది నీళ్లు అతివేగిరముగా ప్రవహించు-చోటికి వచ్చుచుండిరి గనుక పడవ కొట్టుకొని అగాధములో పడకుండునట్లు వారు బహు జాగ్రత్తగా నడిపించవలసియుండెను. వెల్లువ పట్టినయెడల పడవ గతిలేక ఛేటికలో పడి బద్దలగును. అయినను వారు చమత్కార



*Page 99*

విక్టోరియా ఫాల్స్ అనబడిన ఆకాశగంగ

ముతో నడిపించి ఏటి నడుమనుండిన ఒక చిన్న ద్వీపిచేరి గడ్డెక్కిరి. అక్కడ వారి దృష్టికి కనబడిన వింతాతిశయములను వివరించుటకు మానవ వాక్శక్తి చాలదు.

ఒక మైలు వెడల్పుగల ఆ నది అతివేగముగా ప్రవహించుచు ఉన్నట్టే యుండి చక్కగా పాతాళములో దుమికి అదృశ్యమగుటను చూడగా అక్కడ భూమి తన నోరు తెరచి ఆ నదిని మ్రింగివేసెనేమో అన్నట్లుండును. పై చెప్పినట్టు ఒక మైలు వెడల్పుగలిగిన ఈ నది 80 అడుగుల వెడల్పుగలిగి మిక్కిలి ఇరకటముగా నుండిన ఆ సెర్రలో 300 అడుగుల లోతున పడుటవలన ఆ దెబ్బకు నీటి తుంపరలు లేచి, అవి రూపమున 200 లేక 300 అడుగులవరకు ఆకాశమార్గమున లేగుచును. ఇంత గొప్ప నది గవ్వంత అంత లోతుగాను ఇరకటముగాను ఉండిన గుంటలో పడగా నెంతటి కర్ణకఠోరమైన శబ్దముతో ఘోషించునో మా చదువరులే యూహింతురుగాక.

ఆ యాకాశగంగనుండి లేచి గగనము నంటుచుండిన తుంపరలవలన ఆ సమీప ప్రదేశమున ఎప్పుడును జడివాన కురియుచున్నట్లుండును గనుక చెట్టుచేమలు అపరిమితముగా పెరిగిన దట్టమైన యడవి యేర్పడియున్నది. ఎండ కాయుచున్నప్పుడు ఆ మొగిలమధ్య నేర్పడు చంద్రగూళ్లు కన్నుల పండుగ చేయుచుండును. అంతకుముందు యూరోపియనులెవరును ఆ స్థలమును చూచియుండలేదు గనుక లివింగ్‌స్టన్ ఆ వింతను కనిపెట్టినందున యతని ప్రసిద్ధిగాంచినవాడాయెను. ఆ కాలమందు ఇంగ్లాండు దేశము నేలుచుండిన మహారాణి గారి జ్ఞాపకార్థముగా ఆ యాకాశగంగకు ఆయన విక్టోరియా

ఫాల్స్ అను పేరుపెట్టి తాను దానిని కనుగొన్నందుకు గుర్తుగా సమీపముననున్న ఒక చెట్టు పట్టలో తన పేరు చెక్కి వేసెను. 1855 సం॥న ఆయన చెక్కివేసిన అక్షరములు నేటికి కూడ కొంచెముగా కనబడుచున్నవి. అంతవరకు నొక లివింగ్‌స్టన్‌తప్ప ఐరోపీయులెవరును ఆ ప్రాంత్యమున సంచరించియుండలేదుగాని ఇప్పుడు మున్నూరు అడుగుల లోతుగా నున్న ఆ యగాధముమీదుగా పొగబండి నడుచుటకు పెద్ద వంతెన కట్టుటవలన అనేకులు చూచుటకు వీలేర్పడినది.

ఆ ప్రాంత్యమున జాంబీసి నదిలో పడవలను నడిపించుట మిగుల కష్టము గనుక వారా నదిని విడిచి నేలప్రయాణము చేయవలసివచ్చెను. వారు జాంబీసి నది ప్రవహించుచుండిన పల్లపు భూమిని దాటి ఉన్నత ప్రదేశమునకు వచ్చిరి. అది వంకవాగులు అంతగా లేని విశాలమైన మైదానము. ఆ శీత భూమియంతయు పచ్చికపట్టియుండుటవలన ఎన్నశక్యము కాని అడవి మృగములు అందు సంచరించుచుండెను. అడవి గాడిదెలు, కారెద్దులు, మొదలగు జంతువు లక్కడ మందలు మందలుగా నుండుటమాత్రముకాక అక్కడక్కడ చెట్లు గుబురుగా మొలిచెడి చోట్ల ఏనుగులుకూడ మెండుగానుండెను. ఒక్కొక్క సమయమున వారు దోవన పోవుచుండగా బండికి అడ్డముగా వచ్చు మేకమందవలె ఏనుగులు వచ్చినందున పనివారు ముందుకు సాగిపోయి వాటిని దారి ప్రక్కకు తొలగదోలవలసివచ్చెను.

ఒకనాడు లివింగ్‌స్టన్‌గారు ఆహారముకొరకొక కారె



ద్దును కాల్చగా ఆ మందంతయు వారిమీదికి వచ్చినందున వారు పరుగిడిపోయి సమీపముననుండిన ఇరువై యడుగుల యెత్తుగల చెదలపుట్ట నెక్కి తప్పించుకొనిరి.

వారా మైదానమును దాటి బటోక యను జనుల సరిహద్దుకు వచ్చిరి. వీరిలో కొందరు మకలోలోవారికి విరోధులైనందున లివింగ్‌స్టన్‌గారిని తమ ప్రాంత్యముగుండ పోకుండ చేయవలెనని ప్రయత్నించిరి. ఈ బటోక జనులు శృంగారార్థముగా నొక విచిత్రమైన యభ్యాసము ననుసరించువారు. ఏమనిన, వారు యౌవనదశకు రాగా తమ పై రెండు కత్తెర పండ్లు పీకివేసికొందురు. ఇది యొక అలంకారమని వారెంచుదురు గనుక పండ్లు సహజముగానుండువారిని అసహ్యించుకొందురు. లివింగ్‌స్టన్‌గారా ప్రదేశమందుండగా ఒక్కొక్క సమయమున జనులాయన డేరాదగ్గరకు వచ్చి ఆయనయొద్దనుండిన చేతి అద్దములో తమ ముఖములు చూచుకొని, తమకంటె చిన్నవాండ్ల పండ్లనుబట్టి వారు అడవిగాడిదెలవంటివారని వారిని హాస్యము చేయుట కద్దు. సేకేలేటుమీద తిరుగబాటుచేసి ఆయనకు శత్రువులైన ఈ బటోకవారిలో కొందరు లివింగ్‌స్టన్‌గారు మకలోలో వారిని వెంటబెట్టుకొనివచ్చినందుల కాగ్రహించి, వారికి హానిచేయ జూచిరి. ఒకనాటి సాయంకాలమున ఆయన పరిజనులలో నొకడు నీళ్లకొరకు ఏటికి పోవుచుండగా కొందరతని చంపుటకు పొంచియుండిరి. వారిలో నొకడు పెద్ద గండ్ర గొడ్డలి చేతపటుకొని కన్నుల నిప్పులు [illegible] స్టన్‌గారిమీదికి వచ్చెనుగాని ఆ [illegible]రుడు భయ[illegible]

నెట్టిదో ఎరుగనివాడు గనుక రెప్పవాల్చక అట్లే ఆ ఒళ్లుమరచినవానితట్టు చూచుచుండగా వాడు నిశ్చేష్టుడై నిలచెను. అంతట లివింగ్‌స్టన్ తన ప్రక్కన నిలిచిన ఒక భటుని చూచి, ఈ వెర్రివానిని తోడుకొనిపొమ్మనగా వారు వానిని ఊరిలోకి తీసికొనిపోయి వాని స్వజనులకు వాని నప్పగించిరి.

చంపదగినయట్టి శత్రుడు తనచేతఁ
జిక్కెనేని కీడు సేయరాదు;
పొసగ మేలుచేసి పొమ్మనుటే చాలు

అను నీతి ననుసరించిన మన లివింగ్‌స్టన్‌గారెన్నియో గండములు గడిపి ప్రాణము దక్కించుకొనెను.

ఇది మొదలుకొని వారు సంచరించుచుండిన ప్రదేశము క్రమక్రమముగా తగ్గుచు కడకు సముద్రమట్టమునకు సమానముగానుండే మైదానమునకు వచ్చెను. అక్కడ వంకవాగులు కొద్దిగా నుండుటచే ఆ ప్రదేశము క్షేమకరమైనది. అందులో నివసించువారు జ్వరబాధ నంతగా ఎరుగరు. అందువలన లివింగ్‌స్టన్‌గారు ఆ ప్రాంత్యము తాను మొదటినుండి యుద్దేశించిన దేశీయ సువార్తికుల పాఠశాలకనుకూలముగ నుండునని నిశ్చయించుకొనెను. ఆయన తన పరువును తుదముట్టించిన తరువాత ఆయన ఆఫ్రికా ఖండమందు చేసిన పనికి జ్ఞాపకార్థముగా కట్టబడిన పాఠశాల వేరొక స్థలములో స్థాపితమైయున్నను ఆ ప్రదేశమును గురించి ఆయన పెట్టుకొన్న అభిప్రాయమునకు గురుతుగా ఇప్పుడక్కడ ఐరోపీయులనేకులు వాసముచేయుచున్నారు.

లివింగ్‌స్టన్‌యొక్క పరిజనులు మాంసభక్షులు గనుక



వారు జంతువులను వేటాడి ఆహారమున కుపయోగింతురు. అయినను వారికి తుపాకులు లేనందున లివింగ్‌స్టన్ తానే వారికొరకు వేటాడవలసియుండెను. ఒకనాడు వారొక లోయగుండ పోవుచుండగా లివింగ్‌స్టన్‌గారు గడ్డిలో నొక కారెద్దుండుటను చూచి దానిని కాల్చెనుగాని వేటు ఆయువపట్లలో తగలనందున అది పడకపోయెను. దెబ్బతినిన కారెద్దు బహు రౌద్రము తెచ్చుకొని తన్ను కాల్చినవారి మీదికి వచ్చునని లివింగ్‌స్టన్ ఎరిగియుండెను గనుక ఆయనయు ఆయన పనివారును ఒక చిన్న గుట్టమీదికి పరుగెత్తుకొనిపోయి ఎత్తయిన బండలపై కెక్కుచుండినంతలో అక్కడ సమీపమున మేయుచుండిన మూడు ఏనుగులు వారికి కనబడెను. దైవవశాన ఆ యేనుగులు వారిని చూచి భయపడి హాని చేయకుండ వెళ్లిపోయెను గనుక కారెద్దుకు చిక్కకుండ వారు బండలపై నెక్కి తప్పించుకొనిరి. కారెద్దు దెబ్బతిని కూడ తప్పించుకొనిపోయినది చూచి, లివింగ్‌స్టన్‌గారు ఆ యేనుగులలో నొకదానిని కాల్చినందున అది వారికిని దగ్గరనున్న యూరివారికిని ఆహారమాయెను.

ఇది జరిగిన మరుసటి దినమున లివింగ్‌స్టన్‌గారు ఒక గుట్టనెక్కి తాము పోవలసిన దారిని కనుగొనుటకు దిక్కులు తెలిపెడి యంత్రములను వినియోగించుచుండగా రెండు మైళ్ల దూరమున ఒక యేనుగు కనబడెను. లివింగ్‌స్టన్‌గారి పరిజనులుకూడ ఆ యేనుగును కనుగొని తన సెలవు లేనిదే దానిని వేటాడబోయియుండిరని ఆయన తన దుర్బిని సహాయమున తెలిసికొని దాని పిల్లను చంపవద్దని చెప్పుటకు

వారియొద్ద కొక మనుష్యుని తరిమెనుగాని అతడు వారియొద్దకు వచ్చులోపల వారు ఆ పిల్ల ఏనుగును చంపివేసియుండిరి. ఆహారమునకు కావలసినప్పుడుమాత్రమే వేటకు పోవలెను గాని వేడుకకు పోకూడదని ఆయన యొక నిష్కర్షచేసి యుండెను గనుక ముందటిదినమే వారికి కావలసినంత ఆహారము దొరికియుండగా తిరిగి నిర్నిమిత్తముగా వారా పిల్ల ఏనుగును చంపుట ఆయన కెక్కువ వ్యసనము కలిగించెను. ఆయన దుర్భిని పెట్టి చూడగా పనివారు చేత ఈటెలు పట్టుకొని నల్దిక్కులనుండి ఏనుగులమీదికి వచ్చుచుండిరి. వారు సమీపమునకు రాగా అవి వారిని వాసనపట్టి అపాయము గలుగునని బెదరి తప్పించుకొనిపోజూచెను. అప్పుడు వారా జంతువులను భయపెట్టుటకు చప్పట్లుకొట్టుచు, ఈటలు వేయుచు వాటిని తరుముచువచ్చినందున ఏనుగులు మడుగులోనుంచి వచ్చి పారిపోవుచుండెను. వేటగాండ్లు గడ్డిలో దాగుకొని వాటిమీద ఈటెలు విసరుచుండగా ఆ తల్లియేనుగు తన పిల్లను కాపాడుటకు వారిని సారిసారికి తరుముచు వచ్చి దానికి అపాయము కలుగకుండ అడ్డపడుచుండెను. కడకు అవి ఒక యేరు దాటుటకు దరినుండి దిగగా వేటగాండ్లు వాటిని సమీపించి ఈటెలు విసిరి చంపిరి.

లివింగ్‌స్టన్‌గారు ఈ మధ్య ప్రదేశములో మొట్టమొదట సంచరించిన ఐరోపీయుడైయుండి తానెవరిమధ్య నుండెనో వారియొక్క మర్యాదలు కనిపెట్టి అందును గురించి తన గ్రంథములో వ్రాయుటవలన అంతకుముందెవరికిని తెలియని సంగతు లనేకములు వెల్లడియాయెను.



ఇంతటి చిన్న పుస్తకములో అట్టి వివరములను కనుపరచుట కష్టము గనుక వాటిలో కొన్నింటిని మాత్రము ప్రస్తావించ వలసియున్నది.

వారు ప్రయాణముచేయుచు బటోకవారియొక్క నాయకుడగు మాంజె గ్రామము చేరిరి. అతడు ఆ దేశ మర్యాద ననుసరించి లివింగ్‌స్టన్‌గారికి స్వాగతమిచ్చుటకు ఆయన ముఖాముఖివచ్చి, వస్త్రములు పారవేసి, నేలమీద వెలికిలపడి, దుమ్ములో పొర్లుకొనుచు తొడలు చరచుచు ఆయనను సమీపించెను. ఈలాటి కార్యము లివింగ్‌స్టన్‌గారికి చాలా అసహ్యమును పుట్టించెను గనుక తన దర్శనమునకు వచ్చినవారు ఆలాగు చేయకుండ ఆయన వారి నభ్యంతర పరచెను.

బటోక పురుషులు తమ జుట్టును బహు విచిత్రముగా కట్టుకొనువారు. వారు కనుబొమ్మలను, పెడతలను, గొరిగించి, నడినెత్తి వెంట్రుకలు పెంచుదురు. అయినను జుట్టును జడగా నల్లుకొనక, పశువుల పిల్లవాండ్లు గిజిగాని గూడును నెత్తికిపెట్టుకొన్నట్టు వారా వెంట్రుకలను తలమీద కోణముగా కట్టుకొందురు.

వారింక కొన్నాళ్లవరకు తూర్పుకు సాగుచు లోయాంగ్వయను గొప్ప ఉపనది జాంబీసి నదిని కలియుచోటికి రాగా తిరిగి లివింగ్‌స్టన్‌గారికి ప్రాణాపాయము సంభవించునట్లుండెను. ఎట్లనిన, వారాదేశము చేరుటకు కొంత కాలమునకు ముందుగానే సంకరజాతివారు అనగా పోర్చుగీసు తండ్రికిని, ఆఫ్రికా దేశపు తల్లికిని పుట్టిన సంతానమువారు ఆ ప్రాంత్య

మున దౌర్జన్యము చేసినందున ఆ దేశాధిపతి వారిమీద కార్పణ్యము వహించి తన చేతికి చిక్కిన ఆ మిశ్రమజాతివారందరిని చంపుదునని శపథము చేసికొనియుండెను. లివింగ్‌స్టన్ వచ్చుచుండిన సమాచారము నతడు విని ఆయనకూడ ఆ జాతికి చేరినవాడే అనుకొని ఆయనమీద పగసాధింప దలచెను. ఆ పాళెగాడు లివింగ్‌స్టన్‌గారిని సంహారింప నిశ్చయించుకొని ఆయన మఖాముకు వచ్చి బహు పౌరుషముగా మాటలాడి ఆయనను బెదిరింపగా, లివింగ్‌స్టన్ తన అంగీని కొంచెము విప్పి, రొమ్ముమీది చర్మమును చూపి, బాసింక జనుల కిట్టి తెల్లని చర్మమున్నదా? అని యడిగెను. బాసింక జనులనగా పైచెప్పిన మిశ్రమజాతివారే. లివింగ్‌స్టన్ అప్పటమైన ఐరోపీయుడని ఆ నాయకుడు గ్రహించి, అవును, నిజమే వారికింత తెల్లనిచర్మము లేదనెను. అయినను లివింగ్‌స్టన్ ఆ పాళెగాని చేష్టలు చూచి, అంగిట బెల్లము ఆత్మలో విషమన్నట్లు అతడు దురాలోచనను మనస్సున దాచుకొని మరుసటి దినము తాము నదిని దాటబోవు సమయమున తన్ను చంపించునని ఆయన అనుమానించుకొనెను.

చీకటిపడిన తరువాత నదిని దాటి తప్పించుకొనిపోవుట యుక్తమో కాదో అని నాటిరాత్రి ఆయన మనస్సున కలిగిన ఆందోళనము ఇంతంతకాదు. ఆయన ఎప్పుడును మరణమునకు భయపడువాడు కాదుగాని ఒకవేళ తాను మృతినొందినయెడల తాను ఆఫ్రికాలో చేసిన పనియంతయు నిష్ఫలమగుననియు తాను కనుగొన్న వింతలన్నియు విఫలమగుననియు, మిగుల వ్యసనపడుచుండెను. ఈలాగు తల్లడ



పడుచు ఆయన తన బైబిలు తీసికొని, మీరు వెళ్లి సమస్త జనులను శిష్యులనుగా చేయుడి. ఇదిగో! నేను యుగసమాప్తి పర్యంతము సదాకాలము మీతోకూడ నున్నానని యేసు తన శిష్యులకిచ్చిన కడపటి యాజ్ఞను చదువుకొని, ఆహా! ఇది ఆడితప్పని ఆ మహనీయుని వాగ్దానము గదా. ఆయన నేను సదాకాలము మీతోకూడ నున్నానని చెప్పుచుండగా నేను రాత్రిలో నొక దొంగవలె తప్పించుకొని పారిపోవుట న్యాయమా? నేనాయన మాటను నమ్మి ఆలాగు చేయకుందును గాక అని నిశ్చయించుకొని వెళ్లి నెమ్మదిగా పండుకొని నిద్రపోయెను.

ఉదయమున ఆ భటసమూహము మనస్సున దురుద్దేశము పెట్టుకొని యేరు దాటుటకు పోవుచుండిన లివింగ్‌స్టన్ యొక్క చిన్నమందను చుట్టుకొనిరి. ఏటి యొద్దకు వచ్చినప్పుడు వారొకే యొక పడవను తెచ్చినట్టు కనుగొని ముందు కొందరిని పోనిచ్చి మిగతవారిని సంహరింప దలచిరని లివింగ్‌స్టన్‌గారు గ్రహించుకొనిరి. మొదట మకలోలో భటులు తమ మూటముల్లెలు పడవమీది కెక్కించి ఆవలకు తీసికొనిపోయిన తరువాత తిరిగి తెచ్చి ఎద్దుల నెక్కించుకొని ఏరు దాటించిరి. కడకు తన పరిజనులందరును ఏరు దాటి వెళ్లగా లివింగ్‌స్టన్‌గారొక్కరుమాత్రము మిగిలియుండిరి. అయినను పడవ ఆ గడ్డకు ఈ గడ్డకు తిరుగుచుండిన సమయమున ఆయన తన్ను చుట్టుకొనియుండినవారి మనస్సులను తనతట్టు కాకర్షించుకొనుటకై తన గడియారమును తెరచి దానిలో ఆడుచున్న చక్రములను వారికి చూపుచు అది టిక్

టిక్ టిక్ మని పలుకుచు గంటలు చూపుచున్నదని వారికి తెలియ
జేసెను. ఆ తరువాత జేబులోనుండి భూతద్దమును బయటికి
తీసి దానిని ఎండకు చూపి, దానిగుండ సూర్యుని కిరణములు
కాగితముమీద పడుటవల్ల కాగితము కాలునట్లు చేసి వారికి
చూపుచు, వారడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పుచు వినోదార్థ
ముగా ప్రొద్దు బుచ్చుచుండెను. అంతలో ఆయన పనివారు
ఎద్దులను సామానులను అవలి యొడ్డుకు చేర్చి ఆయనకొరకు
కాచుకొనియుండిరి గనుక ఆయన తన్ను చంపవచ్చిన భటు
లను చూచి, మీరు మా యవసరమునకుగాను పడవ నిచ్చి
నందుకు మా వందనములు. అయ్యలారా! మీకందరికి సలాము
అని చెప్పి పడవనెక్కి యేరుదాటెను.

ఏరు దాటి అయిదారుమైళ్లు దూరము సాగిపోయిన
తర్వాత వారొక అరణ్యములోని గుంపుచెట్లలోబడి పోవు
చుండిరి. ఆ చెట్లలో మూడు కారెద్దులుండెనుగాని వీరు
వాటిని చూడకయే దాటిపోయిరి. అయినను అవి వారి
వాసనను పట్టి గుంపుమీద పడి వారిని చిందరవందరగా
చెదరగొట్టెను. లివింగ్‌స్టన్ సవారి చేయుచుండిన ఎద్దు బెదరి
దౌడుతీయుచుపోగా ఆయన తన పనివారేమైనారో తెలిసి
కొనుటకు వెనుకకు తిరిగి చూచినప్పుడు ఒకడు పదియడు
గుల యెత్తునుండి నేలమీద పడుచున్నట్టు కనబడెను. కారె
ద్దులు తనపైబడినప్పుడతడు తన బరువును క్రిందపడవేసి,
తనమీదికి వచ్చిన ఆ యెద్దును తుపాకితో ప్రక్కన త్రోసెను.
తక్షణమే అది అతనిపైబడి కొమ్ములతో వతని నెత్తుకొని
ఇరవై గజములు దూరము మోసికొనిపోయి తుదకు పైకి



Page 108

ఆఫ్రికాదేశస్థులు లివింగ్‌స్టన్‌గారి గడియారమును చూచి వింతపడుట

ఎగరవేసెను. దూరమునుండి ఈ యుత్పాతమును చూచిన లివింగ్‌స్టన్ తన పనివాడు చనిపోయెనని నిశ్చయించుకొనెను గాని దగ్గరకు పోయి అతని దేహమును పరీక్షించి చూడగా అతని చర్మములో నెక్కడను ఒక గాయమైనను లేదని కనుగొని సంతోషించెను.

వారింకను తూర్పుకు సాగుచు తాము దాటిపోదలచిన ప్రదేశములలో యుద్ధము జరుగుట విని జాంబీసినది దక్షిణపుటొడ్డున దాట దలచిరి. అయినను వారప్పుడు సంచరించుచుండిన ప్రదేశములలోని జనులు బానిస వ్యాపారము చేయు దుర్మార్గులవలన క్రూరత్వమనుభవించినవారైనందున అందరినిగురించి అనుమానించుకొని లివింగ్‌స్టన్‌గూడ ఆ దుర్వ్యాపారము నిమిత్తము వచ్చెననుకొని ఆయన నడ్డగించిరి. జాంబీసినది యుత్తరపుటొడ్డుననున్న పాళెగాండ్లలో పెండి యను నొకడు పోర్చుగీనువారివలన దౌర్జన్యము ననుభవించినందున ఐరోపీయులందరిని ద్వేషించి జాతివారెవరును తన దేశములో ప్రవేశించకూడదని యాజ్ఞాపించుటమాత్రముకాక తనచేతికి చిక్కిన జాతివారందరిని సంహరించెదనని శపథము చేసికొనియుండెను. లివింగ్‌స్టన్‌గారు ఆ పాళెగాని పీడను తప్పించుకొనగోరి ఏరు దాటుటకుగాను ప్రతి గ్రామమందును పడవలకొరకు విచారించగా గ్రామపెద్దలు మొదట యిచ్చెదమని చెప్పి బొంకి కడకు ఇయ్యకపోయిరి గనుక ఆయన విధిలేక పెండి అనువాని గ్రామమునకు రావలసి వచ్చెను. పరాయివాండ్లు తమ గ్రామమునకు వచ్చినప్పుడు పాళెగాండ్లు వారికి స్వాగతమిచ్చి వారి భోజనాదుల కవసర

నైన పదార్థములను పంపుట ఆ దేశమర్యాద గనుక పెండి తన దర్శనమునకు రాకపోవుటయు తనకు సరుకలేమియు పంపకపోవుటయు చూడ, నతడు విరోధభావము ననుసరించి కీడుచేయదలచియుండెనని లివింగ్‌స్టన్‌కు విశదమాయెను. మరుసటి ఉదయమున ఆ యూరి దుండగీండ్లు ఎర్ర బావుటాల నూపుచు, ఈటెల నాడించుచు, భయంకరముగా కేకలు వేయుచు, లివింగ్‌స్టన్ యొక్క మఖాముకువచ్చి ఆయన డేరాకెదురుగా అగ్నిగుండము వేసి దానిచుట్టు ఎగురుచు, ఆ మంటలో నేదో ఒక మాంత్రిక శక్తిగల మందులను వేసిరి. ఆ మందు ప్రభావమువలన లివింగ్‌స్టన్‌కు తప్పక కీడు కలుగునని వారు నమ్మి తమ యాచారమును ముగించి తిరిగి పెండియొద్దకు పోయిరి. ఇంతలో పెండియొక్క యుద్ధశూరులు ఆయుధములు చేతపట్టుకొని లివింగ్‌స్టన్ యొక్క శిబిరమును చుట్టుకొనియుండుట చూచి మకలోలో వారు వారిని ఎదిరించుటకు తమకు సెలవిమ్మని ఆయనను వేడుకొనిరి. ఏనుగులను వేటాడి చంపు విషయములో మేము ఏపాటి ధైర్యముగలవారమో మీరెరుగుదురుగదా. కొండను మ్రింగేవానికి గోపురములడ్డమా అన్నట్టు, తాము సెలవిచ్చితిరేని ఈ పిరికిపందలమీద మా పరాక్రమము చూపెదమని పౌరుషముగా మాట్లాడిరి. అయినను ప్రాణము కాపాడవలయునేగాని ప్రాణమును తియ్యకూడదను నది లివింగ్‌స్టన్‌గారి చట్టము గనుక సుడిగాలివలె రేగుచుండిన తన పరివారమును సముదాయించి, పెండియొక్క భటులలో నిద్దరిని పిలిచి, చెరియొక బహుమానమిచ్చి, ఇది మీ యజమా



నునియొద్దకు తీసికొనిపోయి, ఆయనకు నా సలాములు చెప్పి, నేను జగడమునకు రాలేదనియు శాంతముగా పోవలెనని యున్నాననియు తెలుపుడని వారిని పంపెను. వారు పోయిన కొంతసేపటికి వెంట్రుకలు నెరసిన ఇద్దరు వృద్ధులు లివింగ్‌స్టన్‌గారియొద్దకు వచ్చి ఆయనను చూచి, మీరెవరు? అని తిరస్కారభావముతో నడుగగా ఆయన, నేను ఆంగ్లదేశస్థుడనని ప్రత్యుత్తరమిచ్చెను. అందుకు వారు ఆంగ్లేయులనగా నెవరో మేమెరుగము. మీరు మాతో జగడమాడుచుండిన మొజుంగువారని యనుకొంటిమనగా, లివింగ్‌స్టన్ తన కోటును విప్పి, రొమ్ముననున్న చర్మమును వారికి చూపించి, మొజుంగుల కీలాటి తెల్లనిచర్మముండునా అని యడుగగా వారు, లేదు, లేదు. ఇంత తెల్లని చర్మమును మేమిదివరకు చూడలేదనుచు కొంచెముసేపు ఆలోచించి, ఆహా! మీరు నల్లవారిని ప్రేమించెడి తెల్లవారేమోగదా అని యడుగగా లివింగ్‌స్టన్, అవును, అదే మా జాతియని నవ్వుచు పలికెను.

అంతట లివింగ్‌స్టన్‌గారి పరిజనుల ముఖ్యుడు పెండియొద్దకు పోయి, ఏరు దాటుటకు లివింగ్‌స్టన్‌గారికి సహాయము చేయుమని అడుగుకొనగా, నతడా దురుద్దేశమును వదలి, మీ దొరకు ఈ దోవ చాలా కష్టమైనది. ఇంకొక చోట నదిని దాటిపోయినట్లయితే బాగుండును. అదికూడ జేట్టెకుదగ్గర అని చెప్పగా ఆ పనివాడు, అది వాస్తవమేగాని మేము నదిని దాటిపోవుటెట్లని అడుగగా పెండి, మీరు దాటిపోయెదరు లెండి అని చెప్పుటవలన నతడింకేమియు ఆటంకము

చేయుడని ఆ పనివాడు గ్రహించుకొని లివింగ్‌స్టన్‌గారియొద్దకా సంతోషకరమైన వర్తమానము తీసికొనిపోయెను.

మరునాడు పెండి వారికి అవసరమైన పడవలనిచ్చి, వారు ఏరు దాటుటకు సహాయముచేసి వారిని సంతోషముగా సాగనంపెను. లివింగ్‌స్టన్‌గారి శాంతస్వభావముచేతనే పెబ్బులివంటి ఆ నాయకుడు గొర్రెపిల్లయంత సాధువాయెను, సింహములవంటి అతని సిపాయీలు పిల్లులంత నిమ్మళులైరి.

వారు జాంబీసి నదియోరను ప్రయాణము చేయుచుండగా బత్తెము కొనుటకు రొక్కములేనందున గ్రామములు తప్పించుచు అడవిలో తమకు కనబడే పక్షులను మృగములను వేటాడి చంపి ఆహారము చేసికొనుచు వెళ్లుచుండిరి. కొన్నాళ్లవరకు పనివారికి మాంసము లేకుండినందున వారొక ఏనుగును కనుగొని వేటాడి చంపిరి. అయితే అది చాలా పెద్ద పోతైయుండినందున అది వారికి మూడు నాలుగు దినములవరకు సరిపోయెనుగాని దాని మాంసము ఉష్ణమునకు చెడి వాసనకొట్టుచుండెను. ఆ ప్రదేశములోని కొర్నాసిగండ్లు ఆ వాసనను పట్టి గుంపు గుంపులుగా వచ్చి వారి మఖాము చుట్టుకొని ఎవరికిని నిద్రపట్టకుండునట్లు అరచుచుండెను. కొర్నాసిగండు కూత మనుష్యుడు పక పక నవ్వినట్లుండును గనుక లివింగ్‌స్టన్ మకలలోలోవారిని చూచి, ఆ మృగములెందు కట్లు నవ్వుచున్నవని పరిహాసముగా నడుగగా వారు, అంత పెద్దయేనుగు మాంసము మనము తినలేక తమకు మిగిలించవలసియుండునని యెరిగి నవ్వుచున్నవనిరి.



వారిప్పుడు పోర్చుగీసువారి పరిపాలనలోనుండిన ప్రాంత్యమును సమీపించుచుండిరి గనుక కొంతకాలములోపలనే తమ కష్టప్రయాసములు తీరునని వారెదురుచూచుచుండిరి గాని ఇంకను ఎనిమిదిమైళ్లదూరములో నుండగానే లివింగ్‌స్టన్‌గారు జ్వరముతో పడి అడుగెత్తిపెట్టలేక మంచమెక్కవలసివచ్చెను. ఆయన చాలా దినములనుండి యెండబాధ సహించి సరియైన భోజనములేక చాలా ప్రయాసపడియుండి మిగుల బలహీనుడాయెను. ఆయన మఖాము చేసియుండిన స్థలమునకు ఎనిమిది మైళ్ల దూరములోనుండిన టేట్టె యను గ్రామములో పోర్చుగీసు దొరతనమువారి యుద్యోగస్థుడు కాపురముండెను గనుక లివింగ్‌స్టన్ లోవాండలోని ప్రధాన సంఘాధ్యక్షుడు తనకిచ్చిన సిఫారసు ఉత్తరములను ఆ యుద్యోగస్థునియొద్దకు పంపి తన దురవస్థనాయన కెరింగించి సహాయముకొరకు వేడుకొనెను. మరునాటి రాత్రి రెండు గంటలవేళప్పుడు టేట్టెలోని యుద్యోగస్థుడు పంపిన పటాలము లివింగ్‌స్టన్‌నొద్దకు రాగా మకలోలోవారు జడిసి లివింగ్‌స్టన్‌గారిని లేపి, స్వామీ! పగవారు మనలను చుట్టుకొనియున్నారు. మనమిప్పుడు బోనులో చిక్కిన ఎలుకలవలె నున్నామని మొరలిడగా ఆయన కష్టముతో లేచి, ఆ సైన్యాధిపతిదగ్గరకు పోయి ముచ్చటించిన మీదట వారు టేట్టె గ్రామస్థులనియు, అక్కడి యుద్యోగస్థుడు పంపిన తిండి బండములను తెచ్చియుండిరనియు తెలిసికొని బహుగా సంతోషించెను. ఆ యుద్యోగస్థుడు భోజనపదార్థములను సమృద్ధిగా పంపియుండెను గనుక ఇన్నాళ్లనుండి కడుపునిండ భోజనము

చేయని మన కథానాయకుడు ఈనాటికి కడుపార తిని కన్నులార నిద్రించి కొంచెము ప్రాణము తెప్పరిల్లినవాడాయెను. ఆకలి రుచియెరుగదు నిద్ర సుఖమెరుగదన్నట్టు కండ్లు మూసికొని కడుపార తినిన మన లివింగ్‌స్టన్‌గారు తానేకాలమందైనను అంత మనోహరముగా విందారగించలేదని యనుకొనుట అతిశయోక్తి కాదు.

తెల్లవారగానే లివింగ్‌స్టన్‌గారు ఆ సైన్యాధిపతులతో బయలుదేరి ఎనిమిదిమైళ్ల దూరముననుండిన టేటెకు పోయెను. అక్కడనుండిన పోర్చుగీసు దేశాధిపతి లివింగ్‌స్టన్ యొక్క బలహీనతకు మిగుల పరితాపపడి, ఆయనను పరామర్శించి, ఆయన పరివారమునకవసరమైన సౌకర్యములన్నియు ఏర్పాటు చేసి, వారికి బస చూపి, అన్ని విధముల వారిని విచారించెను. లివింగ్‌స్టన్ సముద్రతీరముననుండిన కిలిమానెయను ఓడరేవుకు పోవలెనని యుండెనుగాని ఆ యుద్యోగస్థుడు కిలిమానెలో కాలము బాగాలేదని యెరిగి లివింగ్‌స్టన్‌గారొక నెలదినములు తన యింటనే బసచేసి పోవలెనని యోచన చెప్పి ఆ ప్రకారము తగు ఏర్పాట్లు చేసెను.

లివింగ్‌స్టన్‌గారెప్పుడును ఇతరుల మేలు కోరువాడై యుండి తనతోకూడ వచ్చిన మకలోలోవారి క్షేమమును గురించి జాగ్రత్తగా విచారించి వారిని సోదరభావముతో చూచెను గనుక వారిని విడిచిపోవలసియుండుటనుబట్టి వారి సుఖక్షేమములవిషయమై మిగుల శ్రద్ధ వహించుకొని, వారి జీవనార్థమై భూములు ఇప్పించి, వాటిని వ్యవసాయము చేసికొనునట్లు వారికి తగు సహాయము నిచ్చెను. అది



మాత్రముకాక తమ ప్రాణములు సహితము తమకు ప్రియమని యెంచక తనతోపాటు పడరానిపాట్లు పడి, తన్ను వెంబడించినవారిని తిరిగి వారి దేశము చేర్చుట తన బాధ్యతయని యెంచి, లివింగ్‌స్టన్‌గారు తాను సీమదేశమునకు పోయి వచ్చిన తరువాత వారిని తిరిగి తమ దేశమునకు తీసికొనిపోయి ఇల్లు చేర్చుదునని మాట యిచ్చి వెళ్లెను. అయినను వారిలో కొందరాయనను విడనాడనొల్లక ఆయన వెంబడి కిలిమానె వరకు వచ్చి ఎటులైనను మమ్మును మీవెంట గొనిపోయి మా తల్లిగారి దర్శనము చేయించుమని వేడుకొనగా, ఆయన, మీకొరకు పెట్టవలసిన దోవఖర్చులు నేను భరించలేను గనుక నేను తిరిగి వచ్చువరకు మీరిక్కడనే నాకొరకు కనిపెట్టుకొని యుండుడి. నేను బ్రతికియుంటినా తప్పక మీయొద్దకు వత్తునని వారికభయమివ్వగా, వారు, ఆహా! మా యేలినవాడు చిరంజీవి గనుక మమ్మును తిరిగి సేకేలేటునొద్దకు తీసికొనిపోయి తీరును అని విశ్వాసోక్తి పలికి ఆయనయొద్ద సెలవుపుచ్చుకొనిరి. అయినను వారిలో నొకడు ఆయన ఓడెక్కవలసిన దినమువరకు ఆయనతోకూడనుండి తన్ను సీమకు తీసికొనిపోవలసినదని ఆయనను విడువక గోజాడుచుండగా లివింగ్‌స్టన్ అతని చూచి, నీవు మా దేశమునకు వస్తే చలికి తట్టుకోలేక చనిపోదువని చెప్పినప్పుడు వాడు, నేను మీ పాదారవిందముల దగ్గర చచ్చుటయే నాకు పరమభాగ్యమని బదులు చెప్పెను.

లివింగ్‌స్టన్‌గారు ఇంగ్లాండు దేశమును విడిచి ఇప్పటికి పదహారు సంవత్సరములైనది గనుకను మూడున్నర సంవత్సరములనుండి తన భార్య బిడ్డలను చూడలేదు గనుకను ఆ ఓడ మీదికెక్కినప్పటినుండి ఆయనకు క్షణమొక యుగముగా తోచెననుటకు ఏ సందేహమును లేదు.

# 7 వ. అధ్యాయము

## స్వదేశము వెళ్లుట

1856 వ సం॥ జూలైనెల 12 వ. తేదిన కిలిమానె రేవు విడిచిన యుద్ధపుటోడ ఆగస్టునెల 12 వ. తేదిన మరిషస్‌ యను దీవి చేరెను. ఆ నెల దినముల ప్రయాణములో ఆ యోడ నాయకులు లివింగ్‌స్టన్‌ విషయమై మిగుల శ్రద్ధ వహించుకొని పలు విధములుగా ఆయన కుపచారము చేసినందున ఆయన దిన క్రమేణ బాగుపడుచు బలమునొందుచు వచ్చెను. అయినను ఆ నెల దినములలోనే ఆయనకొక వ్యసనము తటస్థించెను. ఏమనిన, ఆయన పరివారమునకు నాయకుడైన సేక్వేబు ఆయనతోకూడ సీమకు పోవలెనని పట్టుపట్టి ఆయనను విడిచిపెట్ట నందున లివింగ్‌స్టన్‌ అతనిని వెంటబెట్టుకొనిపోవలసివచ్చెను. అతడు సీమదేశమునకు వెళ్లుట యుక్తముకాదనియు తిరిగి తన దేశమునకే వెళ్లుట క్షేమకరమనియు ఆయన ఎన్ని విధములుగా అతని లాలించి బోధించినను అతడు సమ్మతించనందున కడకు లివింగ్‌స్టన్‌ అతనిని విధిలేక ఓడమీది కెక్కించుకొనెను. సేక్వేబు పేరు ప్రతిష్ఠలుగాంచిన యుద్ధశూరుడేగాని జలప్రయాణ అవస్థలు బొత్తిగా నెరుగడు గనుక తుఫాను లేచి సముద్రము అల్లకల్లోలముగా పొంగినప్పుడు అతనికి ఎక్కడలేని భయము కలిగెను. ఆ భయంకర యనుభవమున కతడు తాళజాలక మనస్సు స్వాధీనములేనివాడై సముద్ర

ములో దుమికి మునిగి చనిపోయెను. ఆ యోడ కొన్నాళ్లలోపలనే మరిషస్ చేరెను.

మరిషస్‌లో కొన్నాళ్లుండిన తరువాత ఆయన మరియొక యోడెక్కి ఎర్రసముద్ర మార్గమున మధ్యధరా సముద్రమును దాటిపోవుచుండగా ఆ యోడ ఒక బండకు తగిలి బద్దలై పోవునట్లుండెనుగాని దైవకృపయను మంత్ర కవచము గలవాడగు మన కథానాయకుడు దినమొక గండము నెదుర్కొని, ఈ యపాయములోనుండికూడ తప్పించుకొని 1856 సం॥ డిసెంబరు నెల 12 వ. తేదిన సురక్షితముగా స్వదేశము చేరెను.

లివింగ్‌స్టన్‌యొక్క భార్యగారు 1852 సం॥ ఏప్రిల్ నెలలో కేప్‌టౌనులో ఓడెక్కినప్పటినుండి తన భర్తను ఎడబాసియుండుటమాత్రముగాక ఆయన అరణ్య సంచారము చేసిన మూడున్నర సంవత్సరములలో ఆమెకు వ్రాసిన యుత్తరములలో నొకటియు ఆమెకు ముట్టియుండలేదు గనుక ఆయన బ్రతికియుండేది చనిపోయియుండేది ఏ సంగతియు ఆమెకు బొత్తిగా తెలియకుండెను. కాబట్టి సుమారైదు సంవత్సరములనుండి అడుగుజాడలే లేకుండపోయిన తన ప్రాణేశ్వరుడు కంటబడగానే ఆమెకు పంచప్రాణములు తిరిగి వచ్చినట్లుండెను. ఇక నామె సంతోషమేమందుము! యమలోకమునుండి తన ప్రాణనాయకుడగు సత్యవంతుని తిరిగి సంపాదించుకొనిన సావిత్రివలె ఆమె యానందించుట ఒక ఆశ్చర్యమా? ఆయన ఇల్లుచేరిన పది దినములకు క్రిస్మస్ పండుగ వచ్చెను. అట్లుండగా వారెంత వైభవముగా ఆ పండుగ నాచరించియుందురో మన మూహించుటకూడ కష్టమే.



1840 వ. సం॥న లివింగ్‌స్టన్‌గారు గ్లాస్‌గో పట్టణమునుండి బయలుదేరినప్పుడు ఆయనతోకూడ ఓడయొద్దకువచ్చి ఆయన నాశీర్వదించి సాగనంపిన ఆయన తండ్రిగారు తన కుమారుడు ఆఫ్రికాఖండమందు చేసిన పనియంతటికిని చాలా అతిశయించుకొని తన కుమారుని నోటనే ఆ వింతైన చరిత్ర వివరములను విని సంతోషించవలెనని గంపెడాశతో కనిపెట్టుకొని ఆయన రాకడ కెదురుచూచుచుండగా లివింగ్‌స్టన్‌గారు కూడ ఇతరుల శ్లాఘనను తృణప్రాయముగ నెంచి తన తండ్రి మెప్పును పొందిన చాలునని మిగుల భ్రమ చెందియుండెను. అయినను తానొకటి తలంచిన దైవమొకటి తలంచునన్నట్లు ఆయన ఇక కొన్నాళ్లలోపలనే ఊరు చేరనైయుండగా ఆయన తండ్రి కాలధర్మము నొందెను. ఏనుగుల నెదిరించి, సింహములను సంహరించి, ఎన్నశక్యముకాని శ్రమసంకటములు సహించిన ఈ శూరుడు ఇల్లుచేరగానే తన తండ్రిని చూచు ప్రాప్తము లేకపోయెగదాయని విచారించి పెద్దపెట్టున నేడ్చెను.

లివింగ్‌స్టన్ ఆఫ్రికాకు పోకమునుపు భూగోళశాస్త్రజ్ఞులు ఆ ఖండముయొక్క మధ్యప్రదేశము నిర్జనమైన ఇసుకయెడారియని నిశ్చయించియుండగా లివింగ్‌స్టన్ నామి తటాకమును, జాంబీసి మరి యితర నదులనేకములును, విక్టోరియా సెలయేరును కనుగొని ఆ మహా జీవనది ప్రవహించు ప్రదేశములు మిగుల ఫలవంతములైనవనియు వ్యాపారమున కనుకూలమగు పదార్థములు అక్కడ సమృద్ధిగా దొరుకుననియు తెలిసికొనుటవలన ఆయన వర్ణనాతీతమైన ప్రఖ్యాతి గాంచెను.

ఈ గొప్ప విశేషములు కనిపెట్టుటవల్ల ఆయన తన దేశస్థులకు మిగుల ప్రయోజనకారియగుటనుబట్టి భూగోళశాస్త్రజ్ఞుల సమాజమువారు ఆయన పరాక్రమమునకు మెచ్చి ఆయనయెడల తమకుగల గౌరవ సన్మానములకు సూచనగా ఆయనకొక బంగారుపతక మొసంగిరి.

సువార్త ప్రచారము నిమిత్తమై తమ ప్రతినిధులను ఇతర దేశముల కంపెడి లండన్ మిషనేరి సొసైటీ సభవారు తమ ప్రతినిధులు సెలవు తీసికొని స్వదేశముచేరగా వారిని తమ దర్శనమునకు రప్పించి, వారు ఆయా దేశములందు చేసిన పనిని గురించి వారితో ముచ్చటించుట వాడుక గనుక లివింగ్స్టన్ గారి మూలముగాకూడ ఆఫ్రికాలో జరిగిన దేవుని రాజ్యకార్యమునుగురించి తెలిసికొనవలెనని వారొక సభను గావించిరి. ఆ కూటమునందు లివింగ్స్టన్ తాను సంచరించిన దేశస్థులలో ననేకులు సువార్తను బహు కుతూహలముగా వినిరనియు, దేశాధిపతులలో కొందరు, క్రీస్తు మత బోధకులు తమ ప్రాంత్యములలో వాసముచేసికొని తమ జనులకు సువార్తను బోధించవలెనని మనవిచేసిరనియు, కొందరు నాయకులు తామే తమ జనులకు క్రీస్తు మార్గమునుగురించి బోధించిరనియు వివరించగా ఆ గాఢాంధకారమయమైన ఖండమందు సువార్తను ప్రకటించుటకు కలిగిన వీలునుబట్టియు, దేవుడు తన భక్తునిమూలముగా ఆ కటిక చీకటియందు ప్రకాశింపజేసిన వెలుగునుబట్టియు వారాయన ఘనమైన నామమును కొనియాడిరి. అయినను లివింగ్స్టన్ చేయదలంచిన కార్యములకు అధికద్రవ్య మవసరమైయున్నందునను సొసైటీవారి



వరుమానము మిగుల స్వల్పమైయుండినందునను వారు వాటిని సంపూర్ణముగా అంగీకరించజాలకుండిరి గనుక ఆయన తన యత్నమును వేరుమార్గమున నెరవేర్చవలసినవాడై తన పనికి రాజీనామా ఇచ్చెను.

ఇంగ్లాండు దేశములోని లండన్ మొదలగు పట్టణములలో నొకడు పౌరత్వము గలిగియుండుట మిగుల గౌరవముగా నెంచబడును. ఆ పురజనులు ప్రసిద్ధికెక్కిన యొకని ఘనపరచగోరగా నతడు వేరొక పట్టణములోని పౌరుడై యుండినను అతని పేరును తమ పురపౌరుల పట్టీలో వ్రాసి అతనికి పౌరత్వ మొసగెదరు. అది మిగుల ఘనకార్యమైనందున నట్టి సమయమునకు ఒక బంగారు బరిణ చేయించి దానిలో పౌరుని నామజాబితానుంచి ఆయన శ్లాఘనార్థముగా నొక సనదును వ్రాసి ఆ కొలువుకూటమందు దానిని ఆ నూతనపౌరుని కొసంగి మర్యాదచేతురు. లివింగ్స్టన్ గారి పరాక్రమమునకు మెచ్చి ఆయన తన దేశమునకు మిగుల కీర్తి తెచ్చెనని నిశ్చయించిన లండన్ పట్టణస్థులు ఆయన నిమిత్తమై గంభీర సభను గావించి ఆయనకు పౌరత్వమిచ్చి ఘనపరచిరి. లండన్ పట్టణస్థులు ఆయననట్లు ఘనపరచుటను చూచి ఇతర గొప్ప గొప్ప నగరవాసులుకూడ అటులనే ఆయనను సన్మానించిరి.

ఆయన దేశప్రసిద్ధుడై యున్నాడని విక్టోరియా మహారాణిగారు తెలిసికొని, ఆయన ప్రయాణ వివరములనుగురించి వినవలెననియు ఆయనను గౌరవించవలెననియు కోరి, తన్ను దర్శించవలెనని ఆయన కాజ్ఞాపించెను. పేద కుటుంబములో పుట్టిన ఈ ఘనుడు రాజకొలువుకూటమునకు పోగా విక్టో

రియా మహారాణిగారుమాత్రముకాక ఆమెకు తదనంతరముగా రాజ్యమునకు వచ్చిన ఎడ్వర్డు యువరాజును, రాజకుటుంబమువారందరును, ప్రధానమంత్రులును ఆసన్నులైయుండి ఆయనను మిగుల మర్యాదచేసిరి. విక్టోరియా మహారాణిగారు ఆయనను కేవలము దయతో సన్మానించి, అర్ధగంటసేపువరకు ఆయన ప్రయాణవివరములనుగురించి కుతూహలముగా విని, ఆయన పరాక్రమమునకు ఆయనను మిగుల పొగడి, మిక్కుటముగా సంతోషించిరి. ఆయన మహారాణిగారితో ముచ్చటించుచు, నేను తిరిగి ఆఫ్రికా దేశమునకు పోయినప్పుడు నేను మిమ్మును దర్శించిన సంగతి ఆ దేశనాయకులతో చెప్పినయెడల వారు ఆమెగారి కెన్నియావులుండునని నన్నడుగుదురని చెప్పగా మహారాణిగారు పకపకనవ్విరి. కారణమేమనిన, ఆ దేశమందప్పుడు నాణెములు లేవు. రొక్కమున నేమో వారెరుగనే ఎరుగరు గనుక ఒకనికుండిన పశువుల మందనుబట్టియే అతడు భాగ్యవంతుడనియైనను బీదవాడనియైనను ఎంచబడును.

విద్వాంసులు, భూగోళశాస్త్రజ్ఞులు మొదలగు ప్రసిద్ధులుమాత్రమేకాక సామాన్యజనులుకూడ లివింగ్స్టన్ చేసిన అద్భుత ప్రయాణ వివరములనుగురించి వినగోరిరి గనుక అనేక గొప్పగొప్ప నగర నివాసులు ఆయన వచ్చి తమ పురములయందు ఉపన్యాసములు చేయవలెనని ఆయన నడుగుకొనిరి. ఆయన ఉపన్యసించు సమయమున ప్రజలాయనను [illegible] [illegible] చెప్పుచుండిన వినోదములను వినుటకును [illegible] కూడివచ్చుచుండిరి. [illegible] చేసిన





లివింగ్స్టన్ విక్టోరియా మహారాణిగారిని దర్శించుట

యుపన్యాసములకు మెచ్చి, ఆయనకు దండిగా ద్రవ్యమిచ్చుటకు ఉద్యుక్తులై యుండిరిగాని లివింగ్‌స్టన్‌గారు తన స్వార్థక ప్రయోజనమున కెన్నడును ఒక కాసైనను పుచ్చుకొనువాడు కాడు గనుక తాను లక్షాధికారియగుట సులభసాధ్యమై యుండినను ఆ ధనమును నిరాకరించి దరిద్రుడుగానే జీవింప నిశ్చయించుకొనెను.

తన ఉపన్యాసములలో ఆయన తాను క్రొత్తగా కనుగొనిన జనుల మర్యాదలను, వారి పరిస్థితులను, కులాచారములను గుణగతులను వివరించుటవల్ల అదివరకెవరును ఎరుగని జనుల సమాచారము దేశమంతట వ్యాపించెను. అదిగాక ఆయన తాను సంచరించిన క్రొత్త దేశముల శీతోష్ణస్థితిని గురించియు, వృక్షవర్గములనుగురించియు, జలాధారములను గురించియు, ధాన్యఫలాదులనుగురించియు, అక్కడ దొరికెడి ఇతర దేశస్థుల కుపయోగకరమగు పదార్థములను గురించియు తెలియజేయగా వర్తకులు మొదలగువారు ఆయనను బహుగా శ్లాఘించిరి. ఈలాటి వినోదములు జనుల కద్భుతములుగా తోచినను లివింగ్‌స్టన్ దృష్టికవి అంత ముఖ్యము కావు. న్యాయమైన వర్తకము మూలముగా క్రీస్తు రాజ్యస్థాపనకు మార్గమేర్పడునని ఆయన దృఢనిశ్చయుడైనందున అట్టి వ్యాపారమునకు వీలుకలుగజేయుటకే ఆయన ప్రయాసపడుచుండెను గాని దానిద్వారా తానిసుమంతైనను లాభము సంపాదించుటకు కాదు.

ఇట్లు లివింగ్‌స్టన్‌గారు లోక జ్ఞానాభివృద్ధి నిమిత్తమై ఉపన్యసించినను సత్యమార్గమెరుగని జనుల స్థితిని తెలిసికొనుట

వలన క్రీస్తు భక్తులాయన రాజ్యవ్యాపకము నిమిత్తము ఉత్సాహపూర్ణులై అనాగరిక ప్రజలకు సువార్తను తెలియజేయవలెనను ముఖ్యోద్దేశము కలిగియుండును గనుక ఆయన పలుమారు సభలో కూడివచ్చిన జనులను చూచి, ఇంకను ఎవరు నెరుగని ప్రదేశములందు వర్తకమునకును క్రీస్తు సువార్త వ్యాపకమునకును వీలుకలుగజేయుటకై నేను తిరిగి ఆఫ్రికా ఖండమునకు వెళ్లవలసినవాడను. అయినను నేను క్రొత్తగా కనుగొన్న ప్రజలమధ్య నేనుపక్రమించిన యుద్యమమును మీరు సాగించి సఫలపరచునట్లు మీ కప్పగించి వెళ్లుచున్నానని చెప్పి వారిని పలుమారు పురికొల్పెడివాడు.

పై వివరించిన కష్టప్రయాసములు చాలవన్నట్టు లివింగ్‌స్టన్‌గారు ఈ సెలవుకాలమందు తనపైన ఇంకొక భారము వేసికొనెను. ఏమనిన, తాను అజ్ఞాత ఖండమగు ఆఫ్రికాదేశమందు చేసిన యాత్రలనుగురించిన పుస్తకమును రచించుటయే. ఆ పుస్తకము మూలముగా తాను లోకప్రసిద్ధుడు కావలెనన్న ఉద్దేశముతో ఆయన దానిని రచించలేదుగాని, ఆయన అందులో వర్ణించిన వింతవినోదములనుబట్టియు, అపూర్వ సమాచారములనుబట్టియు, అనాగరిక జనుల పరిస్థితులనుబట్టియు ఆ పుస్తకమును వ్రాసిన గ్రంథకర్తను జనులు మిగుల సన్మానించిరి. ఆ వింతైన కథల పుస్తకము వేనవేలుగా అమ్మబడుటవలన లివింగ్‌స్టన్‌గారి కీర్తి వేలకొలది ప్రజల నోళ్లలో ఘోషించుచుండెను. ఆ గ్రంథమందాయన తన సంచార వివరములను వర్ణించవలసివచ్చినను అందు మూలముగా రెండు ముఖ్యోద్దేశములను నెరవేర్ప నిశ్చయించి అట్లు



వ్రాసెను. ఆయన క్రీస్తు సువార్త ప్రచారము నిమిత్తమైయే ఆఫ్రికాదేశమునకు వెళ్లెను గనుక క్రీస్తు నెరుగని జనుల స్థితినిగురించియు, వారిమధ్య సువార్త వ్యాపకమునకు కలుగు వీలునుగురించియు ఇంగ్లాండులోని క్రైస్తవ సంఘములు చక్కగా నెరిగి ఆ ఖండమందు క్రీస్తు రాజ్యస్థాపన నిమిత్తము గంభీర యత్నము చేయునట్లు ఆ పుస్తకమును రచించి ప్రచురము చేసెను. ఈ యోచన ననుసరించియే ఆయన ఇంగ్లాండులో నున్నంతకాలము క్రైస్తవ సభలలో ప్రసంగములు చేయుచు ఆఫ్రికా దేశస్థుల అజ్ఞానమునుగురించియు, మూఢభక్తిని గురించియు, వారి క్రూరాచారమువలన కలుగు కీడునుగురించియు, వారి ఆత్మీయ గాఢాంధకారమునుగురించియు వివరించి, వారిని సాతాను వశమునుండి విడిపించి క్రీస్తుకొరకు సంపాదించవలెనని తన సామర్థ్యముకొద్ది వారిని పురికొల్పుచుండెను. గాఢాంధకారమయమైన ఆ అజ్ఞాత ఖండము నీతిసూర్యుడగు యేసు రాజ్యమగునట్లు ఆయన ప్రయాసపడుచు, దానికొరకు ప్రార్థించుచు, ఇతరులను ఆ యుద్యమమునకు ప్రేరేపించుచు, ఆ గంభీర కార్యమునకు సహాయార్థముగా ఈ విశ్రుత రచనమును లిఖించెను.

ఆఫ్రికా ఖండమందు బొట్టెలబేరము చేయువారి క్రూరకృత్యములవలన కలుగు శ్రమలను, జననష్టమును చూచి ఆయన కోపావేశుడై ఆ దుర్వ్యాపారము నాపుటకై విశ్వప్రయత్నము చేసెనని మన మిదివరకే తెలిసికొన్నాము. ఆయన ఇంకను సంచారములు చేయుచు, దేశమందు ఈ దుష్టులు చేయుచుండిన దౌర్జన్యమునుగురించి తన బంధు

మిత్రాదులకు వ్రాసిన యుత్తరములందు ప్రస్తావించి ఈ ఘోర పాతకమును నివారించునట్లు వారి సహాయమును వేడెను. ఈ కిరాతుల క్రూరత్వమును తన పుస్తకముద్వారా వెల్లడిచేసి లోకములోని నీతి ప్రియులు ఈ పంచపాతకమును గ్రహించి దానిని సవరించి దౌర్భాగ్యులగు ఆఫ్రికాఖండ నివాసులను రక్షింప బూనుకొనునటుల వారిని ప్రేరేపించవలెననుటయే ఆయన తన గ్రంథమును వ్రాసిన యుద్దేశము. దేవుడాయన ప్రయత్నమును ఆశీర్వదించి ఆయన కోరినట్టే ఆ పుస్తకము మూలముగా తన భక్తాగ్రేసరులను రేపి, వారి ప్రయాసములకు ఫలితార్థముగా బానిసత్వము అంతరించునట్లు వరమనుగ్రహించెను. ఆఫ్రికాఖండమందు బానిస వ్యాపారమంతరించుటకు ఆయన రచియించిన గ్రంథమే సాధనము.

న్యాయమైన వ్యాపారమునకు వీలు కలుగజేసినయెడల బొట్టెలబేరమున కాస్పదమే లేకుండునని లివింగ్‌స్టన్ దృఢాభిప్రాయము గలిగియుండెను గనుక తిరిగి ఆఫ్రికాఖండము చేరిన తరువాత గ్రామములలోని సరకులు పెద్ద పెద్ద పట్టణములకును సముద్రమునకును వచ్చునట్లు మార్గముల నేర్పరచి తన మనోరథము నీడేర్చవలెనని నిశ్చయించుకొనెను.

క్రొత్త దేశములను కనుగొని, వాటిలో వర్తక వ్యాపారములు వృద్ధిచేసి, జనుల నాగరికముకొరకు పాటుపడు మహనీయులు సువార్త ప్రచారమునకు మార్గము సిద్ధపరచువారనుట న్యాయమే. అయినను అట్టివారు అనేక విధముల లౌక్య వ్యవహారములందు మునిగియుండక తప్పదు గనుక క్రీస్తు



సువార్తను సఫలముగా బోధించుటకై వారికి అవకాశముండదు. లండన్ మిషనేరి సొసైటీ నాయకులు తమ ప్రతినిధులు ఇతర వ్యవహారములలో తగులుకొనక దేవుని రాజ్యకార్యములోనే తమ యావచ్ఛక్తిని వినియోగించవలెనని విధించువారు గనుక లివింగ్‌స్టన్‌గారియొక్క ఆదర్శమును వారామోదించినను అట్టి కార్యమునుగురించి తాము పూచి ఇవ్వసాధ్యము కాదని ఆయనకు తెలియజేసిరి. ఆయన ఆఫ్రికా ఖండముయొక్క లోభాగములను కనుగొని అజ్ఞాత జనులకును ఇతరులకును జోక్యము కలిగించవలెనని కంకణము కట్టియుండెను గనుక మిషనేరి సొసైటివారి యాజమాన్యముక్రింద ఆ కార్యము నెరవేరదని గ్రహించి వారి కొలువుకు రాజీనామా ఇచ్చి మరియొక ఉద్యోగములో ప్రవేశించెనని ఇదివరకే తెలిసికొంటిమి. ఆయన అంతకుమునుపు ఆఫ్రికా ఖండమందు చేసిన పనినిగురించి దొరతనమువారు తెలిసికొని దక్షిణాఫ్రికాలో జరుగుచుండిన వర్తక సంరక్షణార్థముగాను వలసపోయి అక్కడ నివసించుచుండిన బ్రిటిష్‌జనుల క్షేమార్థముగాను ఆయనను అధికారినిగా నియమించి కిలిమానెయను రేవుపట్టణమందు వాసముచేయునట్లు ఆయనను పంపిరి. ఇట్టి యుద్యోగమును పొందినవారు కాన్‌సల్ అనబడుదురు. లివింగ్‌స్టన్‌గారు పరిపాలన చేయుటమాత్రమేకాక అజ్ఞాత ప్రాంత్యములను దర్శించి వాటి ఆదిభౌతిక పదార్థములను,

ఆ ప్రాంత్యములలోని జనుల గుణగతులను తెలిసికొనునట్లు వారాయన కధికారమిచ్చిరి.

1858 వ. సం॥ మార్చినెల 10 వ. తేదిన లివింగ్‌స్టన్ ఈ క్రొత్త యుద్యోగములో చేరుటకు ఓడెక్కి బయలు దేరెను.

# 8 వ. అధ్యాయము

## ఆఫ్రికాఖండ పునర్దర్శనము

లివింగ్‌స్టన్‌గారు కుటుంబ సమేతముగా ఎక్కిన యోడ కేప్‌టౌన్ చేరగా వారికొక పెద్ద సంకటము తటస్థించెను. ఏమనిన, తన భర్తతో కలిసికొని ఆయన కష్ట ప్రయాసములలో పాల్గొనవలెనని మిగుల కుతూహలముగా బయలుదేరి వచ్చిన ఆయన ప్రియపత్ని దేహ అస్వస్థతచేత తన తలిదండ్రులయొద్ద నిలిచిపోవలసివచ్చెను. ఒకరినొకరు ఎడబాసియుండుట వీరిద్దరికి ప్రాణసంకటముగా నుండినను, ఇంకను ప్రయాణముచేసినయెడల ఆమెకు తప్పక ప్రాణాపాయము కలుగునని వారు తెలిసికొని దైవ చిత్తమునకు లోబడిరి.

ఇంతకుమునుపు ఆయన తన కుటుంబమును స్వదేశమునకు ఓడెక్కించి సాగనంపుటకు కేప్‌టౌన్‌ను దర్శించినప్పుడు బూర్‌వారు ఆయననుగురించి చెప్పిన అబద్ధవార్తలను నమ్మి ఆ యూరివారాయన విషయమై అనుమానించుకొని ఆయనను నిర్లక్ష్యము చేసియుండిరి. అయితే లోకప్రసిద్ధిగాంచి, గొప్పవారివల్లను కొంచెపువారివల్లను రాజువల్లను రవణప్పవల్లను గౌరవ సన్మానములు పొందిన ఈ వీరుడు రెండవ పర్యాయము తమ గ్రామమును దర్శించగా, పులిని చూచి నక్క వాతలు పెట్టుకొన్నట్టు వారాయనకు మిగుల వైభవముగా స్వాగతమిచ్చి ఆయనను గౌరవించుటకై ఒక గొప్ప సభను గావించి, ఆయన

యుద్యమమునకు గాను వారు జమాచేసిన 12,000 రూప్యములను ఆయనకు సమర్పించిరి.

ఆఫ్రికాఖండపు మధ్య ప్రదేశముల సరకు సంబారములు ఓడరేవునకు తీసికొనివచ్చుటకు జాంబీసి నదివలన మార్గమేర్పడునేమో చూడవలెనని లివింగ్‌స్టన్‌గారు నదివెంబడి సబురుచేయగలిగిన ఒక యోడను తెచ్చియుండెను. ఆయన సాధ్యమైనంతదూరము దానిని జాంబీసి నదివెంబడి నడిపించి న్యాయమైన వ్యాపారమునకు తగిన వీలుకలుగజేయవలెనని యుద్దేశించెను. ఇంగ్లాండు దేశమందు ఆ యోడను చేసినవారు దానిని కట్టినపిదప దానిని ఆయా భాగములుగా విడదీసి ఓడకెక్కించి లివింగ్‌స్టన్‌గారి వెంటనే పంపిరి గనుక ఆ యోడ కిలిమానె చేరగానే వారా చిన్నయోడ భాగములను తిరిగి జోడింపనొడగిరి. ఆ యోడను కట్టి ముగించినపిదప ఆయన తన ప్రియపత్నికి గౌరవార్థముగా దానికి మారాబర్ట్ అను నామధేయ మొసంగెను. ఒక స్త్రీకి కుమారుడు పుట్టినప్పుడు ఆ కుమారుని పేరు అతని తల్లికికూడ పెట్టుట ఆ దేశ మర్యాద గనుక లివింగ్‌స్టన్ జ్యేష్ఠపుత్రుని పేరు రాబర్ట్ అయినందున ఆమె మారాబర్ట్ అని పిలువబడెను. కాబట్టి లివింగ్‌స్టన్ తన పత్నిని ఘనపరచగోరి ఆ చిన్నయోడకు మారాబర్ట్ అను పేరుపెట్టెను.

జాంబీసినది ఒకే ముఖద్వారముగుండగాక మైదానమునకు వచ్చిన తరువాత అనేక పాయలుగా చీలి సముద్రములో పడుచున్నది గనుక ఆ నదివెంబడి పై ప్రదేశముల వరకు ఓడను నడిపించుటకై మొదట ఆ పాయల సంగతి తెలిసికొనియుండుట కేవల మవసరము. కొన్ని పాయ



లలో నీళ్లు విశేషముగా ప్రవహించునుగాని మరి కొన్నిటిలో జలము కొద్దిగాను ముచ్చిసుక అధికముగాను ఉండుటవలన ఓడ దానిలో చిక్కుకొని మునిగిపోవును. చాల కాలము నుండి ఆ ప్రాంత్యములలో సంచారముచేసిన పోర్చుగీసువారికి ఆ పాయల సాధక బాధకములు అనుభవపూర్వకముగా తెలిసియుండెను గనుక వారు యుక్త మార్గమున తమ యోడలు నడిపించువారుగాని ఆ పాయలవెంబడి తాము మధ్య ప్రదేశములలో పట్టుకొన్న బానిసవారిని తీసికొని వచ్చెడి యోడలను నడిపించువారైనందున ఆ మార్గమెవరికిని తెలియకుండ మరుగుపరచిరి. కాబట్టి వారు తమకు తెలిసిన ఆ మార్గములను లివింగ్‌స్టన్‌గారికి చూపక ఆయనకు కాని త్రోవను చూపించిరి. అందువలన ఆయన జాంబీసి పెద్దపాయ దోవను పోక కొంగోని యనబడిన పాయవెంబడి ఓడను నడిపించెను.

ఆ ప్రాంత్యమంతయు జలమయమైనది గనుక ఎల్లయెడల పలువిధములైన చెట్లు పెరిగి యోడలోనివారికి ఆ ప్రదేశము కనబడకుండ అడ్డగించుచున్నవి. ఎక్కడ చూచినను నీళ్లు మగ్గిన గుంటలుండును గనుక జ్వరము పుట్టించు దోమలు అతి విస్తారముగా ప్రబలియున్నవి. అందువల్ల ఆ మైదాన ప్రదేశమంతయు జ్వరముల కునికిపట్టు. ఏటియొడ్డున నివసించు జనులు బురదలో నిలువైన కొయ్యలు పాతి వాటిమీద నీళ్లకు పది పదునైదు అడుగుల యెత్తున ఇండ్లు కట్టువారు. వారు తమ గ్రామములచుట్టును అరటి, టెంకాయ, మొదలగు చెట్లను నాటి వాటి ఫలములవలనను ఏటిలో తాము పట్టే చేపలవల

నను జీవనము చేయుచుందురు. లివంగ్‌స్టన్‌గారు ఓడను నీళ్లలో నడిపించుచుండగా ఒడ్డున నుండినవారు మిగుల వింతపడిరి. ఓడ కదలునప్పుడు కలిగే శబ్దమును విని వారు తమ యిండ్లలోకి పోవుటకు వేసియుండిన నిచ్చెనలు దిగి, నీళ్ల మట్టమునకు వచ్చి, అక్కడ నిలుచుండి ఆ యోడను రెప్పవాల్చకుండ చూచి ఆశ్చర్యమగ్నులగుచుండిరి. లివింగ్‌స్టన్ వారితో పరిచయము చేసికొనుటకై వారిలో కొందరిని ఓడలోకి రమ్మని పిలచెను. ఆలాగున ఓడలోకి వచ్చిన వృద్ధుడొకడు ఓడలోని వింతలన్నియు చూచి, ఓహో! ఓడ యనగా నేమో అనుకొంటిని. అది ఒక గ్రామమంత పెద్దదే. మనము మన దోనెలు చేసినట్టు దీనిని ఒక పెద్ద చెట్టులో తొలిపించినారా యేమి? అని పలికెను.

జాంబీసి నదివెంబడి ఎంతదూరమువరకు ఓడను నడిపించ సాధ్యమగునో తెలిసికొనుటకుమాత్రముకాక తాను మూడు సంవత్సరముల క్రిందట తనతోవచ్చిన మకలోలోవారితో చేసిన వాగ్దానమును నెరవేర్చుటకును ఆయన పోవుచుండెను. అయినను వారు సుమారు 200 మైళ్లు దూరము నదివెంబడి పైకి పోయిన తరువాత నీళ్లు కొంచెమైనందున మా రాబర్ట్‌తోకూడ కలిసికొనివచ్చిన యోడ నిలచిపోవలసి వచ్చెను. అక్కడనుండి లివింగ్‌స్టన్‌గారు తన యోడను మాత్రము నడిపించుచుపోయెను.

అయినను ఆ యోడవలన లివింగ్‌స్టన్‌గారికి ఆశాభంగము కలుగుచుండెను. దానివలన ఆయన అనుకొన్నంత పని జరుగకపోవుట మాత్రముకాక దానికెన్ని కట్టెలు వేసినను అది



కీచుకీచుమని ఎంతో ఆయాసముగా నడిచినట్టు శబ్దముచేయుచున్నందున ఏగతాళిగా లివింగ్‌స్టన్‌గారు దానికి సాపాటు రాముడను పేరుపెట్టిరి. కడకాయన తాను మకలోలోవారిని విడిచివచ్చిన టేట్టె గ్రామము చేరగా ఆయన రాకడ కెదురు చూచుచుండిన ఆ విశ్వాససంధులు అమితానందభరితులై ఆయనను బహు గారాబముగా సన్మానించిరి. వారు ఆయనింకేమి తిరిగి వస్తాడని మా వారు మమ్మును గేలిచేసిరే. అయితే మా దొర మాట తప్పేవాడుకాడు గనుక ప్రాణమున్నంత వరకు మేమాయనను నమ్ముతాము. నేడు మా బ్రతుకులు సఫలమైనవని వారాయన విషయమై మిక్కుటముగా సంతోషించి గంతులువేయుచుండిరి. వారిలో కొందరు తమ సంతోషము బిగబట్టుకొనలేక ఆయనను కౌగలించుకొనబోయిరి గాని, తక్కినవారు మీబోటి నల్లవారు ఆయనను ముట్టుకొంటే ఆయన బట్టలు మాసిపోవా? వద్దు. ఊరుకొనండి అని వారిని గద్దించిరి. లివింగ్‌స్టన్‌గారిని చూచుటవలన మకలోలోవారికెంత సంతోషము కలిగెనో వారిని చూచుటవలన ఆయనకు కూడ అంత సంతోషము కలిగెను గనుక ఆయన యిల్లు చేరిన తరువాత వారి క్షేమమును విచారించి గత మూడు సంవత్సరముల వివరములను తెలిసికొనుటకు వారియొద్ద చాలాసేపు కూర్చుండి సంభాషించెను. ఆయన వారెట్లున్నారు? వీరెట్లున్నారని విచారించగా వారిలో కొందరు పరగతులైనట్టు వారాయనకు తెలిపిరి గనుక ఆయన వారిని తలంచుకొని మిగుల విచారపడుచుండెను. అయితే తక్కిన

వారాయనను ఆదరించుచు, మనము ఏదో ఒక దేశములో చావక తప్పదుగదా అని చెప్పిరి.

టేట్టెయను గ్రామము మిగుల ఫలవంతమైన ప్రదేశమందు కట్టబడి పూర్వము వర్తక వ్యాపారములకు మిగుల ప్రసిద్ధికెక్కియుండెనుగాని పోర్చుగీసువారు బోట్టెలబేరము మొదలుపెట్టిన నాటనుండి ఆ ప్రదేశములోని జనులను బానిసలుగా అమ్ముటకై వారిని పట్టి గ్రామములను సమూలనష్టము గావించిరి గనుక ఆ గ్రామము కాలక్రమేణ క్షీణించి కడకు బొత్తుగా శిథిలమాయెను. ధనాపేక్షచే పోర్చుగీసువారు చేసిన దుర్ వ్యాపారమువలన జనబాహుళ్యమగు ఆ ప్రాంత్యము నిర్జన అరణ్యమాయెను.

మకలోలో వారి సుఖక్షేమము నిమిత్తము తగు ఏర్పాట్లు చేసిన తరువాత లివింగ్‌స్టన్‌గారు తిరిగి జాంబీసినది సంగతి తెలిసికొనుటకై ఓడెక్కిపోయెను. మకలోలోవారు ఆయన నెడబాయనొల్లక నీడవలె ఆయన వెన్నంటియే యుండిరి. వారు కొంతదూరము వెళ్లినతరువాత నది సమముగా ప్రవహించక పెద్ద గండ్లమధ్యను వడిగా ప్రవహించుచు బండల మీదనుండి క్రిందికి దుముకుచువచ్చినందువలన ఓడ నడవ లేక ఆగిపోయెను. ఏరు ఎంతవరకాలాగుండునో తెలిసికొనవలెనని లివింగ్‌స్టన్‌గారును ఆయన సహచరులును ఓడ దిగి ఏటియొడ్డున నడిచి యేరు లోతుగా ప్రవహించు స్థలము వరకు వెళ్లిరి. అప్పుడు ఎండకాలము గనుక ఏటిలోని నీళ్లు చాలామట్టుకు తగ్గిపోయియుండెను. ఓడ నడుచునంత లోతు నీళ్లు ఎక్కడను కనబడలేదు. అయినను వర్షాకాలమందు



వెల్లువ వచ్చినప్పుడు గుండ్లన్ని నీళ్లలో మునిగిపోయి ఓడ నడుచుటకు తగినంత జలముండునని వారు తెలిసికొనిరి. ఏటి సంగతి ఇట్లుండగా, ఉట్టి ఎక్కలేవమ్మ స్వర్గమునకెక్కునా యన్నట్లు నిమ్మళమైన నీళ్లలోనే ఇంత ప్రయాసముతో నడిచెడి సాపాటురాముడను ఓడ ఇక వెల్లువలో నడువనే నడవ నేరదని యెరిగి తమకు ఇంతకంటె బలమైన మరియొక యోడను పంపించవలెనని ఆయన సర్కారువారికి వ్రాసెను.

వారు గుండ్లెక్కుచు బండలమీద ప్రాకుచు ఏటివెంబడి పోవుచున్నప్పుడు ఒకనాడు పనివారిలో నొకడు మడుగులో పండుకొని తూగుచుండిన ఒక నీటిగుర్రమును కనుగొని దానిని వేటాడబోయెను. చప్పుడు చేసినయెడల అది తక్షణము మేల్కొని తప్పించుకొనిపోవునని అతడెరిగి ఎలుకమీదికి పిల్లిపోవురీతిని గుండ్లనడుమ ప్రాకుచుపోయి పది గజముల దూరములో నున్నప్పుడు తుపాకితో దానిని కాల్చి చంపెను.

వారా గండిని దాటి పెద్ద కొండ యడుగుకు వచ్చినప్పుడు నీళ్లు లోతుగాను నిమ్మళముగాను పారుట చూచి ఏటి ఎగువ భాగమంతయు ఆలాగున నుండుటవలన ఓడను నడిపింప సాధ్యమగునని తీర్మానించిరి. వారికి దోవచూపవచ్చినవాడు కూడ, అయ్యా! ఏటి పైతట్టు నీళ్లు లోతుగానుండి నిమ్మళముగా పారుచుండును. నేను ఈ సాలంతయు తిరిగి తెలిసికొన్నానని దృఢముగా చెప్పుటవలన వాని మాట నమ్మి, తమ యత్నము సఫలమాయెననుకొని వారు వెనుకకు మళ్లిరి.

వారు తిరుగ తమ మఖాముచేరి రాత్రిలో మంటవేసి చలికాచుకొనుచుండగా పనివారిలో నొకడు లివింగ్‌స్టన్ గారిని చూచి అయ్యా! మన మార్గదర్శి సత్యహరిశ్చంద్రుడు. గండికి పైతట్టు ఏరంతయు నిమ్మళముగా పారుచున్నదని చెప్పెనే, అదంతయు శుద్ధ అబద్ధము. ఇంకను చాలాదూరములో ఎత్తయిన ఒక సెలయేరున్నది గనుక అక్కడికి ఓడను తీసికొనిపోలేమనగా లివింగ్‌స్టన్‌గారు ఆ మార్గదర్శిని చూచి, అన్నా. అది నిజమా? అని యడిగినప్పుడు వాడు, నిజమేగాని నేను మిమ్మునక్కడికి తీసికొనిపోను. ఏనుగుగాని, నీటిగుర్రము గాని, మొసలిగాని పోలేనిచోటికి మనుష్యులెట్లు పోగలరని చెప్పెను. అయితే ఎవరైనను లివింగ్‌స్టన్‌గారిని చూచి అది నీచేతకాదు అనినయెడల అదెట్లు కాకుండపోవునో చూచెదనని ఆయన ఆ పనికి తెగించువాడు గనుక సెలయేరు అను మాట విన్నతోడనే దానిని చూచితీరవలెనని ఆయన నిష్కర్ష చేసికొనెను. ఇట్లుండగా వారందరు తామిదివరకు వచ్చిన చోటికి తిరిగి వచ్చిరి. అక్కడ ఏటికిరువైపుల మూడువేల అడుగుల యెత్తుగల కొండలవలన నేర్పడిన ఒక భయంకరమైన గండి యున్నది. ఆ కొండలలో దోవలు లేకుండుటమాత్రము కాక ముండ్లపొద లతివిస్తారము గనుక మనుష్యులు నడుచుట మిగుల కష్టము. ఒక్కొక్కచోట వారు మిగుల ఒరకాటమైన పేట్లయుంచుననే పోవలసివచ్చెను. అట్టి స్థలములలో పొరపాటున ఒకనికాలు జారినయెడల వెయ్యి అడుగులలోతున నుండిన సుడిగుంటలోపడి కొట్టుకొనిపోవుటయే వాని గతి. ఆ కొండలోని నల్లబండలు ఎండకు కాలుచుండుటవలన వట్టి



కాళ్లతో నడుచుచుండిన మకలోలోవారికి కాళ్లు భగభగ మండుచు బహు కష్టముగా తోచెను గనుక లివింగ్‌స్టన్ విషయమై వారు సణుగుకొనుచు, ఏమండయ్యా! మన దొర బహు దయాళుడనుకొంటిమే. నిజము చూస్తే ఈయన కఠినాత్ముడుగనే కనబడుచున్నాడే. కాళ్లు బొబ్బలుపోయియుండగా ఈ కాలిన బండలమీద ఎవరు నడువగలరు? ఆయనకు పిచ్చిపట్టిందని పలువిధములుగా ఆయనను నిందించుచుండిరి. కడకు వారా అద్భుత గంగను సమీపించిరి. వారు దానిని సమీపించేకొలది దాని ఘోషణవలన వారి చెవులు దిమ్మలెత్తుకొనుచుండెను. ఒక మైలు వెడల్పుగా పారుచున్న ఆ యేరు ఏబది గజముల వెడల్పుగల ఆ గండి మూతిలో దూరి పైనుండి క్రిందికి బహు ఉరవడిగా దుముకుచున్నది. ఆ సెలయేటియొక్క అద్భుత మాహాత్మ్యమునకు వారందరాశ్చర్యనిమగ్నులై యుండినను దానిని చూచినతోడనే జాంబీసి నది వెంబడి మధ్య ప్రదేశములకు ఓడపోవుట అసాధ్యమని తెలిసికొని వారు తమ యుద్యమమును చాలించిరి.

ఇటువంటి జాంబీసినది సముద్రములో పడకుండ చేయవలెనని మనము దాని కడ్డముగా కట్టకట్టినను అది యేటో ఒక దోవచేసికొని పోయి తప్పక సముద్రములో పడితీరును గదా. మన లివింగ్‌స్టన్‌గారి స్వభావముకూడ ఈ జాంబీసినదివంటిదే. అందువల్ల తానుద్దేశించిన విధమున తన యత్నము నెరవేరకపోవుట చూచి ఆయన వేరొక విధమున దానిని సఫలపరచ నిశ్చయించుకొనెను. కాబట్టి ఆయన ఓడను త్రిప్పి ఏటి దిగువను చాలాదూరములో నుండిన శుపంగా యను

గ్రామముచేరి అక్కడ జాంబీసి నదిలో సంగమించు షైరే నది నెక్కిపోవలెనని నిర్ధారణచేసికొనెను. ఎందునిమిత్తము ఆయన ఈ కష్టతరమైన యాత్రలు చేయుచుండెనో మనము తిరిగి జ్ఞాపకము చేసికొనుట చాలా మంచిది. ఇదివరకే చెప్పియున్నట్లు ఆయన ఆఫ్రికాఖండమందు పడిన ప్రయాసమంతటికిని ఆయన పెట్టుకొన్న రెండు ఉద్దేశములే కారణము. అవేవనిన, క్రూరమైన బానిస వ్యాపారమును నిలుపుటకు న్యాయమైన వ్యాపారమునకు వీలుకలుగజేయుట ఆవశ్యకమనునది ఒకటి. ఆఫ్రికా క్రైస్తవులే తమ దేశమందు క్రీస్తు రాజ్యమును స్థాపించవలెను గనుక వారిని ఆ గంభీర పనికి సిద్ధపరచు యిరోపీయులు నివసించదగిన ఆరోగ్య ప్రదేశమును కనుగొనవలెననునది రెండవది. షైరే నది జన్మస్థానమగు మీదభూమి అట్టి ప్రదేశమేయని ఆయన భావించుకొన్నందున ఆయన ఆ నదిపైకి పోవలెనని నిశ్చయించెను.

లివింగ్‌స్టన్‌గారు తన గ్రంథమునందు బోట్టెలబేరమును బహు కఠినముగా ఖండించెనని పోర్చుగీసువారు తెలిసికొని ఆయనయెడల కార్పణ్యము వహించి, షైరే నదినిగురించి ఉన్నది ఉన్నట్టే చెప్పక లేనిపోని పురాణములు కల్పించి ఆయనను దాని వెంబడి పోకుండ చేయవలెనని ఉపాయము పన్నిరిగాని లివింగ్‌స్టన్ వారి కపటోపాయము నెరిగి వారు చెప్పిన సోదెలకు పెడచెవినిబెట్టెను.

ఆ యేటిలో నొక విధమైన తామరపువ్పము నింపారుగా మొలచి నీళ్లమీద చాపలుపరచినట్టే యుండుటవలన ఓడ నడువజాలదనియు అదివరకు దానిపైకి పోజూచినవారు పోలేక



వెనుకకు తిరిగి వచ్చిరనియు, ఏటియొడ్డుననున్న జనులు మిగుల ముష్కరులై విషములో అద్దిన అంబులను పరదేశులపై విడిచి చంపుదురనియు పలువిధముల భయపెట్టసాగిరి.

1859 సం॥ జనవరినెలలో వారు షైరే నదిపైకి పోనారంభించి కొంత దూరములోనే పోర్చుగీసువారు చెప్పినటువంటి నాచులో తగులుకొనిరిగాని దానివలన ఓడకైనను పడవలకైనను ఏ యాటంకమును కలుగలేదు గనుక వారు దానిద్వారా కొన్ని మైళ్లవరకు ప్రయాణము చేసిరి. ఆ తరువాత అది లేకుండినందున ఓడ సులభముగా నడువగలిగెను.

ఏటియొడ్డున నివసించు జనులు వీరిని చూచి, వీరు బానిస వ్యాపారము చేయువారే అనుకొని మిగుల మండిపడి వారిని వెనుకకు తరుముటకై వారిపైన అంబులు విడుచుచువచ్చిరి.

షైరే నదిపైకి కొంతదూరము ఎక్కి వెళ్లిన తర్వాత వారు ఒడ్డుననుండిన యొక గ్రామము చేరగా వారి కపాయము సంభవించునట్లుండెను. ఆ యూరికి టింగాని యను నొక వృద్ధుడు నాయకుడైయుండెను. అతడు ఆజానుబాహుడును మిగుల పరాక్రమశాలియునై యుండుటనుబట్టి ఆ ప్రాంత్యమందంతటను అతని కడ్డువచ్చువారెవరును లేకుండిరి. పోర్చుగీసువారి దౌర్జన్యమున కతడు మండిపడి, వారికైనను వారికొరకు బానిసలను పట్టుకొనివచ్చువారికైనను తన గ్రామమును దాటనియ్యకూడదని శపథము చేసికొనియుండెను గనుక లివింగ్‌స్టన్‌గారి రాకడను తెలిసికొన్నతోడనే వారా గ్రామమును దాటిపోకుండునట్లు వారిని అడ్డగించవలెనని ఆయన తన దుండగీండ్ల గుంపును పోగుచేసికొని

వారికొరకు వేచియుండి, వారి యోడ యూరి సమీపమునకు వచ్చు సరికి కేకలువేయుచు పౌరుష వాక్యములు పలుకుచు అంబులు విడుచుచుండిరి. ఇట్టి సమయమున మూర్ఖము సాధించిన ముప్పు కలుగునని లివింగ్‌స్టన్‌గారెరిగి టింగాని మాటను ధిక్కరించ లేక ఓడను నిలిపి, తన పరివారమును ఓడలోనే విడిచి, చేత ఆయుధములేకుండ తానొక్కడే పడవలో కూర్చుండి దరికి నడిపించుచుండెను. పులిమీసములు పట్టుకొని ఉయ్యాల ఊగి నట్లుండిన మన లివింగ్‌స్టన్‌గారు తప్పక వారి అంబుల కాహుతియగునని తన సహచరులు తత్తరపడుచుండ ఒడ్డుననుండిన వారాయన ధైర్యసాహసముల కచ్చెరుపడి రాతి బొమ్మలవలె నిశ్చేష్టులై నిలిచిరి.

లివింగ్‌స్టన్ స్నేహభావముగా వారియొద్దకు పోయి వారికి మర్యాదచేసి వారి కుశలోపరి నడిగినంతలో వారి కోపము చల్లారి వారు బహు శాంతముగా ఆయనతో సంభాషింప దొడగిరి. లివింగ్‌స్టన్‌గారును ఆయన పరివారమును పోర్చుగీసువారని అనుకొనినందుననే వారు ఎక్కడలేని రౌద్రముతెచ్చుకొని వారిమీదికి వచ్చిరిగాని తాము ఐరోపీయులమనియు బొట్టెలబేరము చేయువారు కాక ఆ దుర్వ్యాపారము నణచ ప్రయాసపడుచున్నవారనియు ఆయన వారికి తేటపరచినప్పుడు వారు తమ ద్వేషభావమును వదలి ఆయనను చేర్చుకొనిరి. పిమ్మట ఆ నాయకుడు లివింగ్‌స్టన్‌గారిని అడ్డగించక వారికి తిండిబండములుకూడ నిచ్చి సాగనంపెను.

లివింగ్‌స్టన్‌గారు క్రీస్తు సువార్త ప్రచారము విషయమై మిగుల ఆసక్తిపరుడని ఇదివరకు తెలిసికొంటిమిగదా. ఆయన



ఎన్ని పనులలో మునిగియుండినను ఎంత కష్టదశలో చిక్కుకొనియుండినను, ఆరోగ్యముగానుండినను అనారోగ్యముగానుండినను తప్పక దైవవాక్యము చదివి ధ్యానించి తన పరివారమునకుకూడ చదివి వినిపించి, దాని భావమును వారికి బోధించుచుండెడివాడు. ఆఫ్రికా ఖండము నావరించియుండిన గాఢాంధకారమును తొలగించుటకు నీతిసూర్యుడగు యేసు సువార్త కిరణములే సాధనమని యెంచి ఆయన ఈ యాత్రలో కూడ ఆ పద్ధతి ననుసరించెను.

వారు టింగాని గ్రామము విడిచిన తరువాత బహు రమ్యమైన ప్రదేశములో ప్రయాణము చేయుచుండిరి. దానిలో ఫలవృక్షములును అడవి చెట్లును విశేషముగా మొలిచి పెరిగి యుండుటమాత్రముగాక అక్కడ పలువిధములైన జంతువులు మెండుగా నుండెను. ఎవరైనా సర్కస్‌వారు మన యూరికి రెండుమూడు ఏనుగుల తీసికొనివచ్చినయెడల మన మెంతో సంభ్రమముతో వాటిని చూడగోరుదుముగదా. అట్లుండగా వారు శైరే నదివెంబడి పోవుచున్నప్పుడు ఒక నాడు ఒక గొప్ప బాడవలో 800 ఏనుగుల గుంపును చూడగా వారి యాశ్చర్య మేమనవచ్చును! అదిమొదలుకొని వేటగాండ్లు ఏనుగులను విశేషముగా చంపుచువచ్చినందున ఇప్పుడు ఆఫ్రికా ఖండమంతయు వెదికినను 800 ఏనుగులు కనబడుటకూడ కష్టమేమో. లివింగ్‌స్టన్‌గారి పరివారము ఆ యేనుగులను వేటాడి ఒక గున్నను పట్టుకొనిరి. అప్పటికి ఇంగ్లాండు దేశమునందు ఆఫ్రికా దేశపు టేనుగులు లేవు గనుక లివింగ్‌స్టన్‌గారు ఆ పిల్లను విక్టోరియా మహారాణి

గారికి కట్నముగా పంపించనుద్దేశించెనుగాని పాపము! మకలోలోవాడొకనాడు చేయి జారి దానిని గాయపరచినందున అది చచ్చిపోయెను.

ఇప్పటికి చాలా పాతగిలియుండిన సాపాటురాముడను ఓడను నడిపించుట మిగుల ప్రయాసకరమైయుండినను వారు జాంబీసి నదినుండి దానిని ఇన్నూరు మైళ్ల దూరమునకు తీసికొనిపోయిరిగాని నదిలో ఒక యెత్తయిన జలపాతమునకు వచ్చినప్పుడు వారు ముందుకు సాగలేక వెనుకకు తిరిగిరి. లివింగ్‌స్టన్‌గారు తన కనేకవిధముల సహాయముచేసిన తన స్నేహితునికి జ్ఞాపకార్థముగా ఆ సెలయేటికి మర్చిసన్ ఫాల్స్ అని పేరుపెట్టెను. వారా గంగకు దిగువను తమ యోడను నిలిపి, కాలి నడకను ఇంకను ఎగువకు పోవలెనని ఉద్దేశించిరిగాని ఆ ప్రాంత్యపువారు వారియెడల విరోధ భావము కనుపరచి వారి నెప్పుడును వేగుచూచుచుండినందున అప్పటికి సాగిపోక వెనుకకు వెళ్లుట యుక్తమని తీర్మానించుకొని తిరిగి ఈసారి వచ్చినప్పుడు వారు తమ్ము నడ్డగించకుండునట్లు ఆయన ఆ ప్రాంత్యముల పాళెగాండ్లకు వర్తమానమును బహుమానములను పంపి తిరిగి ఓట్టెకు వెళ్లెను.

వారు కొన్ని దినములుమాత్రము ఓట్టెలో గడిపి, ప్రయాణమున కవసరమైన భోజన సామగ్రులు సమకూర్చుకొని తిరిగి శైరేనదిపైకిపోవ బయలుదేరిరి. మొదటి ప్రయాణములో తాము కనుగొన్న సెలయేరువరకు ఓడను నడిపించిన తరువాత వారు కాలినడకను కొంత ప్రదేశము దాటవలసివచ్చెను. ఆ మైదానమున సంచరించుచున్నప్పుడు



ఒకనాడు మకలోలోవారు వంట చేయుచుండగా వారి అజాగ్రత్తచేత గడ్డికి నిప్పంటుకొనెను. ఆ మంట వెంటనే వ్యాపకమైనందున గడ్డిలో సంచరించుచుండిన అడవి జంతువులు ప్రాణములు దక్కించుకొనుటకు నల్దిక్కులను పరుగులిడుచు వచ్చెను. అగ్నిలోనుండి మహా రౌద్రముతో వచ్చుచుండిన యొక కారెనుము అక్కడనుండిన ఒక యావనుని చూచి, రంకెలు వేయుచు వానిని తరుముకొనుచు రాగా వాడు భయావిభ్రాంతచేతస్కుడై ప్రాణము దక్కించుకొనుటకై ఇర్రిపోతువలె పరుగెత్తుకొనుచుపోయి యేటిలో దుమికెను. వారా మైదానమును దాటి సుమారు 9,000 అడుగుల యెత్తుగల కొండల వరుసను ఎక్కి కొంత దూరమున నుండిన శిర్వా యను సరస్సును కనుగొనిరి. అంతకుముందు ఐరోపీయులెవరును ఆ తటాకమును చూచియుండలేదు. అది డెబ్బదిమైళ్ల పొడవును ఇరువదిమైళ్ల వెడల్పునుగలదై జంబు, పాచి, తామర మొదలగువాటితో కప్పబడియుండుటచే ఓడల రాకపోకలకు ఉపయోగపడునదికాదు. అయినను ఈ సరస్సును మొట్టమొదట తానే కనుగొన్నందుకు లివింగ్‌స్టన్‌గారు అపరిమితముగా ఆనందించినను ఇంకా ఉత్తరమునకు పోయేకొలది దానికంటె ఎన్నోరెట్లు పెద్దదగు మరియొక సరస్సున్నదని ఆ సరస్సు ఒడ్డున నివసించుచున్న జనులు చెప్పినందున ఆయన తాను శిర్వా సరస్సును కనుగొనుటను అంత గొప్ప సంగతిగా నెంచక ఏలాగైనను ఉత్తరమున నున్న ఆ బ్రహ్మాండమైన సరస్సును కనుగొనవలెనని నిశ్చయించెను.

ఆ బ్రహ్మాండమైన సరస్సునుగురించి జనులు చెప్ప వినోదములు వినుకొలది దాని నెప్పుడు చూడవలెనా అను వాంఛ ఆయనలో నెక్కువగా ప్రబలుచుండెను గాని తాను అక్కడి ప్రజలతో నెళవుచేసికొనుట అంతకంటెను ప్రాముఖ్యమైన కార్యమని ఆయన ఎంచి, ఆ సరస్సు కేవలము సమీపములోనే యుండినను ఆతురపడక, జనులమధ్య సంచరించుచు వారి పరిస్థితులను కనుగొని, తాను వచ్చిన యుద్దేశమును వారి కెరింగించుచు, తాను తిరిగి వచ్చునప్పుడు వారు తన్ను సంతోషముగా చేర్చుకొని తన కార్యమునకు తోడ్పడునట్లు వారి ద్వేషభావము నణచివేసి వారితో గట్టి పరిచయము చేసికొనెను. వారీలాగు నిదానముగానే ప్రయాణమును సాగించుచు జనులకు క్రీస్తు సువార్తను ప్రకటించుచు తాము విడిచి వచ్చిన యోడను చేరి తిరిగి టేట్టెకు ప్రయాణమై పోయిరి.

లివింగ్‌స్టన్‌గారు తన యోడయొక్క మందగమనమును బట్టి దానికి సాపాటురాముడను పేరుపెట్టినట్లు మనమిదివరకే చూచితిమిగదా. అప్పటికి దాని రేకులు సందులు విడిచినందునను తుప్పపట్టి చిల్లులు పడినందునను నీళ్లు విశేషముగా లోపలికి దూరి వచ్చుటచేత దానిలోని సరకులు చెడిపోవుటమాత్రము కాక అందులో సబురుచేయువారికిని సుఖము లేకపోయెను. ఈలాగుండగా దానిని మరమ్మతు చేయుట అవసరము గనుక దానిసి గడ్డకెక్కించి, చేయవలసిన కట్టుదిట్టము చేసిన తరువాత మూడవ పర్యాయము షైరేనదిపైకి పోవుటకు సరకు సంబారము నింపి బయలుదేరిపోయిరి.



ఈసారి వారు ఆకాశగంగవరకు ఓడను నడిపించి, దానినక్కడ కట్టివేసి, సెలయేటికిపైగా నదివెంబడి ఒడ్డున కాలినడకను ప్రయాణముచేసి ఆ గొప్ప సరస్సువైపు వెళ్లి 1859 సం॥ సెప్టెంబరునెల 16వ. తేదిన దానిని కనుగొనిరి. ఆ బ్రహ్మాండమైన సరస్సు మొదట పొడకట్టగా వారాశ్చర్యనిమగ్నులై అపరిమితముగా ఆనందించిరి. ఆ తటాకమును చూచిన ఐరోపీయులలో లివింగ్‌స్టన్‌గారు మొదటివారు. న్యాస్సా అనబడు ఈ సరస్సు 300 మైళ్ల నిడివియు 40 మైళ్ల వెడల్పునుగల మంచినీళ్ల సముద్రమే. దాని లోతు 600 అడుగులు.

ఆ తటాకము చుట్టునుండు ప్రదేశము మిగుల రమ్యమైనదియు ఫలవంతమైనదియునై యున్నను అచ్చటి బొట్టెల బేరముచేయువారి దౌర్జన్య సూచనలనుబట్టి లివింగ్‌స్టన్‌గారు మిగుల చింతించి, ఎటులైనను ఆ దుష్టవ్యాపారమును అణగద్రొక్కుదునని శపథముచేసికొనెను.

పశ్చిమ ప్రాంత్యములనుండి తూర్పు రేవు స్థలములకు పోవుటకు ఈ న్యాస్సా సరస్సు వారికనుకూలమైన మార్గము. దాని యుత్తరమున నివసించు జనులు ఈ దుర్మార్గులను దాటనియ్యకపోవుటవలన వారు తమ సరకు సంబారమును పడవల కెక్కించి సరస్సు ఆవలకు తీసికొనిపోవుచుండిరి. వారా మధ్య ప్రదేశములనుండి తెచ్చిన సరకులలో దంతము ముఖ్యమైనది. ఒక యేనుగుయొక్క దంతములు సుమారు 1,200 రూపాయలు చేయును. మిగుల శ్రేష్ఠమైనవైనయెడల 1,500 రూపాయలుకూడ చేయును గనుక వాటివలన కలుగు లాభమున కాశించి అరబ్బీవారును మరి యితరాదులును

కర్ణకఠోరమైన కార్యముల కొడిగట్టుకొనిరి. వారా దంతమును రేవుస్థలములకు మోసికొనిపోవుటకు కూలివారి నేర్పరచినయెడల తమ లాభములో పాతిక భాగము వారికి కూలిగా నియ్యవలసివచ్చును గనుక జనబాహుళ్యముగు పశ్చిమ ప్రదేశములందు మనుష్యులను పట్టుకొని, వారిచేత తమ పనులు చేయించుకొని తుదకు రేవు స్థలములు చేరిన తర్వాత వారినికూడ బానిసలుగా అమ్మివేయుచుండిరి. ఆ ప్రాంత్యములద్వారా జాంజిబారను రేవు పట్టణమునకు ఒక సంవత్సరములోనే 19,000 మంది కొనిపోబడిరని తెలిసికొనగా ఆ దుష్టవ్యాపారమెంత అఘోరముగా జరుగుచుండెనో మనకు వెల్లడియగును. సుఖముగా రేవు చేరిన వారి సంఖ్యయే 19,000 లైయుండగా ఇక దోవన రాలిపోయినవారెందరని మనము విచారించగా నెట్టి భూతదయగలవారైనను ఆ దుర్మార్గులను శపించకుందురా?

అయినను లివింగ్‌స్టన్ ఈ దిక్కుమాలిన బానిసవారి శ్రమ సంకటములకు గుండెకరిగినవాడైయుండినను న్యాస్సా సరస్సును కనుగొనినందున తానా క్రూరకృత్యము నాపుటకు వీలుకలిగెనని సంతోషించెను.

న్యాస్సా సరస్సుమీద ఒక యోడను నడిపించి దానిమీద సరకెక్కించి వ్యాపారమునకు కొంచుపోవుటవలన బానిసవారితో నిక యవసరముండదు గనుక ఆ వ్యాపారము కడకు నిలిచిపోవునని తలచి ఆ తటాకముమీద ప్రయాణము చేయ టగిన యొక ఓడను పంపించవలెనని ఆయన బ్రిటిష్ దొరతనమువారికి విన్నవించుకొనెను.



న్యాస్సా సరస్సును కనుగొన్నందున తాను బానిస వ్యాపారము నణగద్రొక్క బూనుకొన్న యుద్యమము ఈ డేరునని నమ్ముచుండెను. అట్లే జరిగియుండినయెడల ఆ దుర్వ్యాపార మంతరించియుండును గాని నీతి న్యాయములను భంగపరచుటకు సాతానెప్పుడును కాచుకొనియుండును గనుక ఇప్పుడు లివింగ్‌స్టన్ తుదముట్టించనైయుండిన ఘనకార్యము మంటిపాలు చేయునట్లు ఆయన శత్రువులను రేపెను. పోర్చుగీసు ఉద్యోగస్థులు ఆ వ్యాపారమునకుగాను తమ ప్రాణము ధారపోసి, లక్షలకొలది లాభములు సంపాదించుచుండెడివారు గనుక వారు లివింగ్‌స్టన్ కార్యమునకు అడ్డకాలు వేయుచు ఆయన కార్యము సఫలముకాకుండునట్లు తమకు తెలిసిన తంత్రోపాయములన్ని పన్నుచుండిరి. ఆయన షైరే నది వెంబడి పోకుండునట్లును ఆయనకు భోజన సామగ్రులు దొరకకుండునట్లును చేయుటమాత్రముకాక ఆయనమీద పలు విధములైన అబద్ధ నేరములు మోపి సర్వత్ర ఆయనకు గౌరవభంగము కలిగించిరి గనుక ఆయన పోర్చుగీసువారి అధీనమందలి ప్రాంత్యములు విడిచి న్యాస్సా తటాకమునకు పోవుటకు వేరొక మార్గమును కనుగొన నిశ్చయించెను.

# 9 వ. అధ్యాయము

## అరబ్బీయుల క్రూరకృత్యములు

లివింగ్‌స్టన్‌గారు తానిచ్చిన మాటను దైవప్రమాణముగా నెంచుకొనువాడని మన మిదివరలో తెలిసికొంటిమి. కాబట్టి ఈ సమయమందాయన తన యనుచరులగు మకలోలోవారికిచ్చిన మాటను నెరవేర్ప నిశ్చయించుకొనెను. జాంబీసి నదిప్రయాణమునకు వెళ్లునప్పుడు ఆ యాత్ర ముగిసినతోడనే వారిని తమ స్వదేశము చేర్చుదునని ఆయన చెప్పియుండెను. శైరేనదిమీద యాత్రలు చేసినంతవరకు వారాయనకు సేవచేయుచువచ్చిరిగాని క్రొత్తయోడ వచ్చువరకు ఆయన ఇక దేశసంచారము చేయుటకు వీలు లేదు గనుక ఈ మధ్య కలిగిన విరామములో ఆయన వారిని తమ స్వదేశము చేర్చుటకు ప్రయాణమాయెను. ఆయన మునుపు దమ ప్రదేశములు దాటి వచ్చుచుండినపుడు ఆ దేశముల ప్రధానులు వారి నడ్డగించి సంహరింప జూచిరని మనము తెలిసికొంటిమిగాని ఇప్పుడైతే లివింగ్‌స్టన్‌గారి కీర్తి దేశమంతటను నలుదిక్కుల ఘోషించుచుండెను గనుక ఆయన ఈసారి ప్రయాణము చేసినపుడు ఎక్కడ వెళ్లినను జనులాయనకు గంభీర మర్యాద చేసిరి.

వారు మునుపు తాము వచ్చిన త్రోవనే తిరిగి వెళ్లుచు కొంతదూరము కాలినడకను కొంతదూరము పడవలలోను సాగిపోవుచు కాలక్రమేణ చోబి నదియు జాంబీసి నదియు కలియు చోటికి వచ్చి అక్కడనుండి పడవలమీద తమ గమ్యస్థానమగు లిన్‌యాంటి చేరిరి. అప్పటికి లివింగ్‌స్టన్‌గారి యనుచరులైన మకలోలోవారు తమ భార్యబిడ్డలను విడిచి నాలుగేండ్లైయుండెను గనుక వారి రాకడకు ఆ యూరివారెంతగా సంభ్రమపడియుందురో మనమూహించుటకూడ కష్టమే. మునుపటి ప్రయాణములో తన్ను వెంబడించి తనకు సహాయము చేసి తనయెడల ఎప్పుడును గౌరవ సన్మానములు చూపిన తన మకలోలో స్నేహితులను తిరిగి కలిసికొనుట లివింగ్‌స్టన్‌గారికి పరమానందముగా నుండెను. అయినను పాపము! ఆయన లిన్‌యాంటి చేరినతోడనే ఆయన సంతోషమునకు భంగము కలిగెను. ఎటనిన, ఆయన స్నేహితుడైన సెకెలేటు కుష్ఠరోగపీడితుడై మంచముపట్టియుండెను. రాజు, తన వ్యాధినిబట్టి జనులు తన్ను అసహ్యించుకొందురని యెరిగి ఇంటనుండి బయలువెళ్లకుండెను. అందుచేత రాజ్యకార్యములకు భంగము కలుగుటమాత్రముకాక శత్రువులు సమయము చూచుకొని రాజ్యములో తమ కిష్టమైన భాగముల నాక్రమించుకొని అతని అధికారమును ధిక్కరించిరి గనుక మకలోలో రాజ్యము క్షీణదశకు వచ్చెను. వారికి సహాయకులుగా వచ్చిన మతబోధకులు ఒకరి తరువాత నొకరు చనిపోయిరి గనుక రాజరికములేని ఆ దేశము మిగుల అల్లకల్లోలస్థితిలో నుండెను. వారి దుర్దశనుబట్టి లివింగ్‌స్టన్ మిగుల విచారపడి, వారికొరకు పాటుపడి, బుద్ధిచెప్పి, వైద్యము

పని చేసి, వారి యాత్మల ప్రయోజనమునకుగాను సువార్తను బోధించుచుండెను. అయితే ఆయన వారిమధ్య స్థావరముగా నుండలేదు గనుక తిరిగి జాంబీసి నదిమార్గమున తూర్పుకు పోవుటకై బయలుదేరెను. ముందు ప్రయాణముల కష్ట ప్రయాసములలో ఆయనతో పాల్గొన్న ఆయన యనుచరులలో కొందరు ఆయన నెడబాయలేక తిరిగి ఆయన వెంట ప్రయాణము చేసిరి.

వారు తిరిగి జాంబీసి నదివెంబడి పోయి ఉట్టి గ్రామముచేరి, ఓడకు సరుకెక్కించి కొన్నాళ్లు ప్రయాణము చేసిన తరువాత ఓడ ఇసుకలో చిక్కుకొని బద్ధలైపోయెను గనుక అంతటితో మన సాపాటురాముని కష్టము తీరిపోయెను. అయినను కలిమిలేములు కావటికుండలన్నట్లు వారు నదీ ముఖద్వారమునకు వచ్చినప్పుడు లివింగ్‌స్టన్‌గారి కొరకు ఇంగ్లాండునుంచి పంపబడిన ఒక చిన్న యోడ వచ్చి చేరినందున ఆయన సాపాటురామునిగురించిన దుఃఖము మానెను. ఈ క్రొత్త యోడపేరు పైయనీర్ అనగా దారి తీయునదని యర్థము.

ఓడను చూచి లివింగ్‌స్టన్‌గారు చాలా సంతోషించినను అంతకంటె ఎక్కువ యానందము నిచ్చిన మరియొక సంగతి జరిగెను. ఏమనిన, ఆయన ఆ యోడమీద వచ్చినవారిని చూడగా తాను మొదటినుండి పెట్టుకొన్న యోచన ఇప్పుడు నెరవేరనైయున్నదిగదా అని నమ్మి మనస్సు ఉప్పొంగినవాడాయెను. ఆయన సెలవుమీద స్వదేశమునకు పోయియుండిన కాలమందు అజ్ఞానాంధకారమందు మునిగియున్న ఆఫ్రికా



దేశ నివాసుల రక్షణనిమిత్తమై పాటుపడవలెనని అక్కడి క్రైస్తవ బృందమును ప్రేరేపించెనుగదా. ఆ ప్రేరణకు ఫలితముగా వచ్చినవారు వీరే. ఇంగ్లాండులోని ఆక్స్‌ఫర్డ్ కేంబ్రిజ్ కళాశాలల సువార్త ప్రచార సభికులు షైరేనది ప్రదేశములందు పనిచేయుటకై వీరిని ఏర్పరచి పంపిరి. బిషప్ మకెంజి యను నాయన వీరి నాయకుడు.

మకెంజి వచ్చి గమ్యస్థానము చేరగానే తన పని నారంభించుటకు తీవ్రపడుచుండెనుగాని బ్రిటిష్ దొరతనమువారు న్యాస్సా సరస్సుకు వేరొక మార్గమును కనుగొనుటకై కొందరిని ఆ క్రొత్తయోడలో పంపించుటవలన ఆయన కోరిక వెంటనే సఫలము కాకపోయెను.

పోర్చుగీసువారు తన పనికి ఆటంకములు పెట్టుచున్నందున లివింగ్‌స్టన్‌గారు వారి ప్రాంత్యములకు వెలుపల నొక మార్గము కనుగొన ప్రయత్నించుచుండెను గనుక ప్రయాణమునకు కావలసిన భోజన సామగ్రిని ఎగుమతి చేసిన తర్వాత పోర్చుగీసు ప్రాంత్యమునకు ఉత్తర సరిహద్దుగా ప్రవహించు రోవుమా యను నదియెక్కి పోవుటకై బయలుదేరిరి. వారా నది ముఖద్వారముచేరి కొంతదూరము పోయిన తరువాత నీళ్లు లోతులేనందున క్రొత్త యోడవలన వారి యత్నము నెరవేరదని వారికి విశదమాయెను. దానిని నడిపించుచుండగా అది పలుమారు అడుగు తగులుచున్నందున తుదకది ఇసుకలో చిక్కుకొని బద్దలగునని భయపడి వారా యత్నము చాలించుకొని తిరిగి జాంబీసి నదికి వచ్చి షైరే నదిని ఎదురెక్కి న్యాస్సా సరస్సుకు పోవబయలుదేరిరి. జేనెడి

ఉంటిలో మూరెడు కఱ్ఱయున్నట్లు ఓడ మిగుల బరువుగాను నీళ్లు చాలా కొంచెముగాను ఉండుటవలన అది సారిసారికి అడుగు తగులుచుండెను. ఒక సమయమున అది ఇసుకలో తగులుకొని చిక్కుకొనిపోయినందున వారు బహుగా ప్రయాసపడినను పదునైదు దినములవరకు దానిని కదలించ లేకపోయిరి. అయినను సూక్ష్మములో మోక్షమున్నట్లు వారు అతి సులభముగా మర్చిసన్ ఫాల్స్ యను సెలయేరువరకు నదియెక్కి అక్కడ ఓడ దిగి కాలినడకను ప్రయాణము చేయుచు పోయిరి.

వారా ప్రదేశమందు సంచరించుచుండగా ఒకనాడు కొంత దూరముననుండిన కొండయోరను తమ కెదురుగా నొక పెద్ద గుంపు వచ్చుచున్నట్టు కనుగొనిరి. ఆ గుంపులో పురుషులుమాత్రమేకాక స్త్రీలును పిల్లలును నుండిరి. బొట్టెలబేరము చేయు అరబ్బీవారు మారుమూల గ్రామములలో వారిని పట్టి వారు తప్పించుకొనిపోకుండ ముందు పోవువాని చేతికిని వెనుక వచ్చుచున్నవాని చేతికిని బలమైన ఇనుపగొలుసులు వేసి బంధింతురు. మరికొందరిని గొలుసులకన్న ఇంకను క్రూరమగు నొక సాధనమువలన కట్టివేసియుండిరి. ఏమనిన, పది పన్నెండడుగుల పొడుగాటి కఱ్ఱకు రెండు కొనలుగల పంగను చేసి, ఇద్దరు మనుష్యులను ఒకని వెనుక నొకని నిలువబెట్టి, వారి భుజములమీద పంగల కట్టి నుంచి, వాటి రెండు కొనలలో రంధ్రములు తొలిపించి ఆ పంగ కడ్డముగా ఇనుప కడ్డీ వేసి బిగించిరి. ఈలాగు బంధించిన మనుష్యులను అరబ్బీ గుఱ్ఱపు రౌతులు చాకములతోను



Page 152

బానిసలను కొనిపోవుట

చెర్నకోలలతోను తరుముచువచ్చిరి. లివింగ్‌స్టన్‌గారింకను దూరములో నున్నప్పుడు వారాయనను గుర్తెరుగనందున మిగుల ఆర్భాటముచేయుచు జంభాలు నరుకుచు వచ్చిరిగాని ఆయనను చూచినతోడనే గద్దకు బెదరిన కోడిపిల్లలవలె పిక్కబలము చూపి క్షణకాలములో మటుమాయమైరి.

లివింగ్‌స్టన్‌గారును ఆయన యనుచరులును ఆ దిక్కుమాలిన గుంపునొద్దకు వచ్చి వారి బంధకములు తెంపివేసి, ఆ పంగలకొయ్యలను రంపములతో కోసివేసి వారినందరిని విడిపించిరి. వారు తాము పులి నాకి తప్పించుకొన్నట్టు అనుకొని మిక్కుటముగా ఆనందించి సంభ్రమపడిరి.

బానిస వ్యాపారమువలన ఆ ప్రదేశమందు కలిగిన సర్వనాశనమునకు మన కథానాయకుడు ప్రతినిత్యము విచారపడుచుండెను. వారు దేశ సంచారము చేయుచున్నప్పుడు అక్కడక్కడ బానిస సముదాయములనుమాత్రమే కాక, మైదానములలో నెక్కడ చూచినను దోవన రాలి పోయినవారి యెముకలు కుప్పతెప్పలుగా పడియుండుటను చూచిరి. పూర్వము బహు వైభవముగా వర్ధిల్లుచుండిన గ్రామములు ఇప్పుడు నిర్జనములై నిలబడుటయు, ముందు ఫలవంతముగా నుండిన ప్రదేశము ఇప్పుడు బీడుపడియుండుటయు చూచి మన లివింగ్‌స్టన్‌గారు కన్నుల నీరు రాల్చిరి. ఈ నిర్దయాత్ముల దుర్వ్యాపారము నణచుటకు తన ప్రాణము నైనను ధారపోయుదునని శపథము చేసికొన్న మన కథానాయకుడు ఈ దుష్టులవలన కలుగుచున్న ఆపదలు బాపుమని కన్నీటితోను మహా రోదనతోను దేవుని ప్రార్థించెను.

పైదాన ప్రదేశములను నాశనము చేయుడము చాలదన్నట్లు అనావృష్టిచే అక్కడ కరువుకూడ సంభవించినందున తగిన పోషణలేక ఆ మిషనేరీలందరు మిగుల అవస్థపడుచు ఉపవాసముచేతను వ్యాధులచేతను పీడింపబడినవారైరి.

కొంతకాలములోపలనే ఆ భక్త వర్గములో ముగ్గురు ఆ ప్రదేశమందు ప్రబలియుండిన వ్యాధులకు బలియైరి గనుక బిషప్ మకెంజిగారికి ప్రతిగా వచ్చిన టోజర్ యను నాయన ఆ ప్రాంత్యము ఐరోపీయుల నివాసమున కనానుకూలమైనదని నిశ్చయించి అక్కడ ప్రారంభించిన పనిని విడిచి జాంజిబారుకు పోయి అక్కడనుంచి పని నడిపించుచుండెను.

లివింగ్‌స్టన్‌గారు ఓడను సెలయేటియొద్ద విడిచి తనతోకూడ ఒక చిన్న పడవను తీసికొనిపోయి పైయేటిలో దానికి చాలినన్ని నీళ్లు దొరుకువరకు మకలోలో పనివారితో మోయించెను. ఇట్లు వారు నలువది మైళ్ల దూరము వెళ్లినతరువాత తిరిగి పడవనెక్కి న్యాస్సా సరస్సుకు నడిపించగా అది 1861 వ. సం॥ సెప్టెంబరు నెల 2 వ. తేదిన గమ్యస్థానము చేరెను.

న్యాస్సా సరస్సు చుట్టునుండు ప్రదేశము మిగుల ఫలవంతమైనది గనుక ఆ ప్రాంత్యము జనసమృద్ధిగల గ్రామములతో నిండియుండెను. లివింగ్‌స్టన్‌గారు తన యనుచరులతోకూడ సరస్సుమీద పడవను నడిపించగా ఆదివరకెన్నడును తెరచాపలతో నడుచు పడవను చూచియుండని జనులు నూర్లకొలదిగా గట్టున కూడి వింతపడుచు, ఆ విపరీతమైన పడవకు యముని వాహనమనియు అందుండినవారికి నాగపురుషులనియు పేరుపెట్టిరి.



హిందూదేశజనులు సొగసుకని పచ్చ పొడిపించుకొనుటయు ముక్కుపోగులను చెవికమ్మలను పెట్టుకొనుటయు వాడుక గదా. అరవదేశమువారుగూడ చెవులు కుట్టించుకొని పుడకలు లక్కాకు మొదలైనవి చెవి రంధ్రములలో పెట్టుకొనుటవలన రంధ్రములు పెద్దవిగా చేసిన తరువాత, బరువైన ఉంగరములను వేసికొని, చెవి తమ్మెలు భుజములు తగులునట్లు వాటిని వ్రేలాడజేయుటను మనము చూచుచున్నాము. అట్లే ఆఫ్రికా దేశస్థుల వాడుకలు కడు విచిత్రమైనవి. న్యాస్సా సరస్సు ప్రాంత్యపు స్త్రీలు పసిబిడ్డలుగా నుండినపుడు ముక్కుకు క్రిందుగా తమ పైపెదవిని కుట్టించి, పుల్ల పుడక మొదలైనవి పెట్టి రంధ్రమును పెద్దదిగా చేసి దానిలో ఒక అంగుళము మందమును రెండంగుళముల మధ్యకొలతయుగల ఉంగరమును ఇరికించి పెట్టుదురు. ఆలాగు చేయుటవలన వారి పైపెదవి సహజముగా చిగుళ్లను కరచుకొనియుండక బల్లపరువుగా రెండుమూడంగుళములవరకు ముక్కుముందర నిక్కపొడుచుకొనియుండును.

వారిలో నొక జాతివారు తమ పైరెండు ముందర పండ్లను ఆకురాయితో రాచి పిల్లి పండ్లవలె సూదిగా చేయుదురు. వారు తమ తలవెండ్రుకలనుగూడ మిగుల విచిత్రముగా కట్టుకొందురు. ఎట్లనిన, వెండ్రుకలను పైకిలాగి నడినెత్తిమీద 9–10 అంగుళముల యెత్తువరకు కోణముగల గూడుగా నిలుచునట్లు చేయుదురు. ఆ గూడు జారిపోకుండునట్లు వెండ్రుకలకు నింపారుగా వాదు వసనాయి పట్టింతురు.

మన కథానాయకుడు దూరగ్రామముల మధ్య సంచ

రించుచున్నంతవరకు జనులాయనను సన్మానించి ఆయనయెడల స్నేహముగా మెలగుచుండిరిగాని బొట్టెలబేరము చేయు వారు తరుచుగా తిరుగుచుండెడి ప్రాంత్యపువారుమాత్ర మాయనను నిర్లక్ష్యముచేసి ఆయన తమ దుర్వ్యాపారము నణచివేయనైయున్నాడని తెలిసికొని విరోధ భావము నను సరించి ఆయన కవసరమైన భోజన పదార్థములనుకూడ నియ్యకుండిరి. తన కవసరమగు సామానులకుగాను బదులిచ్చుటకు తాను తెచ్చిన గుడ్డలు, పూసలు, అద్దములు మొదలైనవి ఆయన వారికి చూపించినను వారు బానిస వ్యాపారమునే అంతకంటె నెక్కువగా నాశించినందున ఆయన తెచ్చిన సరకులను లక్ష్యపెట్టరైరి. లివింగ్‌స్టన్ తమ కార్యమును తప్పక భంగపరచి తమ నోటిలో కరక్కాయ కొట్టునని యెరిగి వారాయన కేలాగైనను హానిచేయవలెనని కనిపెట్టియుండిరి.

లివింగ్‌స్టన్ తన అనుచరులతోకూడ న్యాస్సా సరస్సు చుట్టునున్న ప్రదేశమున కొన్నాళ్లు ప్రయాణముచేసి ఆ ప్రాంత్యముల సంగతి తెలిసికొన్న తరువాత వర్షాకాలము ఆరంభించుటవలన తిరిగి ఓడయొద్దకు పోవలసివచ్చెను. వారు ఓడెక్కి కొంగొని రేవుకొరకు సబురుచేసిన తర్వాత ఓడకుండిన లోపములచేతను ఏటిలో సంభవించిన ప్రమాదములచేతను చాలా తిప్పలుపడుచువచ్చిరి వారు బహు శీఘ్రముగా రేవు చేర నాతురపడుచుండిరిగాని ఒక చోట ఓడ అడుగు తగిలి అయిదు వారములవరకు అక్కడనుండి కదలకపోవుటచే వారు అష్టకష్టములపాలైరి. అయినను వెలుగు కొన్నాళ్లు



చీకటి కొన్నాళ్లన్నట్లు వారు దినమొక గండము గడిపి కడ తేరుచు, కడకు కొంగొని చేరిరి.

నాలుగేండ్లనుండి పలుకు తోడులేకుండ తిరుగుచుండిన లివింగ్‌స్టన్‌గారు జాంబేసి నదీముఖద్వారము చేరిన కొన్నాళ్లకే మిగుల అదృష్టవంతుడాయెననవచ్చును. ఎట్లనిన, ఒకనాటి యుదయమున ఓడలకొరకు కాచుకొనియుండినవారు దిక్చక్రమున ఒక యోడను చూచి అది ఇంగ్లాండునుండి వచ్చుచున్నట్లు దుర్బినిమూలమున తెలిసికొనిరి. అది దగ్గరకు వచ్చినప్పుడు నావికులు బావుటాల నూపి అది గార్గాన్ అను ఓడయనియు అందులో లివింగ్‌స్టన్‌యొక్క పత్నిగారు వచ్చుచున్నారనియు తెలియజేసిరి. ఆ సమాచారమును విన్నతోడనే మన కథానాయకుని యానందమేమనవచ్చును! ఆయన నాలుగేండ్ల క్రిందట ఆమెను కేప్‌టౌన్‌లో విడిచిన తరువాత ఆమె దేహక్షేమము నిమిత్తము తల్లిదండ్రులయొద్ద నుండెనుగాని అక్కడ నున్నంతవరకు బలహీనత ఎక్కువగుటచేత ఆమె తిరిగి ఇంగ్లాండుకు పోయెను.

లివింగ్‌స్టన్‌గారా శ్రవణీయ వార్తను విన్నతోడనే తన యోడను సిద్ధపరచి తన పత్నిగారు వచ్చుచుండిన యోడను ఎదుర్కొనుటకు బయలుదేరి నడియేటిలో దానిని కలుసుకొని, తన యోడమీద నామె నెక్కించుకొని అపరిమితానందముతో మిట్టిపడుచు ఆమెను దరిజేర్చెను. ఇది చాలదన్నట్లు ఆయన చాలా దినములనుండి కనిపెట్టుకొనియుండిన క్రొత్త యోడకూడ వచ్చి చేరగా ఇక ఆయన ఆనందము వర్ణనాతీతమేగదా!

అయినను కొన్నాళ్లలోపలనే ఆయన సౌభాగ్యము పోయి దౌర్భాగ్యము సంభవించెను. ఎట్లనిన, ఆ సమయమున ఆ ప్రాంత్యములలో బహు కఠిన జ్వరము ప్రబలియుండినందున లివింగ్‌స్టన్‌గారి ప్రాణేశ్వరికూడ దానితో జబ్బుపడి, మంచముపట్టి, ఆరు దినములు ప్రయాసపడిన మీదట పరుగతురాలాయెను.

ఇట్టి యుత్కృష్ట యాపదలో మునిగినవాడు గాయకుడగు దావీదువలెనే, “జలములు నా ప్రాణముమీద పొర్లుచున్నవని” (కీర్తన 69: 1) ప్రలాపించి, దేవుడు తన్ను చేయి విడిచినాడని యనుకొనుట సహజమేగాని లివింగ్‌స్టన్‌గారు, “దేవుని ప్రేమించువారికి మేలు కలుగుటకై సమస్తమును సమకూడి జరుగుచున్నవని” (రోమీ 8: 28) నమ్మి తన భారమును దేవునిమీదవేసి ఆయన తనకిచ్చిన పనిని నెరవేర్చుటయందే తన దుఃఖము బాపుకొని ఆదరణనొందెను. ఆయన అత్యవసరముగా చేయవలసిన పని యొకటుండెను. ఏమనిన, ఆయన భార్యగారు వచ్చిన యోడమీద ఆయన తన పనికొరకు తెప్పించిన చిన్న యోడకూడ వచ్చియుండెను. అయినను ఆ చిన్న యోడను ఉన్నది యున్నట్లుగా తేవల్లపడనందున మనమొక నులకమంచమును ఊడగొట్టి కట్టలుకట్టి పంపుచున్నట్టే వారా చిన్నయోడను భాగములుగా విడదీసి కట్టలుకట్టి పెద్దయోడ మీది కెక్కించి పంపిరి గనుక వాటినమర్చి ఓడను తిరిగి తయారు చేయవలసియుండెను. అందువల్ల లివింగ్‌స్టన్‌గారు చాలా దినములవరకు ఆ పనిలో తగులుకొనియుండెను.



ఆ యోడను అమర్చిన తరువాత ఆయన దానికి లేడి న్యాస్సాయను పేరుపెట్టి ముందొకసారి కొంత దూరమువరకు చూచిన రోవుమా నదిని పూర్ణముగా పరీక్షించి అది న్యాస్సా సరస్సులోనుంచి ప్రవహించునదియో కాదో తెలిసికొనవలెనని దానిని నడిపించుచు పోయెను. ఈ క్రొత్త యోడ మిగుల తేలికగా నున్నందున రోవుమా నది యాంత్యమువరకు పోవ సాధ్యమాయెనుగాని పోను పోను ఆ యేరు కొండలలో పుట్టునది గాని సరస్సునుండి వచ్చునది కాదని తెలిసికొని ఆయన ఆ యత్నము మాని తిరిగి జాంబీసి నదికి వచ్చెను.

1863 సం॥ జనవరి నెలలో ఆయన బండివెనుక దూడను కట్టినట్టు ఆ చిన్నయోడను తానదివరకు నడిపించుచుండిన పెద్ద యోడకు కట్టి తిరిగి శైరే నది పైకెక్కి పోయెను. వారు ఓడను దిగి మెట్ట ప్రయాణము చేయునప్పుడు బొట్టెలబేరము చేయువారు నాశనమొనరించిన గ్రామశేషములును వారు తరుముకొనుచు పోవుచుండిన బానిసల సముదాయములలో నుండి దోవన పడి చచ్చినవారి శల్యములును అంతటను చూచిరి. ఇదివరకే భార్య మరణమువలన మనస్సంతయు పచ్చిపుండుగా నుండిన ఆయన ఈ ఘోరమైన సంగతిని చూడగా ఆ పుండులో వ్రేలుపెట్టి కెలికినట్టుండెను. ప్రతినిత్యము ఆయన ఈ వ్యసనములో మునిగియుండెను.

ఆయన ఆ పెద్దయోడను అది పోగలిగినంత దూరము నడిపించిన తర్వాత తిరిగి చిన్నయోడను విడదీసి, మనుష్యుల చేత మోయించవలసియుండెను గనుక ఆ పని జరుగుచుండగా మన లివింగ్‌స్టన్‌గారు న్యాస్సా సరస్సునొద్దకు

పోయి దాని చుట్టు ప్రదేశమును పరీక్షించి ఎటులైనను ఆఫ్రికాఖండముయొక్క ఒకదిక్కునుండి ఇంకొక దిక్కుకు పోవు మార్గమును కనిపెట్ట ప్రయత్నించుచుండెను. అయినను తిరిగి ఆయనకు ఆశాభంగము కలిగినందున ఆ యత్నము కూడ మానుకొనవలసివచ్చెను. ఆయన ఇంకను దూరముగా నుండిన మరియొక సరస్సునొద్దకు వెళ్లి ఐరోపీయులెవరును ఇదివరకెన్నడును చూచియుండని గొప్ప ప్రదేశమును పరీక్షింప బయలుదేరు సమయమున బ్రిటిష్ దొరతనమువారు ఆ యుద్యమము చాలించి స్వదేశము చేరవలయునని యుత్తరువు సాదరుచేసినందున లివింగ్‌స్టన్ మనస్సు క్రుంగినవాడై వెనుకకు మళ్లవలసివచ్చెను.

# 10 వ. అధ్యాయము

## మరల స్వదేశమును దర్శించుట

మనమిదివరకు చూచినట్లు లివింగ్‌స్టన్ మిగుల దృఢచిత్తుడు గనుక కొంచెపాటి ఆటంకములనుబట్టి వెనుకంజ వేయువాడు కాడు. ఆయన ఏది పట్టినను అది ఉడుము పట్టే. సర్కారువారి యుత్తరువును చూడగా ఆయన పని ఇక ఆఫ్రికాఖండమున ముగిసినట్లుండెనుగాని తెగించేవానికి తెడ్డే లింగమన్నట్లు ఆయన ఏదో ఒక సదుపాయమువల్ల తన యత్నమును తుదముట్టించ తీర్మానించుకొనెను. అయినను పుల్లలులేనిది పొయ్యి మండదన్నట్లు ద్రవ్యములేనిది కార్యము కుదరదు గనుక సర్కారువారి సహాయము లేకుండుటను బట్టి ఆయన వేరొక విధముగా తన పని కవసరమగు పైకమును సేకరింపవలసియుండెను. ఆయన అందునుగురించి రెండు విధములుగా యోచనచేసికొనెను. ఎట్లనిన, తాను కట్టించియుండిన ఓడను విక్రయించి వచ్చిన ద్రవ్యముతో తన కార్యమును కొనసాగించవలెననియు, లేదా ఇంగ్లాండుకు వెళ్లి తన కవసరమగు పైకమును అక్కడ సంపాదింపవలెననియు నిశ్చయించుకొనెను.

మొదటి యోచన ప్రకారము ఆయన లేడిన్యాస్సాయను ఆ చిన్నయోడను జాంబీసి నది ముఖద్వారమునకు నడిపించ

బయలుదేరెను. యుద్ధపుటోడ యొకటి అక్కడికి వచ్చియుండెను గనుక లివింగ్‌స్టన్ ఆ యోడ నాయకునితో మాట్లాడి తన చిన్నయోడను తీసికొనిపోవుటకు వారితో కరారు చేసికొనెను. ఆ యేర్పాటు ప్రకారము ఆ యోడ నావికులు తమ యోడకు లేడి న్యాస్సాను బలమైన మోకుతో కట్టివేసి, మోజాంబీక్ అను రేవునొద్దకు తీసికొనిపో బయలుదేరిరి. ఏటి ప్రయాణమునకని కట్టిన యోడ సముద్రయాత్రకు తగినదో కాదో అని ఆయన అనుమానించుకొనుచుండెనుగాని రెండు దినములు సబురుచేసిన తర్వాత దాని యోగ్యతను కనుగొని ధైర్యము తెచ్చుకొనెను. అయినను ఆలాటి యోడకు సముద్రమెప్పుడును ప్రాణశత్రువే. ఎందుకనిన, ఒకనాడా రెండు ఓడలు క్షేమముగా సాగిపోవుచుండగా మిన్నొరిగి మీదబడినట్టు గాలివాన లేచి సముద్రమును అల్లకల్లోలము గావించినందున ఆ రెండు ఓడలకును మిగుల అపాయము కలుగునట్లుండెను. పెద్ద యోడ ఆ ఎదురుగాలి నెదిరించిపోలేక గాలికి కొట్టుకొనిపోవుచు, బండి విరిగి బల్లిమీద బడినట్టు ఆ చిన్న యోడమీద పడనైయుండుట చూచి, దయ్యాముల ముందర బిడ్డ బ్రతుకునాయని లివింగ్‌స్టన్ భయపడి తన చిన్న యోడతోకూడ నశించిపోవలసినదేగాని రక్షింపబడు మార్గములేదని ఆశలు వదలుకొనియుండెను. అయితే ఇంతలో దైవవశాన కొండవంటి ఆ పెద్ద యోడ చిన్నయోడను చరుచుకొనుచు జేనెడు దూరములో దానిని దాటిపోయెను. ఈ ఇక్కట్టు ఇట్లుండగా వాటికి కట్టియుండిన పెద్ద మోకుకూడ తెగినందున చిన్నయోడ అలాదుగా నీళ్లలో అల్లాడుచుండెను



గనుక దానిని కాపాడుటకు తిరిగి మరియొక మోకు కట్టుట కేవల మవసరమైయుండెనుగాని గాలితో నుప్పొంగుచుండిన సముద్రములో ఆలాగు చేయుట మిగుల దుర్లభమేగదా. కడకు ఆ పెద్దయోడ నావికులు ఒక పీపాయికి మోకును కట్టి దానిని సముద్రములో పడవేయుగా చిన్న యోడలోని ఒక స్వదేశ నావికుడు క్రిందులుమీదులుగా అల్లాడుచుండిన ఆ యలలలో దుమికి తాను తెచ్చియుండిన మరియొక మోకును ఆ పీపాయికి కట్టివేసెను. చిన్న యోడవారు ఆ పెద్దమోకును లాగి తమ యోడకు గట్టిగా కట్టిన తరువాత ఆ రెండు ఓడలు మోజాంబీక్ అను రేవు క్షేమముగా చేరెను.

నిత్యము నీళ్లలోనుండే ఒక పలకగాని బిందెగాని కొన్నాళ్లకు పాచిపట్టునని మన మెరుగుదుముగదా. ఆలాగే ఓడల యడుగు భాగమునకు సముద్రపు పాచి పట్టుటవలన రేవు చేరినప్పుడు నావికులు ఆ పాచి తీసివేసి దానిని శుద్ధి చేయుదురు. కాబట్టి లివింగ్‌స్టన్‌గారు మోజాంబీక్ చేరిన తరువాత తన యోడను శుభ్రముచేసి తిరిగి జాంజిబారుకు పో బయలుదేరెను. జాంజిబారులో ఓడను విక్రయించి ఆ ద్రవ్యముతో తిరిగి ఆఫ్రికాలో పని ప్రారంభింపవలెనని యుద్దేశించి దాని నక్కడికి నడిపించెను. అయినను జాంజిబారులో ఆయన యుద్దేశము నెరవేరకపోవుటవలన ఆయనకు ఆశాభంగము కలిగెను. జాంజిబారప్పుడు బానిస వ్యాపారమునకు పుట్టినిల్లైయుండెను గనుక అక్కడివారికి ఓడను విక్రయించిన యెడల వారు దానిని తమ దుర్‌వ్యాపారమునకు వినియో

గింతురని యెరిగి లివింగ్‌స్టన్‌గారు వారికిచ్చుట కొంతమాత్రమును సమ్మతింపడాయెను. తన యోడను వారికిచ్చుటకంటె అది సముద్రములో బద్దలై పోవుటయే మేలని ఆయన నిశ్చయించుకొని దానిని బొంబాయికి తీసికొనివచ్చి విక్రయించవలెనని నిష్కర్ష చేసికొనెను.

అంతటి చిన్నయోడ కింతటి దీర్ఘప్రయాణము అపాయకరమే. లివింగ్‌స్టన్‌గారు 2,500 మైళ్ల దూరములోనున్న బొంబాయికి సబురుచేయనైయున్నాడని జాంజిబారువారు తెలిసికొన్నప్పుడు, లివింగ్‌స్టన్‌కు పిచ్చిపట్టినదా యేమి? ఇతడు తప్పక నడిసముద్రములో మునిగిపోతాడు అని చెప్పుకొనిరి. అయినను లివింగ్‌స్టన్ భయమననేమో ఎరుగనివాడు గనుక ఎందరెన్ని విధములుగా ఆయనను హెచ్చరించినను ఆయన పట్టు వదలక యోడమీద సరకు సంబారమెక్కించి 1864 సం॥ ఏప్రిల్ నెల 30వ. తేదిన బయలుదేరెను. సాధారణముగా జాంజిబారునుండి బయలుదేరు పొగయోడలు 20 దినములలోపల బొంబాయి చేరునుగాని లేడి న్యాస్సా అను నీ చిన్నయోడ బొంబాయిచేరుటకు 45 దినములు పట్టెను. ఒక్కొకప్పుడు బొత్తుగా గాలిలేకుండుటచే వారు దినముల పేరట కదలకుండిరి. మరొకప్పుడు ప్రచండగాలి వీచినందున తెరచాపలన్నియు చింపిరులాయెను. అయినను ఈ చిన్నయోడ మునుగుచు తేలుచు చివరకు ఎట్లో బొంబాయి చేరెను. అక్కడనుండిన గవర్నర్‌గారును ఇతర మహనీయులును ఆయనకు గంభీరముగా స్వాగతమిచ్చి మర్యాదచేసిరి. తాను విక్రయించుటకని తెచ్చిన ఆ చిన్నయోడను ఎవరును తీసి



కొననందున ఆయన దాని నౌకరి వశముచేసి, ఇంగ్లాండుకు పోయి తిరిగి వచ్చిన తర్వాత దానిని అమ్ముదునని నిశ్చయించుకొని ఓడెక్కి బయలుదేరెను.

ఇంగ్లాండు చేరిన తోడనే ఆయన తాను ఆఫ్రికాదేశమందు చేయనైయున్న పనికి కావలసిన ద్రవ్యము సేకరించుటకు విశ్వప్రయత్నములు చేయుచుండెను. సర్కారువారు తన్ను చేయి విడుచుటవలన తాను తలపెట్టిన కార్యము తానే తుదముట్టించవలెనను దృఢనిశ్చయుడై ఆయన అందుకు కావలసిన సాధన సంపత్తుల విషయమై శ్రద్ధవహించుకొనెను.

మొదటిసారి ఇంగ్లాండులో నుండిన సమయమున ఆయన ఒక పుస్తకమును వ్రాయగా అది వేలకొలదిగా అమ్ముడు పోయెను గనుక జాంబీసినది, దాని యుపనదులు అను నంశమునుబట్టి ఈసారి మరియొక గ్రంథమును వ్రాసి కొంత ద్రవ్యము సంపాదించెను. ఆయన స్నేహితులు కొందరు పదునైదువేల రూపాయలు పోగుచేసి ఆయన చేతికిచ్చిరి. సర్కారువారును భూగోళశాస్త్ర సంఘపువారును మరి 15,000 రూపాయలు ఆయనకు సహాయముచేసిరి.

1865వ-సం॥న బ్రిటిష్‌వారు ఆయన ఆఫ్రికామధ్య ప్రదేశములందు మహారాణిగారి రాయబారియైయుండునట్లు ఆయన కుద్యోగము నిచ్చిరి. భూగోళశాస్త్ర సంఘమువారు ఆయన నైలునది యుత్పత్తి స్థానమును కనుగొనవలెనని ఆయనకు పనిపెట్టిరి.

ఆయన ఈ రెండు ఉద్యోగముల కొప్పుకొనెనుగాని తాను సర్కారు కొలువులో నుండినను ప్రభువైన యేసు

క్రీస్తు రాజ్యమును స్థాపించుట తన ముఖ్య విధియని ఆయన వారికి పరిష్కారముగా తెలిపెను. బానిస వ్యాపారమును నిర్మూలముచేయుటయు క్రీస్తు రాజ్యమును స్థాపించుటయు తాను ఆఫ్రికాలో చేయవలసిన తన ధర్మమని ఆయన తెలియజేసి ఆ యుత్తమోత్తమమైన యుద్దేశము నెరవేర్చుటకై తాను దత్తుచేసికొన్న దేశమునకు ప్రయాణమాయెను.

# 11 వ. అధ్యాయము

## అజ్ఞాతదేశ సంచారము

1864 వ. సం॥ న లివింగ్స్టన్‌గారు బొంబాయినుండి ఇంగ్లాండుకు బయలుదేరినప్పుడు తాను బొంబాయిలో విక్రయించుటకని తెచ్చిన లేడి న్యాస్సా అను ఓడను అక్కడనే విడిచిపెట్టియుండెనని మనము చూచితిమిగదా. అందువల్ల ఆయన తాను ఆఫ్రికాకు పోకముందు బొంబాయికి వచ్చి ఆ యోడను విక్రయించిపోవలెనని తీర్మానించుకొనెను. ఆ యోడను కట్టించుటలో ఆయనకు సుమారు 7 లక్షల రూపాయలు తగిలెనుగాని దాని నిప్పుడు రెండు లక్షల యాభై వేల రూపాయల కమ్మవలసివచ్చెను. ఆ నష్టమునకాయన అధికముగా చింతించినను తన యత్నమునకుగాను ఆయన కిప్పుడు ద్రవ్యము చాలా యవసరముగా కావలసియుండెను గనుక రాలినమట్టుకు గోవింద యన్నట్టు విధిలేక దానిని అమ్మివేసెను. ఇది ఇట్లుండగా గోరుచుట్టుపైన రోకటి పోటన్నట్టు ఆయన తాను సేకరించిన ద్రవ్యమును ఒక బ్యాంకులో నుంచియుండగా నది కొన్నాళ్లలోపలనే దివాలా యెత్తుటవలన కొండనువలె నమ్ముకొనియుండిన ఆ ద్రవ్యమంతటిని కోల్పోయెను.

బొంబాయి గవర్నరుగారైన సర్ బాటల్ ఫ్రీర్ ఆయన కనేక విధములుగా నుపకారముచేసి ఆయన బయలుదేరి

నప్పుడు జాంజిబారు సుల్తానుకొక సిఫారసు కాగితమును వ్రాసియిచ్చెను. అందులో ఆయన లివింగ్‌స్టన్‌గారికి సహాయము చేయవలెనని ఆ సుల్తానును ప్రేరేపించుచు, లివింగ్‌స్టన్‌గారు సబురుచేసి వచ్చిన యోడను అంగీకరించవలెనని మనవిచేసియుండెను.

లివింగ్‌స్టన్‌గారు జాంజిబారు చేరి తాను చేయబోవు ప్రయాణములో బరువులు మోయుటకును ఇతర పనులు చేయుటకును పనివారిని జమాచేయుచు తన కవసరమైన సరకు సంబారమును ఏర్పరచుకొనుచుండెను. ఆయన 36 మందిని మాట్లాడి వారితో కరారు చేసికొనెను. వారిలో పదమూడుమంది హైందవ సిపాయీలును, బొంబాయికి ఉత్తరముననున్న నాసిక యను పట్టణములోని మిషన్ పాఠశాలలో చదువుచుండిన 9 మంది పిల్లవాండ్లును, మడగాస్కర్ ద్వీప సమీపముననున్న యోహాన్న దీవివాసులు పదిమందియు, నలుగురు ఆఫ్రికా దేశస్థులు నుండిరి. ఆఫ్రికా ఖండపు మధ్య ప్రదేశములలో సెట్సీయను ఒక విధమైన విషపుటీగ ప్రబలియుండుటవలన ఆ ప్రాంత్యములలో పశువులు బ్రతుకజాలవని మన మింతకుమునుపు తెలిసికొంటిమి. పశువులకువలెనితర జంతువులకును ఈ ఈగలవలన నుపద్రవము కలుగునో లేదో కనుగొనుటకై లివింగ్‌స్టన్‌గారు మూడు గేదెలను, ఆరు ఒంటెలను, నాలుగు గాడిదెలను, రెండు కంచర గాడిదెలను ఇండియానుండి తీసికొనిపోయియుండెను. ఈ యేర్పాట్లన్నియు సరిచేసికొనుసరికి ఒక బ్రిటిష్ యుద్ధపుటోడ ఆ రేవుకు వచ్చినందున వాహనములును, పరివారమును, సామానును



దానిమీద నెక్కించుకొని లివింగ్‌స్టన్‌గారు రోవుమా నది ముఖద్వారమునకు బయలుదేరెను. అక్కడ లంగరు వేయుటకనుకూలము లేకున్నందున రోవుమా నదికి ఇరువై మైళ్ల దూరముననుండిన మికిందాని అఖాతము చేరి యోడ దిగెను.

మకలోలో పనివారు లివింగ్‌స్టన్‌గారియెదుట నెంత విశ్వాసముగలిగి ఆయన నెంత గారాబముగా సేవించిరో మనము చూచితిమిగదా. అయితే వారెంత శ్రేష్ఠులుగా నుండిరో వీరంత దుష్టులుగా నుండిరని చెప్పితీరవలెను. మొదటినుండియు ఆ సిపాయీలును యోహాన్న దీవి వాసులును ఆయన కలవిగాని తొందరయిచ్చి ఆయన ప్రాణమును విసిగించిరి. ఆయన చిన్న యోడమీద నదిపై కెక్కుచుండగా వీరు ఒడ్డున ప్రయాణము చేయుచు ఆయన తెచ్చిన జంతువులను తోలుకొని వచ్చుచు పలువిధములైన దుష్కార్యములు విచ్చలవిడిగా చేయుచుండిరి. యోహాన్నవారు తాము ప్రయాణములో దాటుచుండిన పల్లెటూళ్ల నివాసులమీద దౌర్జన్యములుచేయుచు, వారి యిండ్లు దోచుకొనుచు, తాము తోలుకొని వచ్చుచుండిన పశువులను వారి పొలములలో మేపుట మాత్రముకాక కూలి యిస్తామని నమ్మించి, వారిచేత తమ బరువులు మోయించుచు, వారిని మోసపుచ్చినందున వారు లివింగ్‌స్టన్‌గారిమీద అసూయపడునట్లు చేసిరి. వారిలో కొందరు తాము మోయుచుండిన బరువులు తగ్గించుకొనుటకై సరుకులలో కొన్ని దోవలో పారవేయుచు ఆయనకు అలవిగాని నష్టము కలిగించిరి. వారిలో నొక దుర్మార్గుడు ఇరువై పౌండ్ల తూకముగల తేయాకు పెట్టెను పగులగొట్టి

పదునైదు పౌండ్ల బరువుగల తేయాకును గడ్డిలో పార వేసెను.

మహమ్మదీయులైన సిపాయీలు జంతువులను తోలుకొని రావలసినవారైయుండగా వాటిని దారిలో క్రూరముగా హింసించుచు వాటిని తోలుకొని రావలసిన భారమును తగ్గించుటకై వాటి నొకటొకటిగా చంపుచువచ్చిరి. ఒకనాడు వారెంత సేపటికిని తన్ను ఎదిగి రాకుండినందున ఆయన వారి కొరకు పడవనాపి, సాయంకాలమువరకు కనిపెట్టుకొనియుండ వలసివచ్చెను. వారు వచ్చునప్పటికి వారు తోలుకొని వచ్చు చుండిన జంతువులలో నొక దూడ లేదని చూచి, దూడ యెక్కడ? అని ఆయన వారి నడిగెను. అందుకు వారు మేము దోవన వచ్చుచుండగా ఒక పెద్దపులి మా కడ్డమువచ్చి ఆ దూడను ఎత్తుకొనిపోయెననిరి. అప్పుడాయన, మీరా పులిని చూచితిరా అని వారి నడుగగా వారు, ఓ! మేము సాక్షాత్తుగా చూచినామని ప్రమాణపూర్వకముగా చెప్పిరి. అందుకు ఆయన, అట్లయితే పులిని చూచి మీరు పిక్కబలము చూపితిరేమో గదా అని పలుకగా, వారు ఎందుకయ్యా! మేము పసిబిడ్డలమనుకొంటిరా యేమి? దానిని చూచిన తోడనే మేము దానిమీద రాళ్లు రువ్వి బడితెలతో కొట్ట బోతిమిగాని అది చెట్ల సందున దూరి తప్పించుకొనిపోయె ననిరి. ఓహో! సరె, సరె, అది పులియైనట్లు మీరు దాని చారలనుబట్టి గుర్తుపట్టితిరా అని ఆయన వారి నడుగగా వారు, అవునవును. దాని చారలు చూచియే అది పులియని తెలిసికొంటిమనిరి. అందుకాయన, ఆహా! మీరందరు సత్య



హరిశ్చంద్రులయ్యా. మీ హిందూదేశమందుగాక లోక ములో మరే దేశమందైనను పులులు లేవని మీకు తెలియదా అని చెప్పి వారిని గేలిచేసెను.

రోవుమా నదిని విడిచిన తరువాత వారు ప్రయాణము చేసిన మైదాన ప్రదేశము సహజముగా మిగుల ఫలవంతమైన భూమియేగాని క్రూరులైన అరబ్బీయుల బానిస వ్యాపారము దానిని నిర్జనమైన అరణ్యముగా చేసియుండెను. వ్యవ సాయము చేయువారెవరును లేనందున ఆ దివ్య ప్రాంత్యము కనుచూపుమేరకు బీడుపడియేయుండెను. బోట్లైల బేరము చేయువారు ఆ ప్రాంత్యములోని జనులందరిని బానిసలుగా పట్టుకొనిపోయియుండిరి గనుక ఆ నిర్జన ప్రదేశమందెక్క డను భోజనపదార్థములు దొరకక లివింగ్స్టన్‌గారు చాలా బాధపడిరి. ఆ పంచపాతకుల ఘోరకృత్యముల సూచనలు అంతటను కనబడుచుండుటవలన ఆ మైదానమంతయు ఒక పెద్ద స్మశాన భూమిగా నుండెను. వారొకనాడు ప్రయాణము చేయుచు దోవ ప్రక్కను చెట్టుకు వ్రేలాడవేసియుండిన ఒక పీనుగును చూచిరి. ఆ స్త్రీ బలుబడలిక చెంది అడుగెత్తి పెట్టజాలకపోయినందున క్రూరకంఠకులైన ఆ అరబ్బీయు లామెను త్రాళ్లతో ఆ చెట్టుకు కట్టి పోయిరి. మరియొకనాడు పంగల కొయ్యలతో మెడలు బంధించియున్న యిద్దరు బానిస వారు నేలను పడియుండగా లివింగ్స్టన్‌గారు చూచి వారి దగ్గ రకుపోయి వారి సంగతి విచారింప యత్నించెనుగాని వారు కొర ప్రాణములతో నుండినందున నోట మాటరాక ఏ సమాచారము చెప్పలేకపోయిరి. వారింక కొంతదూరము

నడువగా ఒక పసిబిడ్డయొక్క ఎముకలు దోవలో పడియుండుటను చూచిరి. సంగతి యేమనగా, ఆ పిల్లయొక్క తల్లి దాని నెత్తుకొని అందరితోపాటు నడువలేక కొంచెము మందగమనముగా నడచుటను చూచి ఆ మృగప్రాయులు ఆమె కౌగిటిలోని ఆ బిడ్డను పెరికి దారిలో పారవేసిరి.

లివింగ్‌స్టన్‌గారు మిగుల శాంతముగలవారైయుండినను అరబ్బీయుల హేయకృత్యములను చూచి, పట్టరాని ఆగ్రహముగలవాడై ఈ దుష్టవ్యాపారము నాపుమని నిత్యము దేవుని వేడుకొనుచుండెను.

ఆ మైదానమున నాలుగు నెలలు ప్రయాణముచేసిన మీదట ఆయన తిరిగి న్యాస్సా సరస్సు చేరెను. అరబ్బీయుల రెండు చిన్నయోడ లక్కడ నుండుట చూచి ఆవలియొడ్డుకు పోవుటకు వాటిలో నొకదానిని తనకు బాడుగ కిమ్మని ఆయన వారి నడుగగా, ఆయన తమ దుష్కార్యమును భంగపరచుటకు దానిని తగలబెట్టునని భయపడి ఇయ్యనొల్లకపోయిరి. కాబట్టి విధిలేక ఆయన ఆ సరస్సు చుట్టును కాలి నడకను వెళ్లెను ఆయన తన ప్రయాణము నాపి కొన్నాళ్లిక్కడ సేదతీర్చుకొనగోరెనుగాని హిందూదేశమునుండి వచ్చిన సిపాయిల తంటాలను ఓర్చుకొనలేక వారికి జీతములిచ్చి పంపివేసెను.

ఆయన మరల తన ప్రయాణమును సాగించి సెప్టెంబర్ నెల అంత్యమున న్యాస్సా సరస్సు దక్షిణ సరిహద్దుకువచ్చి అక్కడ కనుగొన్న సంగతివలన మిగుల దుఃఖాక్రాంతుడాయెను. బొట్టెల బేరము నాపుటతోనే తన కార్యము



సిద్ధించుననని ఆయన పెట్టుకొన్న యుద్దేశము మన మెరుగుదుము. అయినను ఇదివరకాయన పడిన ప్రయాసములవలన ఆ దుర్వ్యాపారము వృద్ధిచెందెనేగాని క్షీణించలేదు. ఆయన పడరాని పాట్లుపడి ఈ దుర్వ్యాపారము నణచివేయుటకు సాధనములుగా అంతులేని అరణ్యములలో కనుగొన్న మార్గములే ఇప్పుడు వీరి వ్యాపారమున కనుకూలమాయెను.

లివింగ్‌స్టన్‌గారు ఆ సరస్సుయొక్క దక్షిణతీరము చేరిన తర్వాత తానిదివరకు చేసిన ప్రయాణ వివరములు వ్రాసిపెట్టుమట్టుకు అక్కడనే తీరుబాటుగా నుండెను. ఆయన మరల ప్రయాణమై యుత్తరముననున్న గొప్ప గొప్ప సరస్సులదిక్కు సాగిపోయెను. ఆ ప్రాంత్యములలో నరసంచారము లేకుండుటయేగాక అదియంతయు బాడువనేల గనుక వారనేకసార్లు నడుముల మట్టుకు బురదలో చిక్కుబడి నడువవలసివచ్చినందున మిక్కిలి బాధపడుచుండిరి. అయినను తల తడిపినమట్టుకు కొరిగియే తీరవలెనన్నట్టు లివింగ్‌స్టన్ తాను చేయ నుద్దేశించిన కార్యమును తుదముట్టించువరకు ఎన్ని గండములు అడ్డము వచ్చినను వెనుకతీయువాడు కాడు.

ఒకనాడు వారొక గ్రామము చేరగా ఒక నాయకుని తరపున బానిస వ్యాపారము చేయవచ్చిన అరబ్బీ మేస్త్రీ లివింగ్‌స్టన్‌గారి యత్నమును భంగపరచ నుద్దేశించి యోహాన్న కూలీల నాయకుడగు మూస అను నాయనను చాటుకు పిలిచి, ఇక్కడికి మూడామడల దూరములోనున్న యొక గ్రామమును మీరు దాటవలసియున్నది. ఆ గ్రామములోని పాళెగాడు బహు దుష్టుడు. వాడు తన పొలిమేర

లోపల అడుగుపెట్టిన పరాయివారినందరిని నరికివేయు చున్నాడు. మీరీ దోవనపోతే వాని కత్తికి బలియగుదురని అబద్ధములుచెప్పి భయపరచెను. ఈ సమాచారమును మూస తక్కిన యోహన్న వారికి తెలియజేయగా వారందరు లివింగ్ స్టన్ గారికి తెలియకుండ ఆ రాత్రియే పారిపోయిరి.

ఇట్లు పారిపోయి వచ్చినవారి కెవరును కూలి ఇయ్యరు గనుక మూస ఒక ఉపాయము పన్ని జాంజిబారుచేరి తాము లివింగ్ స్టన్ తోకూడ ప్రయాణము చేసితిమనియు, తాము ప్రయాణముచేసిన ప్రదేశములలోనివారు మిగుల అనాగరికులనియు, వారు పరదేశుల నోర్వలేక చంపువారనియు, వారు పలువిధములుగా లివింగ్ స్టన్ గారిని పీడించి కడకు ఆయన మఖాముమీదపడి ఆయనను చంపివేసిరనియు, తాము మాత్రము దైవవశాన తప్పించుకొని వచ్చితిమనియు పుక్కిటి పురాణములుచెప్పి కూలి ఇప్పించుకొని ఎవరికి చెప్పకుండ పారిపోయిరి. ఈ యబద్ధవార్త ఇంగ్లాండులోని ఆయన స్నేహితులకు తెలియగా వారిలో ననేకులు ఆయన నిజముగా చనిపోయెనని ఆయన మరణమునకు చాలా వగచిరిగాని కొందరా వార్తను నమ్మక ఆయనను వెదకుటకు కొందరి నేర్పరచి పంపిరి. వారు లివింగ్ స్టన్ గారిని కనుగొనలేదుగాని ఆయన చనిపోయెనని ఆ దొంగ కూలీలు చెప్పిన స్థలమునకువచ్చి అక్కడ యుద్ధము జరుగలేదనియు అక్కడనుండి ఆయన ముందుకు సాగిపోయెననియు నిజవార్త తెలిసికొని మిక్కుటముగా సంతోషించిరి.



ఇట్లుండగా లివింగ్ స్టన్ నైలునది యుత్పత్తి స్థానమును కనుగొనుటకు ఉత్తరదిశకు సాగుచు చెప్పశక్యముకాని ప్రయాసముల ననుభవించుచుండెను. కూలీలు తక్కువగానున్నందున వారు చాలా నిదానముగా పోవుచుండిరి.

మార్గాయాసముచేతను పనివారి ద్రోహముచేతను వ్యసనపడుచుండిన మన వీరునికి మరెక్కువ దుఃఖమును కలుగజేసిన సంగతి యొకటి జరిగెను. ఆయన తనకు తోడుగా నొక మంచి జాతికుక్కను వెంటబెట్టుకొని దానికి చితానె యను పేరుపెట్టి బహు ప్రీతిగా సాకుచుండెను. అది ఆయనయెడల మిగుల మక్కువగలిగి నీడవలె ఆయనను వెంబడించుచు, రాత్రులందు ఆయన డేరా వాకిట పండుకొనుచు, మనుష్యునినైనను భూతమునైనను పంచకు రానియ్యకుండెను. తన పనివారు విశ్వాసఘాతుకులై తన్ను విడిచిపోయినను తన కుక్కయైన తన యెదుట విశ్వాసముగలిగియున్నదిగదా అని ఆయన కొంచెము ఆదరణనొందెను. అయితే వారొక నాడు ఒక మైలువరకుండిన చిత్తడి నేలను దాటవలసివచ్చి నప్పుడు ఆయన నడుము లోతు నీళ్లలో నడిచిపోవుచు వెనుక వచ్చువారు కుక్కను ఎత్తుకొని వత్తురని నమ్మి ముందుకు సాగి పోయెను. ఆ కుక్క తన యజమానుని వెంబడియే నీళ్లలో దుమికి ఈదులాడుచు వచ్చెనుగాని కడకు బలముడిగినందున ఈదలేక నీళ్లలో మునిగి చచ్చెను.

అరబ్బీయు లా ప్రదేశమంతటిని శుద్ధ అరణ్యముగా చేసినందున అక్కడ మొక్కజొన్నలు తప్ప మరేమియు తిండిబండము లాయనకు దొరకలేదు గనుక వాటిని దంపించి,

మేక పాలలో నానబెట్టి తినుచుండెను. ఇట్లుండగా నొకనాటి రాత్రి దొంగలువచ్చి ఆ మేకలను తోలుకొనిపోయినందున పాలుకూడ లేకుండపోయెను గాన ఆయన ఆ మొక్కజొన్నలు ఉన్నవి ఉన్నట్టే తిని ఆకలి తీరక బహు బాధపడుచుండెను.

ఆయన సంచరించుచుండిన ప్రదేశములో దోమలు అతి విస్తారముగా నుండెను గనుక ఆయన తరుచుగా జ్వరముతో పడుట ఒక వింతకాదు. జ్వరమునకు క్వైనా మందవసరమని యెరిగి ఆయన దానిని దగ్గర నుంచుకొని మందుల పెట్టె విషయమై బహు జాగ్రత్త తీసికొనుచుండెనుగాని ఒకనాడు దట్టమైన యడవిని దాటుచుండగా ఆ పెట్టెను మోయుచుండిన పనివారు దానితోకూడ మటుమాయమైరి. ఆ మహా విపత్తునుగురించి ఆయన ప్రస్తావించుచు, ఇక నేను మృత్యువాత పడవలసినవాడనని తన దినచర్య పుస్తకమందు వ్రాసెను. తాను వ్రాసినట్లే ఆయన జ్వరమునకు మందులేక క్షీణించుచు ఎడతెగని బలహీనతచేత తుదకు మరణమాయెను.

లివింగ్‌స్టవ్‌గారు తాను క్రీస్తు రాయబారియైయుండుటయే తన ముఖ్య విధియని భావించినట్టు మనమిదివరకే అనేకసార్లు చూచియున్నాముగదా. క్రీస్తు నెరుగనివారి మధ్య తాను సాక్షియైయుండవలెనని ఆయన ఎన్నడును మరువలేదు గనుక యేసుయొక్క కృపాతిశయమునుగురించి ఆయన తన పనివారితో చెప్పుటమాత్రముగాక తాను దర్శించిన గ్రామములన్నిటిలో క్రీస్తు సువార్తను చాటించుచుండెను.

మిగుల రమ్యమైనదియు ఫలవంతమైనదియునైన ఆ ప్రదేశమును దాటి లివింగ్‌స్టన్ 1867 వ. సం॥ ఏప్రిల్ నెల మొదటి తేదిన టాంగన్యీకా యను గొప్ప సరస్సుదగ్గర చేరెను. హిందూదేశ పటములో దక్షిణమున మద్రాసును ఉత్తరమున విశాఖపట్టణమును చూడగా 420 మైళ్ల వెడల్పుగల ఆ సరస్సు ఎంత పెద్దదో మనము ఊహింపగలము. లివింగ్‌స్టన్‌గారప్పుడు క్షేమముగా నుండియుండినయెడల ఆ మనోహర ప్రదేశమును చూచుటవల్ల ఎంతగా ఆనందించియుండునోగదా. అయితే ఇప్పుడాయన వ్యాధి బాధితుడైయున్నందున ఆయన ప్రాణమే ఆయనకు బరువాయెను.



అస్వస్థతగా నుండినందున ఆయన ఆ సరస్సు చుట్టునుండు ప్రదేశమును పరీక్షించజాలకుండినను దానిలోనుండి నైలునది ప్రవహించదనిమాత్రము పరిష్కారముగా తెలిసికొని, పడమటి దిశనుండిన మరియొక సరస్సులోనుండి మహా పెద్ద నది ప్రవహించుటను విని దాని కనుగొనుటకు బయలు వెళ్లెను. 1867 వ. సం॥ నవెంబరు నెల 8 వ తేదిన ఆయన మోరో యను మరియొక సరస్సును కనుగొని దానిమీద సబురుచేయగా దాని యుత్తరపు కొననుండి గొప్ప యేరు పారుచున్నట్టు తెలిసికొన్న తరువాత అక్కడ నుండిన బెస్తవారితో సంభాషించి, ఆ నది దక్షిణముననున్న మహా బ్రహ్మాండమైన యొక సరస్సులోనుంచి ప్రవహించి వచ్చుచున్నదని విని, దాని నెట్లైనను కనుగొనవలెనని నిశ్చయించుకొనెను. అందునుగురించి ఆయన తన యనుచరులతో చెప్పగా, వారు ఆయనమీద తిరుగబడి, మేము నీ వెంబడి తిరిగి తిరిగి మా కిదివరకే మడిమల పండుగాయెను. నీవు "అదిగో" అంటే ఆమడ దూరము. ఒక సరస్సును కనుగొన్న

తరువాత మరియొకటి చూడవలెనంటావు. దానిని చూచిన తరువాత ఇంకొకటి చూడవలెనంటావు. ఎప్పుడు నిట్లే చెప్పచుందువుగాని నీ ప్రయాణము ముగిసేది మేము చచ్చినమీదటనే. మేము చాలా అలసిసొలసియున్నాము గనుక ఇక నీ వెంట రానేరామని చెప్పి ఒక జట్టుగా ఆయనను విడిచి పోయిరి. ఈలాటి వెన్ని సంభవించినను మనస్సు దృఢము చేసికొన్న మీదట మన లివింగ్‌స్టన్ లోకము మునిగిపోయినను తన పట్టు వదలువాడుకాడని మనమెరుగుదుము. పనివారి అవిశ్వాసమునుబట్టి ఆయన మనస్సు కృంగినవాడైనను మిగిలిన అయిదుగురితోనే ప్రయాణము సాగించెను.

లివింగ్‌స్టన్‌గారప్పుడు సంచరించుచుండిన ప్రదేశము ఇటు పశ్చిమ సముద్రమునుంచి వెయ్యి మైళ్ల దూరములోను అటు తూర్పు సముద్రమునుంచి 1500 మైళ్ల దూరములోను ఉండినను అరబ్బీయు లక్కడకూడ దేశమును గొల్లపెట్టి మనుష్యులను పట్టుకొనిపోవుచుండిరి. వారొకనాడు దోవను పోవుచుండగా వారికొక బానిసల సముదాయ మెదురాయెను. అరబ్బీయులు తమ క్రూరపద్ధతి ప్రకారము ఆ దౌర్భాగ్యులను పంగల కొయ్యలతో బంధించి కాళ్లు చేతులకు గొలుసులు కట్టి వారిని పశువులవలె తరుముచుండినను వారు పాడుచు ఓంకారము చేయుటను లివింగ్‌స్టన్‌గారు చూచి ఆశ్చర్యనిమగ్నుడై, వీరింత కష్టబాధల ననుభవించుచు పోవుచుండగా వీరికి పాటలెట్లు వచ్చుచున్నవి? అని తన పనివారి నడుగగా, వారు లేదు స్వామీ! వీరు తాము చనిపోయిన తరువాత ఈ సంకెళ్లూడిపోవుననియు, అప్పుడు తాము భూత



ములై వచ్చి తమ్ము నిట్లు తిప్పలపాలు చేసినవారిని గాసిపెట్టి చంపుదుమనియు పాడుచున్నారని చెప్పిరి.

లివింగ్‌స్టన్‌గారు తాను వినియుండిన ఆ పెద్ద సరస్సును కనుగొనుటకై దక్షిణమునకు సాగుచు ఆ ప్రాంత్యములో ఖ్యాతిగాంచిన అరబ్బీయుడగు మహమ్మదు బోహారీబ్ అను నతడు నివసించు గ్రామము చేరెను. అప్పటికి చాలా దినములుగా సరియైన భోజనపదార్థములు దొరకక ఆయన చాలా చిక్కిపోయియుండెను. ఎడతెగని అస్వస్థతవలన ఆయన పండ్లన్నియు ఊడిపోయియుండెను. గనుక కష్టముతో దొరికిన ముతుక అన్నము సహా సరిగా నమలి తినలేక ఆయన చాలా ప్రయాసపడెను. ఈ అరబ్బీయుడు బొట్టెలబేరము చేయువారిలో మొనగాడని పేరుగాంచి యుండినను ఏ కారణము చేతనోగాని లివింగ్‌స్టన్‌గారియెదుట దయాదాక్షిణ్యములు చూపి ఆయనను బాగా పరామర్శించి, ఆయనకు సేవియాలు పిండివంటలు, తేనె, కాఫీ మొదలగునవిచ్చి శ్రద్ధగా పోషించెను. ఆయన అక్కడ కొన్నాళ్లుండిన తర్వాత తిరిగి బయలుదేరి 1868 సం॥ జూలై నెల 28 వ. తేదిన తాను వెదకుచుండిన సరస్సును కనుగొనెను. బంగ్వేయోలో అను నీ తటాకము 100 మైళ్ల నిడివియు 75 మైళ్ల వెడల్పును గలది. అదివరకు ఐరోపీయులెవరును ఆ సరస్సును చూచియుండలేదు. ఆయన ఆ సరస్సు సమీపమున కొన్నాళ్లుండి దాని చుట్టునుండు ప్రదేశమును పరీక్షించుచుండెనుగాని ఆ సరస్సుకు నల్దిక్కుల జౌకునేల విశేషముగా నుండుటనుబట్టి ఆయన ప్రతినిత్యము నడుములలోతు బురదలో తిరుగు

చుండెను. అదిగాక ఆ యాటనేల దోమల కునికిపట్టైయుండెను గనుక నిత్యము నీళ్లలో నానుటవల్లను దోమల కాటువలనను ఆయనకు కఠిన జ్వరము తగిలినందున ఆయన మిగుల బాధపడెను. ఇట్లుండగా ఆయన ఉత్తరమునకు ప్రయాణమై పోయి తిరిగి మహమ్మదు బోహారీబ్ గ్రామము చేరునంతలో నతడు బానిసలను జాంజిబారుకు తీసికొనిపోవుటకు ప్రయాణమైయుండుటవలన లివింగ్‌స్టన్‌గారు వల్లని మగనికి తలంబ్రాలు పోసినట్టు విధిలేక ఆ బానిసల గుంపుతోకూడ కలసికొనిపోయెను.

ఈ మహమ్మదు బోహారీబ్ అరబ్బీయులందరివలె బానిసవారియెడల అతిక్రూరుడైయుండినను లివింగ్‌స్టన్‌గారియెడల నభిమానముగలిగి ఆయనను మిగుల జాగ్రత్తగా పరామర్శించెను. వ్యాధి ముమ్మరమగుటచే లివింగ్‌స్టన్‌గారు నడువలేకుండగా ఆ మహమ్మదీయుడు ఆయనకొరకొక డోలి చేయించి దానిలో ఆయనను మోయించెను. ఇట్లు ఆరువారములవరకు కష్టప్రయాసముతో ప్రయాణము చేసిన పిదప వారు టాంగన్యీకా సరస్సు చేరగా ప్రచండ వాయువు వీచుటచేత వారి పడవలు ఆవలి యొడ్డుకు దాటిపోవ వీలు లేకుండినందున వారు నడి సరస్సులో ప్రయాణము చేయక గట్టు నానుకొనియే సబురుచేసిరి. అందువలన రెండు మూడు దినములు పట్టే యూజీజీ యను రేవు చేరుటకు వారము దినములు పట్టెను. 1869 సం॥ మార్చి నెల 14 వ. తేదిన వారు యూజీజీ చేరిరి.

# 12 వ. అధ్యాయము

## చివరియాత్రలు; సేవకుల విశ్వాసము

లివింగ్‌స్టన్‌గారు యుజీజీలో ఔషధము సేవించుచు నాలుగు మాసములు గడిపిన తర్వాత వ్యాధి కొంచెము నయమైనందున వృథా కాలయాపనము చేయనొల్లక బలహీనముగానుండగనే తిరిగి ప్రయాణమునకు బయలుదేరెను. ఆయన తాను తలపెట్టిన ఏ కార్యమైనను నెరవేరువరకు నెమ్మదియననేమో నెరుగడు గనుక తన యనుచరుల సలహాలను సరకు చేయక యుజీజీ విడిచి బయలుదేరెను. పడమటి దిశను తానిదివరకు కనుగొనిన గొప్ప యేరు ఉత్తరదిశగా పారి కడకు ఐగుప్తు దేశముగుండ ప్రవహించు నైలునదియో కాదో తెలిసికొనుటయే ఆయన పెట్టుకొన్న వ్యామోహము గనుక పడవలనెక్కి సరస్సుయొక్క పశ్చిమ తీరమునకు ప్రయాణమాయెను. అయినను జలము అల్లకల్లోలముగా నుండినందున వారు నడిసముద్రముననున్న యొక దీవిచేరి గడ్డెక్కిరి. వారక్కడనుండి సాగుచు మరియొక దీవిచేరి అక్కడ కొన్ని దినములు ఆగిన తరువాత నీళ్లు నిమ్మళించినందున పశ్చిమ తీరము చేర సాధ్యమాయెను.

ఆయన టాంగన్యీకా సరస్సును విడిచి అప్పటికి ఐరోపీయులెవరును ఎరుగని మాన్యుయేమా అనువారి రాజ్యములో

ప్రవేశించెను. ఆ ప్రాంత్యపు జనులు శుద్ధ అనాగరికులును నరభక్షులునని పేరుగాంచినవారై యుండిరి. వారు లివింగ్ స్టన్ గారితో మాట్లాడుచు, తా మిష్టపడి నరమాంసము తినువారమనియు, అది తమకు దొరికినప్పుడు బహు సంభ్రమముగా విందారగించువారమనియు చెప్పిరి. వారిలో తన భార్యమీద అయిష్టపడిన పెనిమిటి ఆమెను చంపి ఆమె గుండెకాయను మేక మాంసముతోనైనను అరటిపండ్లతోనైనను ఉడికించి తినుట ఆచారమై యుండెను. అంతటితో తృప్తి జెందక వారు నరమాంస విందుల నేర్పాటు చేసికొన్నప్పుడు తమకు దొరికిన పీనుగును రెండు దినములవరకుకూడ నిలిపి భుజించువారట. లివింగ్ స్టన్ ఒక యూరిలో నుండగా ఒక యింటివాడు ద్వారమున కెక్కించి యుండిన పది దవడ యెముకల నాయనకు చూపి, తాను ఆ పదిమందిని చంపి వారి మాంసమును భక్షించిన విధమును వివరించగా లివింగ్ స్టన్ గారు మిగుల నసహ్యించుకొనుటను చూచి వాడు పకపక నవ్వెనట.

ఆ ప్రాంత్యములలో అడవి మృగములు విశేషముగా నుండుటవలన ఆ జాతివారు అధిక పక్షము వేటాడి జీవనము చేయుచుండిరి. వారు అంబులకు విషము పట్టించి ఏనుగులు కారెద్దులు మొదలగు పెద్ద పెద్ద జంతువులను కొట్టి చంపి, వాటి మాంసమును భక్షించువారు. ఆ వృక్షకోటి భరితమగు ప్రదేశములందు సంచరించు పలువిధ జంతువులలో సోకోయను నొక విధమైన కోతులుండెను. ఈ కొండముచ్చులు నరాకారముగలిగి జంతువులవలె నాలుగు కాళ్లమీద నడు



Page 185

[illegible]



వక మనుష్యులవలెనే నిలిచి నడుచును. అవి కోతి జాతిలో చేరినను పక్షులవలె చెట్లలో గూళ్లు కట్టుకొనుచున్నవి. ఒక్కొక్క సమయమున నవి పసిబిడ్డల నెత్తుకొని తమ గూళ్లలోకి తీసికొనిపోవునుగాని సాధారణముగా వారికి హానిచేయక భయకంపితులైన వారి తల్లులు ఒక అరటి గెలను చూపినంతమాత్రమున దాని కాశపడి బిడ్డ నెత్తుకొనివచ్చి నేలను దించి పోవును. అయినను వాటిమీది కెవరైనను పోయిన యెడల నవి బహు భయంకర రూపమును దాల్చి వారిమీద దుమికి వారి చేతి వ్రేళ్లను కాలి వ్రేళ్లను కొరికివేయును.

మన కథానాయకుడు వేలకొలది మైళ్ల దూరము నడిచినను ఆయన ఇదివరకెన్నడును కాళ్ల నొప్పులననేమో ఎరుగడు. అయితే ఇప్పుడాయన ప్రతినిత్యము తియ్యబుండ నీళ్లలో నడుచుటవలన ఆయన కాళ్లకు పుండ్లులేచి ఆయనను మిగుల బాధించెను. అవి చాలా ముమ్మరించినందున ఆయన ఒకసారి మూడు మాసములవరకు ఒక చిన్న గుడిసెలో పండుకొని యుండవలసివచ్చెను. అట్టి సమయమున ఆయన తనయొద్దకు వచ్చినవారందరితో క్రీస్తునుగురించి మాట్లాడి వారికి సువార్తను బోధించెను. ఆయన ఎప్పుడును వేద పఠనము విషయమై శ్రద్ధగలిగి ఆ మూడునెలలో బైబిలు యావత్తు కొనా మొదలుగా నాలుగు పర్యాయములు చదివెను.

లివింగ్‌స్టన్ పడుచుండిన పాట్లనుగురించి ఆయన స్నేహితుడగు డాక్టరు కర్కుగారు విని ఆయనకు సహాయము చేయుటకై జాంజిబారులోనుండి కూలీలను మాట్లాడి వారి చేతికి మెండుగా సరకు లప్పగించి ఉత్తరములు వ్రాసి ఆయన

యొద్దకు పంపెను. ఆయన యాత్రలవలన నలసి బంబారె యను గ్రామమందు సేద దీర్చుకొనుచుండగా ఆ గుంపులోని పదిమందిమాత్రము ఆయనయొద్ద చేరి డాక్టర్ కర్క్ పంపిన 40 యుత్తరములలో నొకటిమాత్ర మందించిరి. మిగిలిన కూలివారు యుజీజీలోనే నిలిచి డాక్టర్ కర్క్‌గారు లివింగ్‌స్టన్‌గారికి పంపిన సామానులను తమయొద్దనే యుంచుకొనిరి గనుక లివింగ్‌స్టన్‌గారు ఎప్పటి దరిద్రమునే అనుభవించుచుండిరి. తన పనివారి ద్రోహమునకు చింతించి, బలహీనతచే ప్రయాసపడి, పలుమారు కలిగిన ఆశాభంగముచే ప్రాణము విసికి, కడకు స్వదేశమును ప్రియ బిడ్డలను చూడవలెనని లివింగ్‌స్టన్‌గారు చాలా పర్యాయము లుద్దేశించి యుందురుగాని నైలునది యుత్పత్తి స్థానమును కనుగొనవలెనని దానిమీద ప్రాణము విడుచుచుండినందున తనకు నడువ గలిగినంత బలము వచ్చి రాకమునుపే ఆయన తిరిగి ప్రయాణమునకు బయలుదేరుచుండెను. మహా ప్రయాసముతోనే ఆయన యుత్తర దిశకు ప్రయాణమై తాను కనిపెట్టిన సరస్సులలోనుంచి ప్రవహించు నదిచేరి దానిమీద పడవలను నడిపించి, చాలా దూరము పోయిన తరువాత ఆ నది పడమటి దిశకు ప్రవహించుటవలన అది నైలునది కాదని తెలిసికొని మితిలేని నిరాశచెందినవాడై వెనుకకు తిరిగెను.

తా నుద్దేశించిన కార్యము భంగమాయెనని తెలిసికొని లివింగ్‌స్టన్‌గారు మరల యుజీజీకి పోవుటకునిశ్చయించుకొనెను గాని ఆ కష్టప్రయాణమునకు బయలుదేరకమునుపు తాను అప్పటికి చేరియుండిన జ్ఞాంగ్వేయను గ్రామమందు కొన్నా



ళ్లుండి అలసట తీర్చుకొని పోదలచెను. ఆ యూరిలో నుండి నప్పుడు అరబ్బీయులచ్చట జరిగించిన కర్ణకఠోరమైన క్రూర కృత్యమును చూచి దుఃఖ సముద్రములో మునిగినవాడాయెను.

ఆ యూరిలో నెలకొకసారి సంత జరుగుట కద్దు గనుక చుట్టుపట్ల పల్లెటూళ్ల జనులు ధాన్యము, పండ్లు, కూరగాయలు, ఉప్పు, కోళ్లు, మొదలైన సరకులను సంతకు గొనివచ్చి అమ్మి వేయుచుండిరి. వారిలో కొందరు ఏటివెంబడి పడవలలో వచ్చిరి. మరి కొందరు మారుమూల గ్రామములనుండి కొండ లెక్కి దిగుచు, సూర్య కిరణములు చొరవనేరని చిట్టడవులు దాటుచు సంతపేట చేరిరి. సంతకు వచ్చిన వారందరు తాము తెచ్చిన సరకులను తమ ముందర పేర్చి యుంచుకొని సాటాబేరమాడుచుండిరి. చంకలలో బిడ్డల నెత్తుకొని నెత్తిమీద మూటలు పెట్టుకొని నల్దిక్కులనుండి వచ్చిన స్త్రీ పురుషులు మరి యితర గ్రామములనుండి అదేసంతకు వచ్చిన తమ బంధుమిత్రాదులను కలిసికొని వారిని కుశలమడుగుచు, పలువిధ సంగతులనుగూర్చి వారితో ముచ్చటించుచు సంభ్రమపడుచుండిరి. అక్కడ వచ్చి చేరిన సుమారు పదునైదునూర్ల జనులు చేయు బేరములవలనను సరస సల్లాపములవలనను నాటి సంత గొల్లు బహు విశేషమాయెను. లివింగ్‌స్టన్‌గా రెప్పుడును జనుల సుఖదుఃఖములలో పాల్గొనువాడుగాన ఆ సంతలోని సంభ్రమమును చూడబోయెను. ఆయన సంతలో నిటునటు తిరుగుచు, ఒక యంగడిలో నొక పందును, ఇంకొక యంగడిలో నొక గుల్లగుట్రను వేరొక యంగడిలో మరి

యొక విధ వస్తువును కొనుచు, మిఠాయి అంగళ్లకుపోయి పాలమురుగులు, బెండ్లు, పప్పులు, బొరుగులు మొదలగునవి కొని ఈగలవలె తన్ను ముసురుకొనియుండిన అచ్చటి పసి బిడ్డలకు పంచిపెట్టుచు వారి కెక్కడలేని సంభ్రమమును కలిగించుచు, తానును సంభ్రమపడుచు నుండెను. పాపము! పెండ్లి యింటిమీద పిడుగుపడినట్లు ఆ సంతలోని సంతోషము క్షణభంగురమైనదాయెను. ఎట్లనిన, లివింగ్‌స్టన్‌గారు తానంగళ్లలో కొనుక్కొనిన కొన్ని వస్తువులను చేత పట్టుకొని నాడు తాను సంతజనుల సంతోషములో పాల్గొనినందుకు మనస్సుప్పొంగుచు సంతపేట విడిచి కొన్ని గజముల దూరము సాగిపోయినంతలో ఢాం, ఢూం, అని తుపాకుల శబ్దమును, కుయ్యో మొర్రో అని స్త్రీలు రోదనము చేయుటను విని వెనుకకు తిరిగి చూడగా కొన్ని నిమిషముల క్రిందటనే ఒక నాటకశాలగా నుండిన ఆ సంతవీధి యిప్పుడొక యుద్ధ స్మశానముగా మారుచుండెను. గద్దకు బెదరిన కోడి పిల్లల చందమున అక్కడి స్త్రీ లెల్లరు తమ అంచుననే పిలువులాటలాడుకొనుచుండిన తమ పసి కూనలను చంకల వేసికొని, సరకు సంబారమును విడిచిపెట్టి, బ్రతుకు జీవుడా యని దిక్కుకొకరు పారిపోవుచుండిరి. కొందరు ప్రాణములు దక్కించుకొనుటకు సమీపముననున్న పొదలకు పారిపోయి వాటిలో దాగుకొనిరి. మరికొందరు ఏటియొడ్డున నిలిపియుంచిన తమ పడవలయొద్దికి పారిపోయి వాటినెక్కి పో జూచుచుండిరి. ఇంకా కొందరు నీళ్లలో దుమికి అవతలి యొడ్డుకు ఈదుకొనిపోవుచుండిరి. ఈ భయోత్పాతమునకు జనులు



ఏమి తోచక తోడేళ్లు తరుముచుండిన గొర్రెల చందమున ఏ దోవ దొరికితే ఆ దోవను తమ పిక్క బలము జూపుచుండిరి. కారణమేమంటే, క్రూర కంటకులగు ముప్వురు అరబ్బీయులు ఒక గుట్టమీదనుండి ఆ జన సమూహముమీదికి తుపాకులు కాల్చుచుండిరి. ప్రాణములు తప్పించుకొని పడవల నెక్కినవారును, నీళ్లలో దుమికి మునుగుచు తేలుచు ఆవలి యొడ్డుకు ఈదుచుండినవారును, వారి తుపాకుల దెబ్బలకు గురియగుచుండిరి. నీళ్లలో నుండినవారు గంగమ్మదేవికిని, గడ్డన పరుగెత్తుచుండినవారు గాలిదేవునికిని బలియగుచుండిరి. సంత గొల్లుతో సంగీతనాదము గావించుచుండిన ఆ గ్రామము ఒక అర్ధగంటసేపటిలో నిశ్శబ్దమాయెను. సంతకు వచ్చిన ఆ పదునైదు నూర్ల జనులలో సుమారు 400 మంది హతులైరి. వారిలో నెక్కువభాగము స్త్రీమణులే. కరుణాహృదయుడగు మన కథానాయకుడు ఆ సమయమున జరిగిన వధకు మిగుల వగచుచు, పట్టరాని ఆగ్రహము తెచ్చుకొని, తాను కన్నులార చూచిన ఆ దారుణ కార్యమును గురించి బ్రిటిష్ దొరతనమువారికొక తీక్షణమైన యుత్తరము వ్రాసి పంపెను. అక్కడివారా ఘోరవార్తను వినగనే వారి దేహములు కంపమెత్తుకొనెను. వారా దుష్కార్యము నణచివేయుటకై కంకణము కట్టుకొని, బహు చురుకుగా పని చేసినందున పది సంవత్సరములలోపల బానిస వ్యాపారమా దేశమున బొత్తుగా అడుగంటెను.

మరుసటి దినమున లివింగ్‌స్టన్‌గారు ప్రయాణము చేయుచు, నొక దిన్నె నెక్కిపోవుచుండగా, అరబ్బీయుల వల్ల

తగులబెట్టబడిన 18 గ్రామములనుండి పొగ ఆకాశము నంటుచుండినట్టు చూచెను. ఆయన ఇంకను యాత్రచేసి ఆ ప్రదేశమును బాగా పరీక్షించి వాటి స్థితిగతులను తెలిసికొనవలెనని కోరెనుగాని ఆయనను వెంబడించిన దుష్టులగు పనివారు ఆయనమీద తిరగబడి, ఇక నాయనవెంట రామని హఠము సాధించినందున ఆయన తిరిగి యుజీజీకి రావలసివచ్చెను.

జ్వరములకు పుట్టినిల్లయిన ఆ యడవులగుండ 600 మైళ్లు ప్రయాణము చేసినమీదట ఆయన 1871 వ. సం॥ అక్టోబరునెల 23 వ-తేదిన యుజీజీ గ్రామము చేరెను. పనివారు తనకొరకు తెచ్చియుండిన సామానులు అక్కడ ఉన్నవి గనుక తన కవసరమైన ఔషధములును భోజన పదార్థములును కొదువలేకుండ దొరుకునని ఆయన గంపెడాశ పెట్టుకొని యుండెనుగాని పాపము! ఇన్నాళ్లకు రానివాడింకేమి వస్తాడని వారనుకొని ఆ సామానులన్నియు ఆయన వచ్చులోపల మటుమాయము చేసియుండిరి. ఈ విశ్వాస ఘాతుకులు చేసిన ద్రోహమునకు లివింగ్‌స్టన్ చాలా ఖిన్నుడై తన దినచర్య పుస్తకమున నీలాగు వ్రాసి ప్రలాపించెను. ‘‘నాకు కలిగిన దురదృష్టమునుబట్టి నేను యెరూషలేమునుండి యెరికోకు పోవుటకు ప్రయాణము చేయుచు దొంగలపాలైన ఆ దౌర్భాగ్యునివంటివాడనైనట్టనుకొంటిని. ఏ దిక్కు చూచినను నాకొక యాజకుడైనను, లేవీయుడైనను సమరైయుడైనను పొడకట్టకుండుటనుబట్టి నేను ప్రాణముపై యాశ వదలుకొంటిని. అయితే నేనధైర్యపడిన సమయముననే ఒక మంచి సమరైయుడు నాయొద్దకు రానైయుండెను.’’



నవెంబరు నెల 10 వ తేది ఉదయమున లివింగ్‌స్టన్ గారు యథాప్రకారము దైవధ్యానము చేసి తన మామూలు దిన కార్యములు మొదలుపెట్టుచుండిన సమయమున ఊరికి కొంత దూరములో తుపాకుల శబ్దము వినవచ్చుచుండెను. పలుమారు బొట్టెల బేరము చేయు అరబ్బీయుల దౌర్జన్యము నెరిగియుండిన మన కథానాయకుడు ఆ శబ్దము విని అరబ్బీయులు వచ్చుచున్నారనుకొని గడగడ వణకుచు ప్రాణము దక్కించుకొను సదుపాయము నాలోచించుచుండగా ఆయన పనివాడైన సూసి యనువాడు ఆయన డేరాలో చొరబడి, అయ్యా! హూనువారెవరో వచ్చుచున్నారని చెప్పి, ఆ యూరిని సమీపించుచుండిన వారి నెదుర్కొన పరుగెత్తి పోయెను.

తుపాకుల శబ్దమును విని ఊరిలోనివారందరు గుంపుకూడి వారి నెదుర్కొన బోవుచుండిరిగాని సూసి ఆ గుంపులో త్రోసికొనుచు దోవచేసికొని, ముందుకు పోయి, ఆ క్రొత్త వారి నాయకునికి సలాము చేయుచు ‘‘గుడ్ మార్నింగ్ సర్’’ అని చెప్పగా ఆ నాయకు డితని ఇంగ్లీషుమాట కచ్చెరుపడి, నీవెవరు? అని యడుగగా సూసి, నేను లివింగ్‌స్టన్ సాహెబు గారి పనివాడనయ్యా అని చెప్పెను. ఆ మాట విన్నతోడనే ఆ నాయకుడు తాను పూనుకొన్న కార్యము సిద్ధించెనని యెరిగి లివింగ్‌స్టన్ గారికొరకు త్వరపడుచు ఊరిలో ప్రవేశించగా లివింగ్‌స్టన్ బలహీనతచే తూగుచు తన్నెదుర్కొన వచ్చుట చూచి ఆయన కడు మర్యాదతో, అయ్యా! తమరు డాక్టర్ లివింగ్‌స్టన్ గారు కాదా? అని విచారించెను. లివింగ్

స్టన్ ఆ నాయకునికి చాలా మర్యాదచేసి, స్వాగతమిచ్చి తన యింట చేర్చుకొనెను. వారు ఏమేమో సంగతులనుగురించి బహు సంతోషముగా ముచ్చటించుచుండిరి. అయినను వారి ముచ్చట లట్లుండనిచ్చి మనమా క్రొత్తవారెవరైనది విచారింతము.

మూడు నాలుగు సంవత్సరముల క్రిందట లివింగ్‌స్టన్‌గారు అరణ్య ప్రదేశమందు ప్రవేశించిన నాటినుండి ఆయన సమాచారమెవరికిని తెలియకపోవుటవలన ఆయనను కనుగొనుటకు రెండు మూడు గుంపులవారు ఆ దేశమందు యాత్రలు చేయుచుండినను వారి యత్నము కొనసాగలేదు గనుక అనేకులు ఆయన చనిపోయియుండవలెనని అభిప్రాయపడిరి. అయినను అంతటితో ఊరుకొని ఆయనను అట్లే విడిచిపెట్టుట ధర్మము కాదనియు ఆయనను వెదకి కనుగొనుటకు ఇంకా కొందరిని పంపవలెననియు నిశ్చయించుకొని, తగిన నాయకునికొరకు విచారించగా ఆ ప్రయాసకరమైన ఉద్యమమునకు తాను పూనుకొందునని న్యూయార్కులోని హెన్రి మార్గన్ స్టాన్లి అను నాయన తెలియజేసెను. ఈయన తన ప్రయాణమున కవసరమైన సామానులను సమకూర్చుకొని ఆఫ్రికాకు వచ్చి ఒక నిమిషమైనను తడవుచేయక మధ్య ఆఫ్రికా అరణ్య ప్రదేశమునకు ప్రయాణమైపోయెను. లివింగ్‌స్టన్‌గారి ప్రయాణములలో ఆయన కింతకుమునుపు తటస్థించిన కష్ట ప్రయాసములను జ్ఞాపకము చేసికొనగా స్టాన్లి చేసిన యాత్ర అరటిపండును తిన్నంత సులభముగా జరుగలేదని మనకు విదితమగును. అయినను ఈయన కష్టములకు


Page 192

స్టాన్లి లివింగ్‌స్టన్‌ను దర్శించుట

వెనుకతీయకయు, అపాయములకు వెరువకయు, ఎటులైనను లివింగ్‌స్టన్‌గారి అడుగుజాడలు కనిపెట్టి ఆయనకు సహాయము చేయవలయునను దీక్షగలిగి కడకు తన కార్యమును కడముట్టించెను.

స్టాన్లి వచ్చినప్పటినుండి లివింగ్‌స్టన్‌గారు క్రమముగా బలపడుచు సరియైన పోషణ కలిగినందున త్వరలోనే దేహక్షేమము నొందుచు టాంగన్యీక అను సరస్సు చుట్టునుండిన ప్రదేశమును ఆ సరస్సులో పడు నదులను కనిపెట్టుచు వచ్చెను. ఆయన మనమా గొప్ప సరస్సుయొక్క ఉత్తరపు కొనవరకు పోయి అందులోనుండి ఏదైనా నది ప్రవహించునేమో కనుగొందము రమ్మని ఆయనతో ననగా వారు పడవలను ఏర్పాటుచేసి జల ప్రయాణము చేయుచు వెళ్లిరి. సాయంకాలమున వారు గడ్డెక్కి అక్కడ డేరాలు వేసికొని, రాత్రి గడిపి, ఉదయమున తిరిగి బయలుదేరుచుండిరి. ఆ సరస్సు తీరమునవుండిన జనులు అదివరకెన్నడును తెల్లవారిని చూచియుండలేదు గనుక పగలు కనబడిన గూబను కాకులు వెంటాడి తరిమినట్టు వారీ అన్యుల నెదిరించి వారు గడ్డెక్కకుండ చేసిరి. అట్టి సమయమున స్టాన్లి ఆగ్రహము తెచ్చుకొని, వారికి భయము కలిగించుటకై తుపాకి కాల్చుదునా అని లివింగ్‌స్టన్‌గారి నడుగగా ఆయన అందులకు సమ్మతించక, స్నేహభావముగానే వారి విరోధము నణచి వారితో పరిచయము చేయవలెనని చెప్పి అలాగే చేస్తిరు.

ఒకనాటి సాయంకాలమున వారొక వసతిగల చోటును కనుగొని పడవదిగి, వంటలు వండి భుజించుచుండగా, చుట్టు

పట్టునుంటిన చెట్టు కొమ్మలలో మనుష్యులు పొంచుకొని తమ మీద పడనైయుండుటను చూచి విస్తళ్లలోని యన్నము నట్లే విడిచిపెట్టి పడవమీదికి పరుగెత్తుకొనిపోయి కొంచెములో తప్పించుకొనిరి. మరియొక స్థలమున వారు మకాముచేసి నప్పుడు స్టాన్లికి జ్వరము తగిలినందున మిగుల బాధపడుచుండెను. ఆ సమయమున లివింగ్‌స్టన్‌గారు తన పనివారితోకూడ వేటకుపోయియుండిరి. స్టాన్లికి చెమటపోసి జ్వరము విడిచిపోయినందున కొంచెము నిద్రపోవుచుండగా ఆయన పనివారు పరుగెత్తుకొనివచ్చి, అయ్యో! మీదికి వచ్చుచున్నారు మీదికి వచ్చుచున్నారని బొబ్బలుపెట్టి ఆయనను లేపిరి. అంతలో ఆ దుష్టగుంపు వీరిని చుట్టుకొని భయంకర చేష్టలు చేయుచు వారిని జగడమునకు రమ్మని రేపుచుండిరి. కాలవశమున లివింగ్‌స్టన్ కొంత దూరమునుండి ఆ యల్లరిని కనుగొని పరుగెత్తుకొనివచ్చి సంగతి యేమని విచారించగా, కొన్నాళ్లకు ముందు బొట్టెలబేరము చేయుచుండిన అరబ్బీయులు ఆ యూరిమీద పడి వారిలో నొకని చంపియుండిరనియు, ఇప్పుడు వచ్చినవారుకూడ అరబ్బీయులనుకొని వారికి ప్రతీకారము చేయ నుద్దేశించి వచ్చిరనియు తెలిసికొని లివింగ్‌స్టన్ తన యంగీ తీసి రెట్టను వారికి చూపించి, ఇదిగో! నేను అరబ్బీయుడను కాను. అప్పటము తెల్లవాడను చూడండి అని వారికి చెప్పి వారికి కోపోపశమనము కలుగజేసెను.

స్టాన్లి లివింగ్‌స్టన్‌గారిని కనుగొనుటలో తన కార్యము ముగిసినట్టనుకొనక, ఆయన తనవెంట ఇంగ్లాండుకు పోవుటకు ఒప్పుకొనునట్లు ఆయనను ప్రేరేపించుచు, నానావిధ



కారణములు చెప్పి, ఆయనకు స్వదేశముమీద బెంగ పుట్టించుటకు పలువిధములుగా ప్రయత్నించుచుండెను. అప్పటికి లివింగ్‌స్టన్ తన బిడ్డలను చూడక అయిదు సంవత్సరములైయుండెను గనుక స్టాన్లి చెప్పిన మాటలాయన కెంత మనోహరముగా నుండెనో మన మూహింపవచ్చునుగాని పట్టిన కార్యము నెరవేర్చుటయే పరమ ధర్మమని యెంచి స్టాన్లి ఎంత ప్రీతికరముగా చెప్పినను ఆయన చెవిపెట్టకపోయెను. నా ప్రాణముకంటెను, నా బిడ్డలకంటెను నా ధర్మమే నాకు ప్రియము గనుక నేను నా ధర్మమునైనను నెరవేర్చవలెను లేదా నా ప్రాణమునైనను ధారపోయవలెనని చెప్పి ఆయన స్టాన్లిగారి ప్రేరణ కెంతమాత్రమును లొంగడాయెను. ఒక కొండనైనను కదిలింపవచ్చునుగాని లివింగ్‌స్టన్ యొక్క మనస్సును కదిలించుట కష్టసాధ్యమని స్టాన్లి గ్రహించుకొని, ఇంగ్లాండుకు తిరిగిపోవుట కాయత్తపడుచు వచ్చి యుజీజీలో నాలుగు నెలలు గడిపిన పిదప బయలుదేరెను.

స్టాన్లి జాంజిబారునుండి లివింగ్‌స్టన్‌గారిని వెదకుచు సాగినప్పుడు తాను దాట నుద్దేశించిన ప్రాంత్యముల పాళెగాండ్లు యుద్ధముచేయుటను విని ఆ ప్రాంత్యముల చుట్టు తిరిగి పోవ నిశ్చయించినందున లివింగ్‌స్టన్‌గారికొరకు తెచ్చిన సరకులు ఉన్యాన్యెంబి యను గ్రామమునసబు వశముచేసి వచ్చియుండెను గనుక నిప్పుడు ఉన్యాన్యెంబివరకు లివింగ్‌స్టన్‌గారు వచ్చి ఆ సరకులు తెచ్చుకొనవలెనని ఆయన చెప్పినందున వారిద్దరును కలిసికొని ప్రయాణమైరి. వారు ఉన్యాన్యెంబి చేరగా స్టాన్లి తాను లివింగ్‌స్టన్‌గారికొరకు తెచ్చి

యుంచిన సరకులు ఆయన చేతి కప్పగించి, ఆయన అయిదు సంవత్సరములనుండి చేసిన ప్రయాణముల విషయమై వ్రాసిన పుస్తకమును గైకొని, ఆయనయొద్ద సెలవు పుచ్చుకొని సీమ దేశమునకు ప్రయాణమాయెను. స్టాన్లి యుజీజీకి రాకమునుపు అయిదు సంవత్సరములుగా లివింగ్‌స్టన్ ఐరోపీయుల నెవరిని చూచియుండలేదు. స్టాన్లి వెళ్లిపోయిన తరువాత ఆయన మరెన్నడును ఐరోపీయులను చూడలేదు.

స్టాన్లి లివింగ్‌స్టన్‌గారియొద్ద సెలవు పుచ్చుకొనునప్పుడు తాను జాంజిబారుకు వెళ్లి ఆయన సామానులు మోయుటకు పనివారిని పంపుదునని మాట యిచ్చియుండెను గనుక లివింగ్‌స్టన్‌గారు ఉన్యాన్యెంబిలో వారికొరకు కాచుకొనియుండెను. ఆ యూరిలో నున్నప్పుడాయన 59 వ. జన్మదినము వచ్చెను గనుక ఆ సంగతినిగురించి ఆయన తన దినచర్య పుస్తకమందు, "కరుణా నిధియగు ఓ నా పరమతండ్రీ! నేడు నన్ను నేను నీకు సమర్పించుచున్నాను. నన్నంగీకరించి, నీ చిత్తమైతే ఈ సంవత్సరములోపల నేను నా కార్యము తుదముట్టించునట్లనుగ్రహించుమని శ్రీ యేసు దివ్యనామమునుబట్టి నిన్ను వేడుకొనుచున్నాను. ఆమేన్" అని వ్రాసెను.

స్టాన్లి పంపిన పనివారు వచ్చిన తరువాత లివింగ్‌స్టన్ ప్రయాణమునకు సిద్ధపడి ఆగస్టునెల 25 వ. తేదిన టాంగన్యీకా అను సరస్సుకు పోవ బయలుదేరెను. ఆరు వారములకు వారా సరస్సునొద్ద చేరిరి. పిమ్మట ఆయన పడమటనున్న బంగ్వెయోలో అను సరస్సునొద్దకు పో బయలుదేరెను.



లివింగ్‌స్టన్ చిత్తాంబో గ్రామము చేరుట

Page 197



ఆ సరస్సులోనుండి ప్రవహించు లుయాపులా అనునది కాంగో నదియో నైలునదియో కనుగొనవలెననియే ఆయన ముఖ్యగురి. అయితే అప్పటికి వర్షాకాలము ఆరంభించియుండుట వలన దేశమంతయు చిత్తడినేలగా నుండెను గనుక వారు నిత్యము నీళ్లలోనే నడువవలసియుండెను. లివింగ్‌స్టన్‌గారు జ్వరమువలనను అతిసారమువలనను బాధపడుచు బలహీనుడై నడువలేక పల్లకీలో ప్రయాణము చేయుచుండెను. వ్యాధిగ్రస్తుడైయున్న లివింగ్‌స్టన్‌గారు ప్రయాణ కష్టముల నోర్చుకొనలేక ఉన్నచోటుననే మరణము కానిమ్మని ఆయన పలుమారు తన సేవకులను వేడుకొనెనుగాని ఆయనమీద వారికుండిన అనురాగమునుబట్టి వారాయన అరణ్యములో చనిపోవుట కిష్టపడక, ఆయన నేదో ఒక గ్రామము చేర్చి పరామర్శించవలెనని కోరి ప్రయాసమునక తుదకు 1873 వ. సం॥ ఏప్రిల్ నెల 29 వ. తేదిన చిత్తాంబో యను చిన్న గ్రామము చేరిరి.

ఆయన పనివారు ఆయనకొరకొక గుడిసె కట్టి ఆయనను ఒక మంచముమీద పరుండబెట్టి తమకు తెలిసినంతవరకు ఆయన కుపచారము చేసిరి. మరునాడాయన తన ప్రియదాసుడగు సుసిని పిలిచి, మందులపెట్టె తీసికొనిరమ్మని చెప్పి, తనకు కావలసిన మందు దినుసు తీసికొని, సరే, నీ విప్పుడు పోవచ్చునని వానికి సెలవిచ్చెను. మరునాటి ఉదయమున లివింగ్‌స్టన్‌గారిదగ్గర పండుకొనియుండిన పిల్లవాడు సుసియొద్దకు వెళ్లి, ఏమయ్యా, మన దొర అయిపోయినట్టున్నదని పలుకగా సుసియు అతనితోకూడ మరి యిద్దరు ముగ్గురును

గుడిసెలోనికి వెళ్లి వీరశూరుడగు లివింగ్‌స్టన్‌గారు తన మంచము ప్రక్కనే మోకరించి దేవుని ప్రార్థించుచున్నట్లు కనుగొనిరి. ఆయన ప్రార్థనకు భంగము కలుగకుండునట్లు వారు మౌనము ధరించి కొంచెముసేపు కనిపెట్టిరిగాని ఎంతసేపటికిని ఆయన కదలకుండుటయు, ఊపిరి విడువకుండుటయు చూచి, సూసి ఆయనదగ్గరకు వెళ్లి ఆయన చెయ్యి ముట్టి చూచి, ఆయన నాలుగైదు గంటలకుముందే చనిపోయియుండునని తెలిసి కొనిరి.

లివింగ్‌స్టన్‌గారు 1873 వ. సం॥ మే నెల 1 .తేదిన పరగతుడాయెను. వెంటనే ఆయన ప్రియసేవకులైన సూసియు చుమాయు ఆయనయెడల తమకుగల విశ్వాసమును బహు వింతగా కనుపరచుచువచ్చిరి. ఎట్లనిన, లోక ప్రసిద్ధుడగు తమ నాయకుడు పరదేశములో పాతిపెట్టబడుట కిష్టము లేక ఆయన తన స్వదేశములోనే సమాధిచేయబడునట్లు ఏర్పాటు చేసిరి. మొట్టమొదట వారాయన గుండెను గుడిసె ప్రక్కను పాతిపెట్టి ఆయన శరీరమును ఎండబెట్టిన పిదప దానికి సుగంధ ద్రవ్యములు పట్టించి, బట్టలలో చుట్టివేసి, ఇంగ్లాండునకు తీసికొనిపోవుటకు దానిని సిద్ధము చేసిరి. ఆయన పుస్తకములను ఇతర సామానులను సమకూర్చి వారా శవమును జాంజిబారునకు తీసికొనిపోవుటకు దారిపట్టిరి. వారింతకు మునుపు తమ యజమానునితోకూడ అనుభవించిన ప్రయాణ కష్టములన్ని చాలవన్నట్లు. వారు జాంజిబారును సమీపించునప్పుడు ఆ దేశజనులు వారిని అడ్డగించి తమ దేశముగుండ వారా శవమును తీసికొనిపోకూడదని ఖండితముగా పలికిరి.



లివింగ్‌స్టన్ సేవకులు ఆయన శవమును మోసికొనిపోవుట

Page 109



అయితే వారు తమ చమత్కారమువలన ఆ కష్టముకూడ తప్పించుకొనిరి. ఎట్లనిన, రాత్రిలో వారొక పెద్ద కట్టెల మోపును ఒక దూది బస్తాను కట్టి ఉదయమున ఆ కట్టెల మోపును తాము వచ్చిన మార్గమున వెనుకకు పంపి దూది మూటను ముందుకు తీసికొనిపోయిరి. ఆ దేశజనులు కట్టెల మోపును చూచి వారా శవమును వెనుకకు తీసికొనిపోవు చున్నారనుకొని శవమును చుట్టివేసియుండిన దూదిమూటను ముందుకు తీసికొనిపోనిచ్చిరి. కడకు లెక్కలేనన్ని కష్టప్రయాసములతో వారు తమ కార్యము తుదముట్టించి, జాంజిబారు చేరి తమ నాయకుని శరీరమును ఇంగ్లాండు చేర్చునట్లు అక్కడి సర్కారు ఉద్యోగస్థుల కప్పగించిరి.

# 13 వ. అధ్యాయము

## ఫలితార్థము

లండన్ పట్టణమునందొక దివ్య దేవాలయము గలదు. 650 సం॥ ల క్రిందట శిల్పి శ్రేష్ఠులు కట్టినటువంటి ఆ సుందరమైన దేవాలయమందు దైవారాధన జరుగుటమాత్రమే కాక లోక ప్రసిద్ధిగాంచిన సత్పురుషుల యెదుట తమకు కలిగిన యభిమానమును కనుపరచుటకై బ్రిటిష్‌వారట్టి ఘనులను ఆ దేవాలయములో సమాధిచేయుటకద్దు. లివింగ్‌స్టన్‌గారు ఆఫ్రికా దేశమందు చేసిన ప్రయాణములనుబట్టియు ఆయన కనుగొన్న దేశములనుబట్టియు లోక ప్రసిద్ధిగాంచెను గనుక అట్టి గంభీర సమాధి కాయన మిగుల నర్హుడని అందరు ఒప్పుకొందురు. కాబట్టి ఆయన శవము లండన్‌కు వచ్చినతోడనే సర్కారు వారాయనను వెస్ట్‌మిన్‌స్టర్ ఆబి యను ఆ దివ్య దేవాలయమున పాతిపెట్టుట కేర్పాటుచేసిరి.

సుసియు చుమాయు అంత గారాబముగా కాపాడి కష్ట ప్రయాసముగా జాంజిబారుకు తెచ్చి యోడెక్కించిన ఆ శవము 1874 సం॥ ఏప్రిల్ నెల 14 వ. తేదిన లండన్ పట్టణము చేరెను. అది నిశ్చయముగా లివింగ్‌స్టన్‌గారి శవమో కాదో తెలిసికొనుటకై కొందరు పేరొందిన వైద్యులు దానిని పరీక్షచేయగా సింహపు కాటుకు విరిగిపోయి వంక



రగా అతుకుకొన్న యెడమచేతి యెముక కనబడినందున అది ఆయన శవమే అని వారు దృఢపరచిరి. ఆయన పరగతుడై అప్పటికి సుమారొక సంవత్సరమైయుండినను ఆయన ముఖము అంతగా మారలేదు గనుక ఆయన స్నేహితులాయనను గుర్తుపట్టగలిగిరి.

ఆయన ప్రేతకార్యములు బహు వైభవముగా జరిగెను. విక్టోరియా మహారాణిగారు తానే వచ్చి అందులో పాల్గొనుటకు వీలులేక తన ప్రతినిధిని పంపిరి. దేశములోని ఘనులలో ననేకులు లివింగ్‌స్టన్‌గారిని గౌరవించుటకై వెస్ట్‌మిన్‌స్టర్ ఆబిలో జరిగిన ఆ ఘనకార్యములో కలిసి ఆయనను సమాధి చేసిరి. వారాయనను ఆ ప్రశస్త దేవాలయములో పాతిపెట్టిన తరువాత ఆయన పేరును, సద్గుణములను, ఆయన చేసిన ఘన కార్యములను ఒక బండమీద చెక్కి ఆయన సమాధిమీద నుంచిరి. ఆ దేవాలయము ఉన్నంతకాలము ఆయన నామధేయము దానికొక భూషణమై యుండును. ఆ సమాధిమీది శిలాశాసనము నీ క్రింది విధముగా భాషాంతరము చేయవచ్చును.

నేలమీదను నీళ్లమీదను కష్ట ప్రయాణములుచేసి వచ్చిన విశ్వాస శిఖామణులచే తేబడిన మిషనేరియు, యాత్రికుడును, లోకోపకారియునైన డేవిడ్ లివింగ్‌స్టన్‌గారిచ్చట విశ్రమించుచున్నారు.

ఈయన ఆన 1813 వ. సం॥ మార్చినెల 19 వ. తేదిన లానర్క్‌షైర్‌లోని బ్లాంటైర్ అను ఊరిలో జనించి 1873 వ. సం॥ మే నెల 1 టి. తేదిన ఉలాలా [illegible] అను ఊరిలో పరగతుడాయెను.

ఈ మహనీయుడు మధ్యాఫ్రికాలోని స్వదేశీయులకు సువార్త ప్రకటించుటయందును, అజ్ఞాత దేశములను కనుగొనుటయందును ఘోరమైన బానిస వ్యాపారమును నిర్మూలముచేయుటయందును ముప్పది యేండ్లవరకు ప్రయాసపడి తన ప్రాణమును ధారపోసెను.

బానిస వ్యాపారమును గురించి ఈయన వ్రాసిన చివరి వాక్యమేమనిన, "ఇది లోకమును పీడించుచున్న ఒక పెద్ద వ్రణము గనుక దీనిని మాన్పుటకు ప్రయత్నించువారు అమెరికా దేశస్థులైనను, ఆంగ్లేయులైనను, మహమ్మదీయులైనను, మరెవరైనను సరే, దేవుడు వారి యత్నమును సఫలపరచవలెనని ఈ అజ్ఞాత దేశములోని ఏకాంగినైన నేను ప్రార్థించుచున్నాను".

"ఈ దొడ్డివికాని వేరే గొర్రెలును నాకు కలవు; వాటిని కూడ నేను తోడుకొని రావలెను, అవి నా శబ్దము వినును."

లివింగ్‌స్టన్ గారి పనివారియొక్క ధైర్య సాహసములను గురించియు, ఆయనయెడల వారికిగల విశ్వాసమును గురించియు ఇంగ్లాండు దేశములోనివారు విన్నప్పుడు వారు ఆ పనివారి దొడ్డబుద్ధికి మెచ్చుకొని వారిని తగినట్టుగా సన్మానింపగోరి, వారిని ఇంగ్లాండుకు రప్పించ నిశ్చయించుకొని, వారిని పిలుచుకొనివచ్చుటకు రాయబారులను పంపగా కొన్నాళ్లకు రాయబారులు ఆ విశ్వాసశిఖామణులను ఇంగ్లాండుకు తెచ్చిరి.

ఈ మహనీయుని జీవమాన చరిత్రను చదివి ముగించగా ఆయన ముప్పదిరెండేండ్లవరకు పడిన పాట్లకున్ను సహించిన

BROUGHT BY FAITHFUL HANDS
OVER LAND AND SEA
HERE RESTS
DAVID LIVINGSTONE,
MISSIONARY,
TRAVELLER,
PHILANTHROPIST,
BORN MARCH 19.1813,
AT BLANTYRE, LANARKSHIRE,
DIED MAY 1.1873
AT CHITAMBO'S VILLAGE, ULALA.

FOR 30 YEARS HIS LIFE WAS SPENT
IN AN UNWEARIED EFFORT
TO EVANGELIZE THE NATIVE RACES,
TO EXPLORE THE UNDISCOVERED SECRETS,
TO ABOLISH THE DESOLATING SLAVE TRADE,
OF CENTRAL AFRICA,
WHERE WITH HIS LAST WORDS HE WROTE,
"ALL I CAN ADD IN MY SOLITUDE, IS
MAY HEAVEN'S RICH BLESSING COME DOWN
ON EVERY ONE, AMERICAN, ENGLISH, OR TURK,
WHO WILL HELP TO HEAL
THIS OPEN SORE OF THE WORLD."

"OTHER SHEEP I HAVE, WHICH ARE NOT OF THIS FOLD:
THEM ALSO I MUST BRING, AND THEY SHALL HEAR MY VOICE."

"TANTUS AMOR VERI, NIHIL EST QUOD NOSCERE MALIM,
QUAM FLUVII CAUSAS PER SÆCULA TANTA LATENTES."



వెస్టుమిన్‌స్టర్ ఆరామములోనున్న సమాధిమీది రాయి



Page 203

ఆఫ్రికాదేశవాసులు లివింగ్‌స్టన్ సమాధివద్ద మోకాళ్లూనుట

కష్టములకును ఏమి ఫలితము కలిగినది? ఆయన దేశమంతయు తిరిగి, కష్టజీవిగా బ్రతికి, భార్య బిడ్డల నెడబాసి, స్వదేశము విడిచి పరదేశములో నొంటరిగా చచ్చుటవలన నేమి లాభము కలిగినది? అని మన మడుగుదుము గదా. ఆయన కాలములోనే ఆయన కార్యమునకు తగిన ఫలము కనబడకుండినను ఆయనకు తదనంతరముగా ఆయన సంచరించిన దేశములలో కలిగిన యభివృద్ధి చాలా మట్టుకు ఆయన ప్రయాస ఫలితమేయని ఒప్పుకొనక తీరదు. ఆయన యేండ్లకొలది కాలి నడకను ప్రయాణముచేసి మార్గాయాసము ననుభవించిన త్రోవలోనే ఇప్పుడు ఐగుప్తు దేశములోని కైరోపట్టణమునుండి ఆఫ్రికా ఖండముయొక్క దక్షిణ చివరనున్న కేప్ టౌన్ వరకు రైలు నడుచుచున్నది.

తాను కష్టసాధ్యముగా దర్శించిన గ్రామములలో టెలిగ్రాఫ్ వేయుట కాయన వీలుకలుగజేసెను. ఆయన ఆ మారుమూల గ్రామములమధ్య తిరుగుచున్నప్పుడు రెండు మూడేండ్లవరకాయన కొక యుత్తరమైనను ముట్టకుండెను గాని ఇప్పుడాయన పుణ్యఫలితముగా తపాలా క్రమము ఏర్పరచబడెను. ఆయన కాలమునకు ముందు సెట్సీయను విషపుటీగ కాటుకు లెక్కకు మించిన పశువులును మనుష్యులునుకూడ, చచ్చుటవలన గొప్ప గొప్ప ఫలవంత ప్రదేశములు బీడుపడియుండునుగాని ఆయన చేసిన చర్యవలన ఆ విషపుటీగ కాటుకు వైద్యులు విరుగుడు మందు కనుగొనియున్నారు.

ఘాతుకులైన అరబ్బీయులు చేసిన దుష్కార్యములకు లివింగ్‌స్టన్‌గారెంతగా సంకటపడిరో మనము పలుమారు

తెలిసికొనియున్నాముగదా. ఆయన ఆ మానవ దైత్యుల బొట్లబేరమును నివారణచేయుటకు చేసిన ప్రయత్నముల వలననే ఆయన మరణమునకు పిమ్మట పదియేండ్లలోపల ఆయన సంచరించిన ప్రాంత్యములలో ఆ దుష్టవ్యాపారమంతరించెను.

అయినను వీటన్నిటిని మించిన ఒక గొప్ప ఫలితమును ప్రస్తావించనిదే లివింగ్‌స్టన్ యను దైవభక్తుని చరిత్రమును ముగింపదగదు. ఆయన మూలమున ఆ దేశమున కెన్ని లౌకిక మేలులు కలిగినను ఆ గాఢాంధకార ఖండమందు క్రీస్తునాథుని రాజ్యమును స్థాపించుటయే ఆయన ఆఫ్రికా దేశమునకు పోవుటకు కారణమని మొదటనే తెలిసికొంటిమి. ఆయన తుదమట్టుకు ఆ యుద్దేశము ననుసరించి తానెక్కడ వెళ్లినను తన్ను దర్శించినవారికందరికి యేసుక్రీస్తును గురించి బోధించి రక్షణ మార్గమును ప్రకటించెను. ఆయన కాలమందు నిరక్షరకుక్షులై, అతి క్రూర దేవతలను పూజించి నాగరిక వాసన నెరుగని వారిప్పుడు వేలకొలదిగా క్రీస్తు మతమవలంబించి విద్య నభ్యసించి, నాగరికులై, మిగుల ఆద్భుతముగా నభివృద్ధిజెందియున్నారు. వీరిట్లు ఉన్నతదశకు వచ్చుట లివింగ్‌స్టన్‌గారు వారిమధ్య ప్రకటించిన క్రీస్తు సువార్త ఫలితముగాక మరేమున్నది? ఆయన పడిన ప్రయాసము వృథా కాకుండునట్లు ఆయన స్నేహితులును క్రీస్తుమతాభిమానులును ఆ ప్రాంత్యములలో కళాశాలలను కార్ఖానాలను స్థాపించి, ఆ దేశస్థుల క్షేమాభివృద్ధి నిమిత్తము పలు విధములైన సౌకర్యము లేర్పరచినందున లివింగ్‌స్టన్ యొక్క ఆదర్శ



మును నెరవేర్చి నిరర్థక కాంతారమును మనోహరమైన ఉద్యానవనముగా మార్చిరి. ఇది సర్వేశ్వరుని కృత్యము. ఇది మనకు నేత్రోత్సవమాయెను.

ఆ గాఢాంధకారమయమైన దేశమున కింత యద్భుత రూపాంతరము కలుగజేసినవాడెవడు? అతడు ఉన్నత వంశమున పుట్టిన ఆగర్భశ్రీమంతుడు కాదుగాని ఎన్నిక లేని బీద కుటుంబమున జన్మించి, బాల్యమునుండి కష్టార్జితముగా బ్రతికి, తన స్వయత్నమువలన విద్యాధనము సంపాదించి, తన జన్మమును సఫలపరచుటయందు కృతనిశ్చయుడై, తన అభినివేశమువలన కృతార్థుడైన ఒక దీన దరిద్రుడే.

చదువరీ! ఈ దైవభక్తుని చరిత్రను ఆమూలాగ్రముగా చదివిన నీవును దైవకృప సాధారము చేసికొని, క్షేమాభివృద్ధికి స్వశక్తియే పరమోత్కృష్ట సాధనమని గ్రహించి, నీ జీవితముయొక్క పరమార్థమును పొందు మార్గమును గైకొనుము.

సమాప్తము.






C. L. S. PRESS, MADRAS—1926

